ఓమ్.

శ్రీనివాసపరబ్రహ్మణేనమః.



# రాజయోగరత్నాకరము

## తాత్పర్యసహితము.

(పీఠికా ప్రస్తావనములతోడ)




ఓ, వై, శ్రీ, దొరసామయ్యచే

సంపాదింపఁబడినది.





చెన్నపురి.

కళారత్నాకరముద్రాక్షరశాల.

1909.




[వెల 3—0—0

# పీఠిక.

---

ఈ 'రాజయోగరత్నాకరము' అను గ్రంథము వేదాంతవిద్యాభిలాషుల యుపయోగార్థము ప్రకటమైనది. దీనికిం గారణ మేమన; నాచే నాంధ్రీకరింపఁబడి ప్రకటీకృతములైన పాతంజలయోగశాస్త్రము, విచారసాగరము, హఠయోగప్రదీపిక, మొదలగు వేదాంతగ్రంథములం గాంచిన వారిలోఁ గొందఱు వేదాంతవిషయములను మననము చేయుటకును; యోగ తత్త్వ రహస్యములను తర్కోక్తులచేఁగాక సుబోధముగాఁ దెలిసికొనుటకును; దగిన ట్లేదేని యొక యుత్తమ వేదాంతగ్రంథమును బ్రకటింపుఁడని పలుమఱు తెలియఁబఱచుచుండిరి. ఇప్పుడు అట్టివారి కోర్కె కొనసాగుటకును, పరమార్థవిషయములు ప్రకటమగుటకును, సమయము సంఘటించి యీగ్రంథము సమగ్రమైనది.

ఇందలి విషయము లనేకములను మహాత్ములు నాయందలి వాత్సల్యంబునం జేసి యొసంగిరిగాని, తత్తద్విషయానుగుణ్యముగా ప్రమాణములను సంపాదించుటయందును, ప్రకరణములను విభజించుటయందును, ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధవిషయములను ప్రశ్నోత్తరరూపములుగా సంప్రదాయవిరుద్ధములేక సంయోజించుటయందును గలిగిన శ్రమమును గూర్చి వ్రాయ నలవికాదు. అయినను భగవదనుగ్రహమువలనను, పెద్దల కృపవలనను గ్రంథము సంపూర్ణమయ్యెను. ఇఁక సజ్జనులు సహాయులై శ్రమసార్థకము చేయుదురేని యిట్టి యుద్గ్రంథము లనేకములు వెలువరింపనగును. సాధువర్తనులగు సజ్జనులు సమయోచితమును సద్గ్రంథప్రకటన ప్రయోజనము నెఱుంగుదురు గాన విశేషముగా విన్నవింపఁ బనిలేదని విరమించినాఁడను.

'విద్యావతి' ఆఫీసు
మద్రాస్; ఇ.
1909 సం.

ఇట్లు
రాజయోగరత్నాకర
సంపాదకుఁడు
ఓ. వై. శ్రీ-దొరసామయ్య.

# ప్రకటన.

విచారసాగరము:— ఇది హిందీగ్రంథమునకు సరైన తెనుఁగు. దీనిచే వేదాంతవిషయమంతయు బోధమగును. 2—12—0

సకలార్థసాగరము:— తెనుఁగువచనము. ఇందుచే ప్రపంచమునంగల సకలమతములు, సకలమతాచార్యుల చరిత్రములు, సకలశాస్త్రవిషయములు తెలిసికొనవచ్చును. 1—12—0

కవిరాక్షసీయము:— తెనుఁగు టీకాతాత్పర్యముతో. 0—8—0

లోకరహస్యము:— ఇందు నూఱు ఉపన్యాసములు కలవు. లోకవ్యవహారమంతయు చక్కఁగా బోధమగును 0—8—0

బుద్ధచరిత్ర:— బౌద్ధధర్మము, బౌద్ధసంఘము, బౌద్ధమతము 0—8—0

ఏకమూలికాప్రయోగరత్నావళి:— ప్రథమభాగము. 0—8—0

ధనంజయనిఘంటు:— టీకతోను ఉదాహరణముతోను 0—6—0

అద్వైతోపదేశపంచరత్నములు:— టీకాసహితము 0—2—0

సర్వసారోపనిషత్తు:— తెనుఁగు తాత్పర్యముతో ... 0—2—0

ఆత్మబోధోపనిషత్:— తెనుఁగు తాత్పర్యముతో ... 0—1—0

పాతివ్రత్యలక్షణము, సత్పురుషలక్షణము:— తెనుఁగు తాత్పర్యముతో ... ... 0—1—0

నారదభక్తిసూత్రములు:— ఆంధ్ర తాత్పర్యముతో 0—2—0

హఠయోగప్రదీపిక:— తెనుఁగు తాత్పర్య విశేషార్థములతోడను, 104 యోగాసన పటములతోడను, రాజయోగలక్షణముతోడను, అచ్చులోనున్నది. ... 3—0—0

పాతంజలయోగశాస్త్రము:— భోజదేవవృత్తితోడను, ఆంధ్రటీకాతాత్పర్యముతోడను, అచ్చులోనున్నది... 2—8—0

ఇట్లు

సి. దొరసామయ్య,

'విద్యావతి' ఆఫీసు, మద్రాస్; ఇ.

# విషయసూచిక.

ఓమ్

శ్రీనివాసపరబ్రహ్మణేనమః.

# రాజయోగరత్నాకరము.

## తాత్పర్యసహితము.

## ఉపదేశప్రకరణము.

### అవతారిక.

గ్రంథకర్త రాజయోగరత్నాకర మను స్వగ్రంథ నిర్విఘ్నార్థమై మంగళప్రదుండును సృష్టి స్థితి విలయకారణుండును నగు భగవంతుని ధ్యానించుచున్నాఁడు.

### మంగళాచరణము.

శ్లో. నమోహిరణ్యగర్భాయ హరయేశంకరాయచ,
వాసుదేవాయసారాయ సర్గస్థిత్యంతకారిణే.

తాత్పర్యము. హిరణ్యగర్భుఁడును, హరియును, శంకరుఁడును వాసుదేవుఁడును, నాశరహితుఁడును, సృష్టి స్థితి లయములకు కారణపురుషుఁడును, అగు భగవంతునికొఱకు నమస్కారము.

### భగవన్మహిమ.

శ్లో. ఆదిసర్గేమహావిష్ణు స్స్వప్రకాశోజగన్మయః,
గుణభేదమధిష్ఠాయ మూర్తిత్రయభవాత్మవాన్. ౧

తా. ఆదిసృష్టియందు స్వప్రకాశముగను జగద్రూపముగనునుండు నారాయణుఁడు సత్త్వరజస్తమములనెడి గుణభేదముచేత విష్ణు బ్రహ్మ రుద్రులైనాఁడు.

అవ. త్రిమూర్తిస్వరూపుఁడు నారాయణుఁ డని విశదీకరించుచున్నాఁడు.

భగవద్గుణ స్వరూపము.

శ్లో. హిరణ్యగర్భో రజసా తమసా శంకరస్స్వయమ్,
సత్త్వేన సర్వగో విష్ణు స్సర్వాత్మత్వే మహేశ్వరః. 3.

తా. ఆ భగవంతుఁడు రజోగుణముచేత బ్రహ్మగను, తమోగుణము చేత రుద్రుఁడుగను, సత్త్వగుణముచే విష్ణువుగను నున్నాఁడు. ఆ విష్ణువు సర్వాత్మగా నుండుటవలన మహేశ్వరుఁ డనఁబడుచున్నాఁడు.

విశేషార్థము. మహేశ్వరుఁడని చెప్పుటవలన పరమశివుఁడనియు గ్రహింపఁ దగును.

భగవద్రూపము.

శ్లో. నారాయణోఽక్షరోఽనంత స్సర్వవ్యాపీ నిరంజనః,
తేనేదమఖిలంవ్యాప్తం జగత్స్థావరజంగమమ్. ర.

తా. నాశరహితుఁడును, ఆద్యంతములు లేనివాఁడును, సర్వవ్యాపియును, పరిశుద్ధుఁడును అగు నారాయణునియందు స్థావరజంగమాత్మక ప్రపంచంబంతయు వ్యాప్తమై యున్నది.

వి. భగవంతుండొకఁడే సకలప్రపంచమై యున్నాఁడని భావము.

అవ. శిష్యుఁడు గురువును జూచి, స్వామీ! ప్రపంచమంతయు పరమాత్మయగు భగవంతునిచేతనే నిర్మింపఁబడినదని బోధించితిరి. తద్విధంబు నుపదేశింపవలయునని వేఁడిన శిష్యునితో, సద్గురూపదేశముచే నెఱుంగఁ దగినదగుఁగా, శిష్యుఁడు సద్గురులక్షణంబు నుపదేశింపవలయునని యడుగ ఆచార్యుం డిట్లనుచున్నాఁడు.

## సద్గురు లక్షణము.

శ్లో. ఆచార్యఏవ సంసార మోచకప్రద ఉచ్యతే,
ఆచార్యోనామ వేదాన్త విచారేణాత్మవేదినః. ౫.

తా. సంసారమైన జననమరణదుఃఖమునుండి వెలువడునట్లుచేయు వాఁడును, వేదాంతవిచారముచేతఁ బొందిన ఆత్మజ్ఞానము కలవాఁడును, గురువనఁబడును.

వి. వేదాంతవిచారము చేయనివాఁడును, వేదాంతవిచారము చేసియు ఆత్మజ్ఞాని కానివాఁడును, ఆచార్యుఁడు కాఁడని భావము.

అవ. గురుమహిమను బోధించుచున్నాఁడు.

## గురు మహిమ.

శ్లో. గురురేవపరోధర్మో గురురేవ పరాగతిః,
యస్యదేవేపరాభక్తి ర్యథాదేవే తథాగురౌ. ౬.
సబ్రహ్మవిత్పరంప్రేయా దితి వేదానుశాసనమ్,

తా. గురువే శ్రేష్ఠమైన ధర్మము, గురువే ఉత్తమమైన స్థానము, ఎవనికి దైవమం దెట్టిభక్తికల్గియున్నదో అట్టిభక్తి ఆచార్యునియందును కల్గియుండఁదగినది. ఇట్లు భక్తికల్గిన శిష్యుఁడు బ్రహ్మవేత్తయగునని వేదాభిప్రాయము.

అవ. గురుశబ్దార్థమును వ్యాఖ్యానించుచున్నాఁడు.

## గురు శబ్దార్థము.

శ్లో. గురురేవపరంబ్రహ్మ గురురేవపరాగతిః. ౭.
గుశబ్దస్త్వంధకారస్స్యాత్ రుశబ్దస్తన్నిరోధకః,
అంధకారనిరోధత్వా ద్గురురిత్యభిధీయతే. ౮.

తా. గురువే పరబ్రహ్మము, గురువే సద్గతి, గు వర్ణము అంధకారము, రు వర్ణము అంధకారమును నిరోధించునది, అజ్ఞానాంధకారమును బోఁ గొట్టుటవలన గురువని చెప్పంబడును.

శ్లో. గుకారశ్చగుణాతీతో రుకారోరూపవర్జితః,
గుణాతీతమరూపంచ యత్తత్త్వంసగురుఃస్మృతః. ౯.

తా. గు, అనునక్షరము గుణాతీతమైన పరమాత్మ; రు,అనునక్షరము నామరూప వివర్జితము, అట్టి గుణాతీత నామరూపరహిత తత్త్వమే గురువని చెప్పఁబడును.

వి. గురువనేడి పరమాత్మ, నామరూపసహిత శిష్యుని తద్రహిత ముగాఁ జేయును. అనఁగా జీవబ్రహ్మైక్య స్థితినొసంగును.

అవ. ఆచార్యుఁ డిట్టివాఁడని నిరూపించుచున్నాఁడు.

గురు నిరూపణము.

శ్లో. అల్పంవాబహువాయస్య శ్రుతస్యోపకరోతియః,
తమపీహగురుంవిద్యా చ్ఛ్రుతోపక్రియయాతయా.

తా. శాస్త్రవిషయమును (తత్త్వమును) కొంచెముగనైనను,గొప్ప గనైనను ఎవఁడు చెప్పనో వాఁడు గురువని తెలియవలయును.

అవ. శిష్యుఁడు గురువునకివిసమర్పింపవలయునని తెల్పుచున్నాఁడు.

గురు సమర్పణము.

శ్లో. కర్మణామనసావాచా గురూణాంభక్తవత్సలాః,
శరీరమర్థంప్రాణంచ సద్గురుభ్యో నివేదయేత్. ౧౧.

తా. కాయముచేతను మనస్సుచేతను వాక్కుచేతను గురువు నందు భక్తికలవాఁడు తనశరీరమును ధనమును ప్రాణమును సమర్పింప వలయును.

అవ. గురు శుశ్రూషాదులనుగూర్చి యనువదించుచున్నాఁడు.

## గురు భక్తి.

శ్లో. గురుశుశ్రూషణంకార్యం గురోర్వాక్యానువర్తనమ్,
సదా గురుపరోనిత్యం గురోరాజ్ఞాంనలంఘయేత్

తా. గురుశుశ్రూష చేయవలయును. గురువుచెప్పినట్లు నడుచుకొనవలయును. సదా గురుసన్నిధియం దుండవలయును. గుర్వాజ్ఞను మీఱరాదు.

అవ. గురుకటాక్ష మహిమను అనువదించుచున్నాఁడు.

## గురుకటాక్షమహిమ.

శ్లో. దుర్లభోవిషయత్యాగో దుర్లభంతత్త్వదర్శనమ్,
దుర్లభాసహజావస్థా సద్గురోః కరుణాంవినా. ౧౩.

తా. సద్గురువుయొక్క కృపలేక విషయవాసనలు నాశము కాదు. తత్త్వదర్శనమును కలుగదు. సహజావస్థయనెడి మోక్షము లభించుటయు దుర్లభము.

శ్లో. సూర్యస్యోదయమాత్రేణ సూర్యకాంతఃప్రకాశతే,
గురోరాలోక్యమాత్రేణ శిష్యోబోధేనభాసతే. ౧౪.

తా. సూర్యోదయ మాత్రముచే నెవ్విధముగ సూర్యకాంతమణి శోభిల్లునో, అట్లు గురుకటాక్షమాత్రముచేత శిష్యుఁడు సుజ్ఞానముతో ప్రకాశించును.

శ్లో. రసవేధాద్యథాలోహో హేమతాంప్రతిపద్యతే,
గురోఃకటాక్షవేధేన ముక్తోభవతి మానవః. ౧౫.

తా. స్పర్శవేధచేత నెట్లు ఇనుము బంగారమగుచున్నదో, అట్లు గురుకటాక్షమనెడి వేధచేత శిష్యుఁడు సర్వసంగపరిత్యాగియై ముక్తుఁ డగుచున్నాఁడు.



అవ. గురువును శరణుపొందనివాని జన్మము వ్యర్థమని చెప్పుచున్నాఁడు.

## గురువిహీన ప్రాణిగతి.

శ్లో. పతిహీనా యథానారీ మాతృహీనో యథాశిశుః,
గురుహీనస్తథాప్రాణీ తస్య జన్మ నిరర్థకమ్. ౧౬.

తా. పతిలేని స్త్రీయును, తల్లిలేని బిడ్డయును, ఎట్లు వ్యర్థమో; అట్లు గురువులేని జన్మమును వ్యర్థము.

అవ. సర్వయాత్రలకంటె గురుసన్నిధికేఁగుట శ్రేష్ఠమనుచున్నాఁడు.

## గురుసన్నిధిగమనఫలము.

శ్లో. దేవయాత్రా గురోర్యాత్రా తీర్థయాత్రేతిచ త్రిధా,
ఆసాం త్రివిధయాత్రాణాం గురుయాత్రా ఫలాధికాః.

తా. దేవాలయములకేఁగుట, తీర్థస్నానములకేఁగుట, గురుసన్నిధికేఁగుట, అను నీమూఁడు యాత్రలకంటెను గురుసన్నిధికేఁగుట విశేషఫలప్రదంబని యెఱుఁగవలయును.

## గురునమస్కారక్రమము.

శ్లో. పదేపదాంతరంన్యస్య కరౌ చలనవర్జితౌ,
స్తుతిర్వాచా హృదిధ్యానం చతురంగం ప్రదక్షిణమ్.

తా. గురువుయొక్క పాదములను కుడిచేతితో కుడి పాదమును ఎడమచేతితో నెడమపాదమును చలనములేక స్పృశించికొని, గురువును వాక్కుచే స్తోత్రమును, మనస్సునందు ధ్యానమును చేయవలయును. తర్వాత ప్రదక్షిణము చేయవలయును. ఇది చతురంగమనఁబడును.

వి. 1 చేతులతో పదస్పర్శముచేయుట, 2 వాక్కుతో స్తుతించుట, 3 మనస్సున ధ్యానించుట, 4 ప్రదక్షిణముచేయుట.



అవ. స్వామీ! సద్గురులక్షణాదులను దెలిసికొంటిని. శిష్యలక్షణం బెట్టిదని యానతీయవలెనని ప్రార్థింపఁగా ఆచార్యుఁ డిట్లు వచించుచున్నాఁడు.

## శిష్యలక్షణము.

శ్లో. నాస్తిక్యంవేదనిందాంచ దేవతానాంచకుత్సనమ్,
ద్వేషందంభంచమానంచ క్రోధంతైక్ష్ణ్యంచవర్జయేత్.

తా. పరలోకము లేదను బుద్ధియును, వేదవేదాంతములను నిందించుటయును, దైవమును దూషించుటయును, శత్రువులయందు విరోధమును, డంబమును, అహంకారమును, కోపమును, క్రూరస్వభావమును వర్జింపవలయును.

వి. పైనచెప్పిన లక్షణములు కలవాఁడే శిష్యుఁడనియును, ఇట్టి లక్షణములచేత నితర శిష్యలక్షణములు స్వతస్సిద్ధముగ నమరుననియును బోధమయ్యెడిని.

అవ. ఇట్టివారిని హింసింపరాదని చెప్పుచున్నాఁడు.

## పూజ్యులు.

శ్లో. ఆచార్యంచప్రవక్తారం పితరం మాతరం గురుమ్,
నహింస్యాద్బ్రాహ్మణాన్గాశ్చ సర్వాంశ్చైవతపస్వినః.

తా. విద్యాగురువు, మంత్రోపదేశముచేసిన గురువు, తండ్రి, తల్లి, వేదాంతోపదేశ మొనర్చిన గురువు, బ్రాహ్మణులు, పశువులు, తపోత్తములు, అగు వీరిని హింసింపరాదు. (ఈచెప్పఁబడినవారు పూజార్హులని భావము).

వి. తల్లిని తండ్రిని హింసింపరాదనుటచే, వారు సజీవులైగాని, లేక తనకంటె సంరక్షకులు వేఱెవ్వరును లేక పోయినపుడుగాని, తాను వారిని విడిచిపెట్టి, సన్న్యసింపరాదు. కావుననే భారతమునందు యక్షప్రశ్నలకు త్తరమిచ్చినపుడు ధర్మరాజు, భూమికన్న విస్తృతమైన యది తల్లియనియును, ఆకసమునకన్న ఉన్నతమైనవాఁడు తండ్రియనియును జెప్పెను.

అవ. ఆచార్యుఁడు శిష్యుని మనోస్థితినెఱింగి గురూచ్ఛిష్ట గురు పాదోదక ప్రభావంబును బోధించుచున్నాఁడు.

## గురూచ్ఛిష్ట గురుపాదోదక మహిమ.

శ్లో. గురుపాదోదకస్నానం గురూచ్ఛిష్టంతుసేవయేత్,
గురుమూర్తింసదాధ్యాయేత్ గురునామంసదాజపేత్
గురూచ్ఛిష్టప్రసాదేన ఆముష్మికఫలం లభేత్,
గురుపాదోదకంనిత్యం సేవేత పరమాంగతిమ్. ౨౨.

తా. గురుపాదోదక స్నానముచేతను, గురుపాదోదకమును సేవించుటచేతను, గురూచ్ఛిష్టమును భుజించుటచేతను, సదా గురువును ధ్యానము చేయుటచేతను, సదా గురునామమును జపించుటచేతను, ఆముష్మికఫలము సిద్ధించును.

అవ. గురుపాదోదక స్వీకరణము నీవిధముగాఁ జేయవలయునని చెప్పుచున్నాఁడు.

శ్లో. అవిద్యామల నాశాయ జన్మ కర్మ నివృత్తయే,
జ్ఞాన సౌభాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకం శుభమ్.

తా. జన్మమునకును సంసారమునకును గారణమైన అవిద్యా మల నివృత్తికొఱకును, కాయిక వాచిక మానసిక కర్మనివృత్తికొఱకును, జ్ఞాన ప్రదముకొఱకును, శుభము (సర్వదుఃఖ నివృత్తి) అయినట్టిది అస్మద్గురు చరణ తీర్థము. అనెడి భావముతో స్వీకరింప వలయును.

అవ. ఇట్లాచార్యుఁడు ఉపదేశింపఁగా, శిష్యుఁడు తద్విధంబుగ వర్తించినవాఁడై గురుమూర్తిని యివ్విధమున స్తుతించుచున్నాఁడు.

## గురు స్తుతి.

శ్లో. గురుచరణం భవహరణం
శరణగతాభరణమూతసుఖకరణమ్,

మరణభయా దుత్తరణం
తరుణారుణకిరణ వరణ మహా మీడే. ౨౮.

తా. సంసార దుఃఖమును (పాపమును, లేక జన్మమును) బోఁ గొట్టునదియును, ఆశ్రితులను (శరణాగతులను) సంరక్షణము చేయునదియును, ఆత్మానందకారి యైనదియును మరణ భయమునుండి ఉద్ధరించునదియును (పునర్జన్మమును నశింపఁ జేయునదియును), అగు గురువు యొక్క చరణకమల బాలారుణప్రకాశముచేత నావరింపఁబడిన నేను (అట్టి చరణములను) స్తోత్రము చేసెదను.

వి. భక్తి పురస్సరముగా గురువును నాశ్రయించిన శిష్యునికే సదుపదేశమును గురుప్రసాదంబును లభించును. దీనికిం బ్రమాణము శంకర సంహితయందు చెప్పఁబడియున్నది. ఎట్లన:— "నత్వాభక్తిపురస్సరం గురువరం విజ్ఞాయ తత్పార్శ్వతః స్థిత్వా జన్మశతాగతాద్భవభయాద్భీతోఽస్మి మాంపాహిభో, ఇత్యుక్తో గురురాదరేణ కృపయాశిష్యం సమీపస్థితం స్పృష్ట్వా పాణితలేన సాధు గదితం ప్రీతోఽస్మివత్సత్వయా".

అవ. ఇట్లు ఆచార్యుని స్తుతియించి దీనుఁడై నిలువంబడి గుర్వాజ్ఞ కెదురు చూచుచుండిన శిష్యుని భక్తి వాత్సల్యంబునకు మెచ్చి, కూర్చుండ నియోగించి, శిష్యుఁడా! సద్గురువు సచ్ఛిష్యుని స్వాత్మానుభవసంపన్నునిం జేసి సద్యోముక్తిని యొనఁగూర్చును. తద్విషయంబున మగ్నునిం జేయుటకు పూర్వము జన్మాదికారణంబుల నెల్ల వివరింప వలసినది యత్యావశ్యకం బగుటంబట్టి, తన్నిమిత్తకారణమైన సృష్టిక్రమంబును బ్రథమమున నుపదేశించెద వినుమని చెప్పుచున్నాఁడు.

## సృష్టిక్రమము.

శ్లో. యోసావతీంద్రియగ్రాహ్య సూక్ష్మోఽవ్యక్తస్సనాతనః,
సర్వభూతమయోఽచింత్య స్సఏవ స్వయముద్బభౌ. ౨౯.

తా. నేత్రాదీంద్రియములచే నెఱుఁగఁబడని వాఁడును, మనస్సు చేతనే తెలిసికొనఁదగిన వాఁడును, రూపము లేనివాఁడును, శాశ్వతుఁడును, సర్వభూతమయుండును, చింతింప నలవిగానివాఁడును, అగు భగవంతుఁడు తానె స్వయముగా ప్రళయకాలానంతరమున మహదాది కార్యరూపుఁడై (పంచమహాభూతాకృతియై) ప్రాదుర్భవించెను.

శ్లో. సోఽభిధ్యాయశరీరాత్స్వా త్సిసృక్షుర్వివిధాః ప్రజాః,
అప ఏవ ససర్జాదౌ తాసు బీజమవాసృజత్. ౨౬.

తా. ఆ పరమాత్మ సకల జీవులను సృష్టింప నిచ్ఛకలవాఁడై తన శరీరమునందుండి మొదట జలమును కలుగఁజేసి దానియందు తన శక్తి రూపమగు బీజమును నుంచెను.

బ్రహ్మోత్పత్తి.

శ్లో. తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభమ్,
తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః. ౨౭.

తా. ఆబీజము భగవంతుని యిచ్ఛాప్రకారము స్వర్ణమువంటి కాంతియును, సూర్యునివంటి తేజస్సును గల అండమాయెను. అందుండి సర్వలోకపితామహుఁడను బ్రహ్మదేవుఁ డుద్భవించెను.

వి. భగవంతుని నాభికమలంబుననుండి బ్రహ్మదేవుఁ డుద్భవించెనని యును; రుద్రునియొక్క ఇచ్ఛాప్రకారము సృజింపఁబడిన అండము నందుండి మొదట విష్ణువును, ఆవిష్ణువు వలన బ్రహ్మదేవుఁడును జన్మించిరని యును; శివుఁడే విష్ణు బ్రహ్మలను సృజియించెననియును; కొన్ని పురాణములయందు గన్పట్టుచున్నయది. అయినను పురాణాదులం దాయామూర్తులయొక్క ఆధిక్యతను జెప్పుటకై యివ్విధముగాఁ జెప్పఁబడి యున్నది. నామభేదంబె కాని వస్తు భేదంబులేదు కావున బాధకంబులేదు.



## అండవిభాగము

శ్లో. తస్మిన్నండేనభగవా నుషిత్వా పరివత్సరమ్,
స్వయమేవా త్మనోధ్యానా త్తదండ మకరోద్ద్విధా. ౨౮.

తా. ముందు చెప్పిన అండమునందు బ్రహ్మదేవుఁడు ఒక సంవత్సర మువసించి తన మనస్సునందా యండమును రెండు ఖండములగునట్లు తలంచెను.

వి. బ్రహ్మదేవునియొక్క సంవత్సర నిర్ణయము:—మనుష్యులయొక్క ఒక సంవత్సరము దేవతలకు ఒక దినము. ఇట్టి దినములు ౩౬౦ దేవతల కొక సంవత్సరము. ఇట్టి దేవమాన సంవత్సరములు పండ్రెండువేలు దేవతల కొకయుగము. ఇట్టి యుగములు వేయియైనయెడల బ్రహ్మకు ఒక్క దినము. దీనికిం బ్రమాణము :— "త్రుట్యాదయః ఖండకాలా స్సూక్ష్మాశ్చ మూర్తసంజ్ఞికాః, ప్రాణాదయః ఖండకాలా జ్ఞేయాస్స్థూలాశ్చమూర్తకాః. తతస్తదారభ్య వచ్మి ప్రాణైష్షడ్భిర్వినాడికా, షష్ట్యావినాడికానాంతు నాడీ ప్రోక్తాముకుర్ముహుః. భచక్రభ్రమణం నాడీ షష్ట్యాసంపూర్యతేసకృత్, తదేక భ్రమణం తద్‌జ్ఞై ర్నాక్షత్రదినముచ్యతే. ఉదయాదుదయం భానో స్సావనాఖ్యందినంనృణాం, త్రింశద్భి ర్నాక్షత్రదినై ర్నాక్షత్రో మాసఇష్యతే. త్రింశద్భి శ్చాంద్రతిథిభి శ్చాంద్రమాసాస్తు పావనః, సావనైస్తిథిభిస్తద్వ త్సంక్రాంత్యా సౌర ఈరితః. సౌరోబ్దస్స్యాద్భాస్కరస్య జ్యోతిశ్చక్రపరిభ్రమః. ససంక్రాంతిద్వాదశకో దివ్య వాసర సంజ్ఞికః. ఖచతుష్క ద్విత్రివేదై స్సౌరవర్షైశ్చతుర్యుగమ్, ఖఖఖార్కై ర్దివ్యవర్షై స్తదేవహిమహాయుగమ్". త్రుటి లవ నిమేష గుర్వక్షరోచ్చారణసంజ్ఞలు అస్పష్టములుకాఁబట్టి సూక్ష్మము లనఁబడినవి. సూటియైన సూదితో నొకతామరపూవును గ్రుచ్చిన అందు సూదిమొన ఒకదళమును విడిచి మఱియొక దళమునంటుకొను నంతటికాలమునకు త్రుటియని పేరు. నూఱు త్రుటులైన నొకలవము. ముప్పదిలవములైన నొకనిమిషము. ఇరువదియేడు

నిమేషములు ఒకగుర్వక్షరోచ్చారణకాలము. అని ప్రాచీనులచేత చెప్పఁబడి
నవి. ప్రాణాది ఖండకాలములు స్పష్టంబులుగాన స్థూలములనఁబడినవి.
కనుక నది మొదలుకొని చెప్పెదము. ఆఱుప్రాణముల కొక విగడియ: అఱు
వది విగడియల కొక గడియ. అఱువది గడియల కొకమాఱు నక్షత్రమం
డలము ఒకచుట్టుచుట్టి యథాస్థానము నొందుటచేత మనుష్యమానముతో
నట్టి భ్రమణ మొక్కటికి నాక్షత్రదినమని పేరు. సూర్యుఁ డుదయించినది
మొదలు మరల సూర్యోదయ మగునంతకాలము సావనదినం బనఁబ
డును. ముప్పది నాక్షత్రదినములయిన నొక నాక్షత్రమాసము. ముప్పది
చాంద్రతిథులనఁగా శుక్లప్రతిపదాది మొదలు మఱల శుక్లప్రతిపదాదిపర్యం
తము చాంద్రమాసము. ముప్పది సావనదినములనఁగా ముప్పది సూర్యో
దయములు సావనమాసము. రవి యొక్కొకరాశిని ప్రవేశించుట యనఁగా
నొక్కొక సంక్రాంతి యొక్కొక సౌరమాస మనఁబడును. పండ్రెండు
సంక్రాంతులనఁగా సూర్యుఁ డశ్వినీప్రథమకల నుండి మఱల నశ్వినీప్రథ
మకలకు చుట్టివచ్చువఱకు నొక సౌరవత్సర మనఁబడును. ఇదియే దేవరా
క్షసుల కొకదినము. ఉత్తరాయనము దేవతలకు పగలు. రాక్షసులకు
రాత్రి. దక్షిణాయనము దేవతలకు రాత్రి. రాక్షసులకు పగలు. నలువది
మూఁడులక్షల యిరువదివేల సంవత్సరములకు నాల్గుయుగములు. కృత
యుగము ౧౭౨౮౦౦౦, త్రేతాయుగము ౧౨౯౬౦౦౦ ద్వాపరయుగము
౮౬౪౦౦౦, కలియుగము ౪౩౨౦౦౦, ఇవి నాల్గుచేరిన మహాయుగమనఁ
బడును. దీనికే దేవమానముతో ౧౨ వేల సంవత్సరములగును.

### అండవిభాగ లోకసృష్టిక్రమము.

శ్లో. తాభ్యాం సశకలాభ్యాంచ దివంభూమించనిర్మమే,
మధ్యేవ్యోమదిశశ్చాష్టా వపాంస్థానంచశాశ్వతమ్.

టీ. ఆ రెండు ఖండములలో మీఁదిఖండముచేత స్వర్గలోకమును,
క్రిందిఖండముచేత భూమిని, మధ్యభాగమునం దాకాశమును, అష్టదిక్కు
లును, సముద్రమును సృజియించెను.



## నవబ్రహ్మోత్పత్తి.

శ్లో. బ్రహ్మణస్తుమరీచ్యాద్యాః నవాద్యాఃసాధకాఃస్మృతాః
తతో దేవాఽసురపితౄన్ మనుష్యానసృజత్ప్రభుః.

తా. బ్రహ్మదేవుఁడు మరీచి మొదలగు తొమ్మండుగురు సృష్టిసాధకులనఁబడు నవబ్రహ్మలను సృజించెను. అనంతరము దేవతలను, రాక్షసులను, పితృదేవతలను, మనుష్యులను సృజించెను.

అవ. నవబ్రహ్మల నామములను జెప్పుచున్నాఁడు.

## నవబ్రహ్మనామములు.

శ్లో. మరీచిమత్ర్యంగిరసం పులస్త్యపులహక్రతూన్,
దక్షకశ్యపభృగ్వాదీన్ ఋషీనగ్రేఽసృజత్ప్రభుః.

తా. ఆబ్రహ్మదేవుఁడు మరీచి, అత్రి, అంగిరస, పులస్త్య, పులహ, క్రతు, దక్ష, కశ్యప, భృగు అను నవబ్రహ్మలను (నవఋషులను) సృజించెను.

వి. కొన్ని గ్రంథములయందు దశఋషులని చెప్పఁబడియున్నది. "మరీచిమత్ర్యంగిరసౌ పులస్త్యం పులహం క్రతుమ్, ప్రచేతసం వసిష్ఠంచ భృగుంనారదమేవచ" మరీచి, అత్రి, అంగిరస, పులస్త్య, పులహ, క్రతు, ప్రచేతస, వసిష్ఠ, భృగు, నారద, అను నీపదుగురు.

అవ. బ్రహ్మదేవుఁడు నవబ్రహ్మల నెట్లు సృష్టిచేసెనని యడిగిన శిష్యునికి యాచార్యుం డిట్లని చెప్పుచున్నాఁడు.

## విరాట్పురుషోత్పత్తి.

శ్లో. ద్విధాకృత్వాత్మనోదేహ మర్ధేనపురుషోభవత్,
అర్ధేననారీ తస్యాంస శిరాజ మసృజత్ప్రభుః. ౩౨.

తా. ఆ బ్రహ్మదేవుఁడు తన శరీరమును రెండు భాగములుచేసి కుడి భాగమును పురుషునిగను, ఎడమభాగమును స్త్రీనిగను నిర్మించి, తదుభయ సంయోగముచే విరాట్పురుషుని కలుగఁజేసెను.

వి. ఆవిరాట్పురుషుఁడే సర్వమును సృజించువాఁడై, తత్సాధనార్థమై నవబ్రహ్మలను సృష్టించెనని భావము.

అవ. స్వామీ! భగవంతుఁడగు ఆదినారాయణుఁడు బ్రహ్మను, బ్రహ్మ విరాట్టును, విరాట్టు నవబ్రహ్మలను సృష్టించుటకు సామగ్రి లేవియో వాని నానతీయఁడని వేఁడిన శిష్యునికి యాచార్యుం డివ్విధముగాఁ జెప్పుచున్నాఁడు.

## మహత్తత్త్వాది సృష్టి.

శ్లో. ఉద్వవర్హాత్మనశ్చైవ మనస్సదసదాత్మకమ్,
మనసశ్చాప్యహంకార మభిమంతారమీశ్వరమ్.

తా. ఆబ్రహ్మదేవుఁడు జ్ఞానముచేఁ దెలియఁ బడుటవలన సత్తనియును; నేత్రాదులకు గోచరింప నందువలన అసత్తనియును చెప్పఁబడు మనస్సును కలుగఁజేసెను. మనస్సుకంటె పూర్వము అభిమానమనెడి అహంకారమును కలుగఁజేసెను.

వి. బ్రహ్మదేవుఁడు ముందుగా అహంకారమును కలుగఁజేసి తర్వాత మనస్సును కలుగఁజేసెనని యభిప్రాయము.

అవ. అహంకార మొకదానిచేతనే ప్రపంచోత్పత్తి యాయెనా? అని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లని చెప్పుచున్నాఁడు.

శ్లో. మహాంతమేవచాత్మానం సర్వాణిత్రిగుణానిచ,
విషయాణాంగ్రహీతౄణి శనైఃపంచేంద్రియాణిచ.

తా. ఆ పరమాత్మ అహంకారమును సృష్టించుటకు ముందే ఆకాశము వాయువు అగ్ని జలము పృథివి అను పంచభూతములను, సత్త్వ రజ

స్థములను త్రిగుణములను, శబ్దస్పర్శరూపరసగంధములనెడి పంచవిషయ ములను గ్రహింపఁదగిన శ్రోత్ర త్వక్చక్షు జిహ్వా ఘ్రాణములను జ్ఞానేంద్రియ పంచకమును సృష్టించెను.

వి. మనస్సుకంటె ముందుగ అహంకారమును, అహంకారము కంటె ముందుగ ఆకాశాది భూతములను గలుగఁజేసెనని తెలియవలయును.

శ్లో. అణ్వ్యోమాత్రాఽవినాశిన్యో
దశార్ధానాంతు యాః స్మృతాః,
తాభి స్సార్ధ మిదం సర్వం
సంభవ త్యనుపూర్వశః. 3౫.

తా. పంచమహాభూతములయొక్క సూక్ష్మరూపములైన తన్మాత్రలచే స్థూలముగను సూక్ష్మముగను నుండు నీప్రపంచము గలిగెను.

భూలోక సృష్టి.

శ్లో. తేషామిదంతు సప్తానాం
పురుషాణాం మహౌజసామ్,
సూక్ష్మాభ్యోమూర్తిమాత్రాభ్య
స్సంభవత్యవ్యయాద్వ్యయమ్. 3౬.

తా. మున్ను చెప్పఁబడిన పంచతన్మాత్రలు, మహత్తత్త్వము, అహంకారము అను నీ యేడింటి సంబంధమువలన అశాశ్వతముగు నీభూలోకము గలిగెను.

సర్వభూత సృష్టి.

శ్లో. తేషాంత్వవయవాన్సూక్ష్మాన్ షణ్ణామప్యమితౌజసామ్,
సన్నివేశ్యాత్మమాత్రాసు సర్వభూతాని నిర్మమే. 3౭.

తా. ఇదివఱకుఁ జెప్పిన ఆకాశాది పంచభూతములను, అహంకారమును, ఇంద్రియములతోఁ జేర్చి మనుష్య మృగ పక్షులాదిగాఁ గల వానిని నిర్మించెను.

## గుణవిశేష జీవసృష్టి.

శ్లో. సాత్త్వికో దేవతాదేహః మానవో రాజసస్స్మృతః,
తమస్తిర్యఙ్మృగాద్యాస్తు దేహోయంపాంచభౌతికః.

తా. పాంచభౌతిక సంబంధమగు ప్రపంచమునందు ఆయాభూతములయొక్క తారతమ్యము ననుసరించియును, త్రిగుణముల విశేషము చేతను, దేవ మనుష్య పశు పక్ష్యాదులు కలుగుచున్నవి.

వి. అనఁగా సత్త్వగుణాధిక్యముచే దేవతలును, రజోగుణాధిక్యము చేత మనుష్యులును, తమోగుణాధిక్యముచేత పశుపక్షులును, ఆదిశబ్దముచేత స్థావరాదులును కలుగుచున్నవి. "దేవత్వం సాత్త్వికాయాంతి మనుష్యత్వంచ రాజసాః, తిర్యక్త్వం తామసానిత్య మిత్యేషా త్రివిధాగతిః." అని ప్రమాణము.

## ఉత్పత్తి భేదములు.

శ్లో. జరాయుజోండజశ్చైవ స్వేదజశ్చోద్భిజస్తథా,
ఏవం చతుర్విధఃప్రోక్తో దేహోయంపాంచభౌతికః.

తా. పాంచభౌతిక శరీరము జరాయుజము, అండజము, స్వేదజము, ఉద్భిజ్జము, అని నాలుగు విధములుగా నున్నవి.

వి. సూక్ష్మచర్మకవచమునందుండి పుట్టునట్టి మనుష్యులు పశువులు మొదలగునవి జరాయుజమనఁబడును. గ్రుడ్డుపెట్టియందుండి కలుగు కాక కుక్కుటాదులు అండజ మనఁబడును. చెమట వలనఁ బుట్టు పేను మొదలగునవి స్వేదజ మనఁబడును. విత్తనమునుండి మొలుచునట్టి వృక్షములు ఉద్భిజ్జము లనఁబడును.



అవ. స్వామీ! పంచభూతములచే శరీరము ఉత్పత్తియగుచున్నదని వచించితిరి. తద్వివరణమును దెల్పుఁడని వేఁడిన శిష్యునకాచార్యుం డిట్లను చున్నాఁడు.

## స్థూలపంచీకృత భూతవివరణము.

శ్లో. పృథివ్యాదీనిభూతాని ప్రత్యేకంవిభజేద్ద్విధా,
ఏకైకభాగమాదాయ చతుర్ధా విభజేత్పునః. ౪౦.
ఏకైకంభాగమేకస్మిన్ భూతేసంవేశయేత్క్రమాత్,
పంచీకరణమేతత్స్యా దిత్యాహుస్తత్త్వవేదినః. ౪౧.

తా. భూమ్యాది పంచభూతములలో (పంచీకరణము చేయవలసినట్టి భూతములను) ప్రతిభూతమును సమముగాఁ (రెండుగా) జేసి, వానియందు ప్రతిభూతముయొక్క అర్థభాగమును వేఱుగానుంచి, మిగిలియుండు ప్రతి భూతములోను ఒక్కొక భాగమును నాలుగుగా విభజించి, తమ తమ నిజ భూతముతోఁ జేర్పక, తక్కిన నాలుగు భూతములతోఁ జేర్చినయెడల పంచ మహాభూత పంచీకరణ మగునని తత్త్వవేత్తలు చెప్పుదురు.

వి. ఈవిషయము నొక్కొకరొక్కొకతీరున జెప్పియున్నను విషయ భేదము లేదు. “ శ్లో. ద్విధావిధాయచైకైకం చతుర్ధా ప్రథమం పునః, స్వస్వేతరద్వితీయాంశై ర్యోజనాత్పంచపంచతు, పంచీకృత మహాభూతమితి వేదవిదోవిదుః. అను నిట్లుగా ననేక గ్రంథములయందు జెప్పఁబడియున్నది.

పంచీకృతమనఁగా, ఒకటితో నొకటిచేరక ప్రత్యేక ప్రత్యేకముగా నుండిన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, అనెడి సూక్ష్మములు గానున్న భూతములను స్థూలముగాఁ జేయుకొఱకు ఈశ్వరుఁడు ప్రతి భూతమును రెండుగాఁజేసి అం దొకదానిని నాలుగుగ విభజించెను. ఆకాశముయొక్క సగమును నాలుగుచేసి, అనఁగా ఎనిమిదింట నొక భాగ మును వాయువుయొక్క సగమునను, వేఱొక ఎనిమిదింట నొకభాగమును అగ్నియొక్క సగమునను, మఱొక ఎనిమిదింట నొక భాగమును జలము

యొక్క సగమునను, ఇంకొక ఎనిమిదింట నొక భాగమును భూమియొక్క సగమునను జేర్చెను. ఇట్లె అన్నిభూతములందును ప్రతిభూతముయొక్క అష్టమాంశము (ఎనిమిదింట నొక భాగము) చొప్పున చేర్పఁబడెను. ఇట్లు చేసినందువలన ప్రతిభూతమును స్వాంశము సగమును తక్కిన భూతముల యొక్క అంశము సగమును నైనది. ఇయ్యదే స్థూలసృష్టి కుపయోగ మైనది. ఈపంచీకరణ విషయమును చెప్పఁబోవునట్టి స్థూలపంచీకరణ చక్రములను జూచినచో స్పష్టమగును.

## పంచభూతగుణధర్మకర్మనిరూపణ పథకము.

| పంచభూతములు. | గుణము. | ధర్మము. | కర్మము. |
|---|---|---|---|
| ఆకాశము | శబ్దము | సుషిరము | అవకాశము |
| వాయువు | స్పర్శము | చలనము | వ్యూహకరణము(ఒకదానితోనొకటి చేర్చుట) |
| అగ్ని | రూపము | ఉష్ణము | దహించుట |
| జలము | రసము | ద్రవము | పిండీకరణము (ముద్దగుటయు) |
| పృథ్వి | గంధము | కఠినము | ధరించుట (ధరించుట) |



## ఆకాశ పంచీకరణ చక్రము.

స్థూలము. నిజగుణము ½




స్థూలాకాశమునందు సూక్ష్మాకాశము సగమును, తక్కిన నాల్గు భూతములును క్రమముగా నొకటొకటి పరకభాగమును జేరియున్నది. ఈఆకాశము కలుగుటకు కారణమైయున్న స్వాంశమైన ఆకాశమొకటే దృశ్యము. తక్కిన వాయువు తేజస్సు అప్పు పృథ్వి అను నాల్గు భూతములును అదృశ్యము. దృశ్యమనఁగా కనఁబడునది. అదృశ్యమనఁగా కనఁబడనిది. లేక వ్యాప్యమైనది.

పరకభాగమనఁగా ఎనిమిదింట నొక్కపాలు. ఇదే అష్టమాంశమనఁ బడును.



## వాయు పంచీకరణ చక్రము.

స్థూలము. నిజగుణము $\frac{1}{2}$




స్థూలవాయువునందు సూక్ష్మవాయువు సగమును, తక్కిన నాలుగు భూతములును వరుసగా నొక్కొక్కటియు పరకభాగమును జేరి యున్నది. ఈవాయువు కల్గుటకుఁ గారణములైన ఆకాశమును అందణఁగి యున్నవాయువును దృశ్యము. తక్కిన తేజస్సు అప్పు పృథివి అను మూఁడుభూతములును అదృశ్యము!



## అగ్ని పంచీకరణ చక్రము.

స్థూలము. నిజగుణము $\frac{1}{2}$




స్థూలతేజస్సునందు సూక్ష్మతేజస్సు అర్ధభాగమును, తక్కిన నాలుగు భూతములలో ప్రతిభూతమును పరకభాగమును జేరియున్నది. ఈ తేజస్సు కలుగుటకుఁ గారణంబులైన ఆకాశము వాయువు అందఱి యున్న అగ్ని ఈమూఁడును దృశ్యము. తక్కిన పృథ్వి అప్పు ఈరెండును అదృశ్యము.



## జల పంచీకరణ చక్రము.

స్థూలము. నిజగుణము $\frac{1}{2}$




స్థూలజలమునందు సూక్ష్మజలము సగమును, తక్కిన నాలుగు భూతములలో ప్రతిభూతమును పరకభాగము చొప్పునను జేరియున్నది. ఈజలము కలుగుటకుఁ గారణములైన ఆకాశము వాయువు తేజస్సు అందణఁగిన అప్పు అనునివి నాలుగు భూతములును దృశ్యము. పృథివి అదృశ్యము.



## పృథివీ పంచీకరణ చక్రము.

స్థూలము. నిజగుణము. ½




స్థూలపృథివియందు సూక్ష్మపృథివి సగమును, తక్కిన నాలుగు భూతములందు ఒక్కొకటియు పరకభాగమును జేరియున్నది. ఈపృథివి కలుగుటకుఁ గారణంబులైన ఆకాశము వాయువు అగ్ని జలము అందణఁగిన పృథ్వి అను నీపంచభూతములును దృశ్యము.

ఈచెప్పఁబడినవి స్థూలపంచీకరణమని తెలియఁదగినది.



## స్థూలశరీర పంచభూత పంచవింశతితత్త్వవివేచనము.

### పృథ్వీతత్త్వ పంచకము.

శ్లో. అస్థిమాంసత్వచోనాడీ రోమంచైవయథాతథా,
క్షితిఃపంచవిధఃప్రోక్తాః సమాంశాఃపరికీర్తితాః. ౪౨.

తా. అస్థి, మాంసము, త్వక్కు, నాడి, రోమము, ఇవి పృథ్వీతత్త్వములు.

### పృథ్వీతత్త్వపంచకవివరణము.

| సంఖ్య. | పృథ్వియొక్క | తత్త్వములు. |
|---|---|---|
| 1 | పృథ్వి | అస్థి—ఎముక |
| 2 | జలము | మాంసము |
| 3 | అగ్ని | త్వక్కు—తోలు |
| 4 | వాయువు | నాడి—నరములు |
| 5 | ఆకాశము | రోమము. |

### మతాంతరము.

| సంఖ్య. | పృథ్వియొక్క | తత్త్వములు | వృత్తులు |
|---|---|---|---|
| 1 | పృథ్వి | అస్థి | శరీరనిర్మితకారి |
| 2 | జలభాగము | మాంసము | బలకారి |
| 3 | తేజోభాగము | నాడి | వృద్ధికారి |
| 4 | వాయుభాగము | త్వక్కు | శీతోష్ణనిరూపణకారి |
| 5 | ఆకాశభాగము | రోమము | నాశనిరూపకకారి. |



## జలతత్వ పంచకము.

శ్లో. లాలామూత్రంతథాస్వేదః శుక్లంశోణితమేవచ,
ఆపఃపంచవిధఃప్రోక్తాః సమాంశాఃపరికీర్తితాః. ౪౩.

తా. చొంగ, మూత్రము, చెమట, రక్తము, శుక్లము, అనునివి జలతత్వములు.

### జలతత్వపంచక వివరణము.

| సంఖ్య. | జలము యొక్క | తత్వములు. |
|---|---|---|
| 1 | పృథివి | లాలా—ఉమ్మినీరు |
| 2 | అప్పు | మూత్రము |
| 3 | అగ్ని | స్వేదము—చెమట |
| 4 | వాయువు | రక్తము—నెత్తురు |
| 5 | ఆకాశము | శుక్లము—వీర్యము |

### మతాంతరము.

| సంఖ్య. | జలము యొక్క | తత్వములు | వృత్తులు. |
|---|---|---|---|
| 1 | జలము | శుక్లము | గర్భహేతువు |
| 2 | పృథ్వీభాగము | శోణితము | గర్భహేతువు |
| 3 | ఆకాశభాగము | శ్లేష్మము | వృద్ధిక్షయము. |
| 4 | తేజోభాగము | మూత్రము | ఉష్ణనిరూపకకారి |
| 5 | వాయుభాగము | స్వేదము | శ్రమనిరూపకకారి |



## అగ్నితత్త్వ పంచకము.

శ్లో. క్షుధాతృష్ణాతథానిద్రా ఆలస్యంసంగమస్తథా,
అగ్నిఃపంచవిధఃప్రోక్తా స్సమాంశాఃపరికీర్తితాః. ౪౪.

తా. క్షుత్తు, తాపము, నిద్ర, ఆలస్యము, సంగమము, అనునివి అగ్నితత్త్వములు.

## అగ్నితత్త్వపంచక వివరణము.

| సంఖ్య. | అగ్నియొక్క | తత్త్వములు. |
|---|---|---|
| 1 | పృథ్వి | క్షుధా=అకలి |
| 2 | అప్పు | దాహము=దప్పి |
| 3 | అగ్ని | నిద్ర=తూఁగు |
| 4 | వాయువు | ఆలస్యము=సోమరితనము |
| 5 | ఆకాశము | సంగమము |

## మతాంతరము.

| సంఖ్య. | అగ్నియొక్క | తత్త్వములు | వృత్తులు. |
|---|---|---|---|
| 1 | అగ్ని | క్షుధా | అఁకలి |
| 2 | వాయుభాగము | తృషా | దప్పి |
| 3 | పృథ్వీభాగము | ఆలస్యము | జడత్వము |
| 4 | ఆకాశభాగము | నిద్రా | శూన్యము |
| 5 | జలభాగము | కాంతి | ప్రకాశపరివర్తితము |

## వాయుతత్త్వ పంచకము.

శ్లో. ధావనంవల్గనంచైవా కుంచనంచ ప్రసారణమ్,
వాయుఃపంచవిధఃప్రోక్తాః సమాంశాఃపరికీర్తితా.౪౫.

తా. ధావనము, వల్గనము, ఆకుంచనము, ప్రసారణము, చలనము, ఇవి వాయుతత్త్వములు.

### వాయుతత్త్వపంచక వివరణము.

| సంఖ్య. | వాయువుయొక్క | తత్త్వములు. |
|---|---|---|
| 1 | పృథివి | ధావనము=పరుగిడుట |
| 2 | అప్పు | వల్గనము=కదలుట |
| 3 | అగ్ని | ఆకుంచనము=సంకుచితమగుట |
| 4 | వాయువు | ప్రసారణము=ప్రసరించుట |
| 5 | ఆకాశము | చలనము |

### మతాంతరము.

| సంఖ్య. | వాయువుయొక్క | తత్త్వములు | వృత్తులు. |
|---|---|---|---|
| 1 | జలభాగము | చలనము | పోవుట |
| 2 | తేజోభాగము | వల్గనము | కదలుట |
| 3 | వాయువు | ధావనము | పరుగిడుట |
| 4 | ఆకాశభాగము | ప్రసారణము | ప్రసరించుట |
| 5 | పృథివీభాగము | ఆకుంచనము | సంకోచించుట |



## ఆకాశతత్వ పంచకము.

శ్లో. రాగద్వేషభయంలజ్జా మోహంచైవయథాతథా,
నభః పంచవిధఃప్రోక్తాః సమాంశాఃపరికీర్తితాః,౪౬.

తా. రాగము, ద్వేషము, భయము, లజ్జ, మోహము, అనునివి ఆకాశతత్వములు.

## ఆకాశతత్వపంచక వివరణము.

| సంఖ్య. | ఆకాశముయొక్క | తత్వములు. |
|---|---|---|
| 1 | పృథివి | రాగము=కోరిక |
| 2 | అప్పు | ద్వేషము=విరోధము |
| 3 | అగ్ని | భయము=వెఱపు |
| 4 | వాయువు | లజ్జ=సిగ్గు |
| 5 | ఆకాశము | మోహము=భ్రమ |

## మతాంతరము.

| సంఖ్య. | ఆకాశముయొక్క | తత్వములు | వృత్తులు. |
|---|---|---|---|
| 1 | వాయుభాగము | కామము | చంచలము |
| 2 | తేజోభాగము | క్రోధము | తపాయమానము |
| 3 | ఆకాశము | శోకము | శూన్యము |
| 4 | జలభాగము | మోహము | ప్రేమ |
| 5 | పృథివీభాగము | భయము | జడత్వము |

## సూక్ష్మపంచీకృత భూతవివరణము.

శ్లో. పృథగ్భూతేషోడశకలా స్స్వార్థభాగాన్ పరాన్ క్రమాత్,
అంతఃకరణవ్యానోఽక్షి రసపాయూనభః క్రమాత్. ౪౭.

తా. ఆకాశాది పంచభూతములయొక్క పూర్వోక్త భాగక్రమము చేత అంతఃకరణములు, వ్యానాదివాయువులు, చక్షురాదీంద్రియములు, రసాదితన్మాత్రలు, పాయ్వాదికర్మేంద్రియములును గలిగెను.

వి. పంచభూతములను షోడశభాగములుచేసి విభజించినను, లేక పంచీకరణమునందు వివరించిన చొప్పున భాగించినను భేదమేమియు లేదు.

ఈ చెప్పిన ఇరువదినాలుగు తత్త్వములును సూక్ష్మశరీరతత్త్వములు. ఇవి అపంచీకృత పంచమహాభూత తత్త్వములని తెలియనది. ఈ విషయమును సూక్ష్మపంచీకరణ పఠకమును జూచినచో సుబోధమగును. మఱియు సూక్ష్మశరీరము పుర్యష్టకముచేనైన ౨౫ తత్త్వములనియును జెప్పఁబడుచున్నది.

## పుర్యష్టకము.

శ్లో. వాగాదిపంచశ్రవణాదిపంచ
ప్రాణాదిపంచాభ్రముఖానిపంచ,
బుద్ధ్యాద్యవిద్యాపిచకామకర్మణీ
పుర్యష్టకంసూక్ష్మశరీరమాహుః. ౪౮.

తా. 1 వాగాదిపంచకర్మేంద్రియములును, 2 శ్రోత్రాదిపంచజ్ఞానేంద్రియములును, 3 ప్రాణాదిపంచవాయువులును, 4 ఆకాశాదిపంచభూతములును, 5 బుద్ధ్యాదిఅంతఃకరణచతుష్టయమును, 6 అజ్ఞానమును, 7 కామమును, 8 కర్మమును, పుర్యష్టము. ఇదే సూక్ష్మశరీరమని చెప్పుదురు.

వి. కర్మమును త్రివిధకర్మములనియు అనఁగా మనోవాక్కాయ కర్మములనియును; అజ్ఞానమును వాసనయనియును జెప్పుదురు.



"శ్లో. 1 జ్ఞానేంద్రియాణిఖలుపంచతథావరాణి 2 కర్మేంద్రియాణి 3 మన ఆదిచతుష్టయంచ, 4 ప్రాణాదివాయు 5 వియదాదికపంచభూతాః 6 కామాది 7 కర్మచ 8 తమఃపురమష్టకంచ." మఱికొందఱు "శ్లో. శబ్ద స్స్పర్శ స్తథారూపం రసోగంధశ్చపంచకమ్, బుద్ధిర్మన స్త్వహంకారః పుర్య ష్టకముదాహృతమ్" అనియును; ఇంక గొందఱు వేఱువిధముగను జెప్పి యున్నారు. అగ్రాహ్యమని వివరించలేదు.

## అంతఃకరణ పంచకము.

శ్లో. తత శ్చాకాశభూతస్య భాగాఃపంచభవంతిహి,
వ్యోమాదిభాగాశ్చత్వారో అంతఃకరణమావిశేత్.

తా. ఆకాశ భూతముయొక్క భాగములతో వాయువు మొదలగు నాలుగు భూతములుచేరి అంతఃకరణపంచక మగుచున్నది.

వి. 1. ఆకాశముయొక్క అర్థభాగము జ్ఞాతృవాయెను. ఇదే జీవుఁడు. ఈ జ్ఞాత కూటస్థుని ప్రతిబింబమై యుండుటంబట్టి సంసారమునకు హేతువై యున్నది.

2. ఆకాశముయొక్క అముఖ్యపాదాంశము వాయువుయొక్క ముఖ్య అర్థాంశముతోఁజేరి మనస్సు ఆయెను.

3. ఆకాశముయొక్క అముఖ్యపాదాంశము అగ్నియొక్క ముఖ్య మైన అర్థాంశముతోఁగూడి బుద్ధి ఆయెను.

4. ఆకాశముయొక్క అముఖ్యపాదాంశము జలముయొక్క ముఖ్యా ర్థాంశముతోఁజేరి చిత్తమాయెను.

5. ఆకాశముయొక్క అముఖ్యపాదాంశము పృథ్వియొక్క ముఖ్య అర్థాంశముతోఁజేరి అహంకారమయ్యెను.



## ఆకాశగుణనిరూపణము.

| | | | |
|---|---|---|---|
| ఆకాశముయొక్క $\frac{4}{8}$ + | | | O = జ్ఞాత. |
| ,, | $\frac{1}{8}$ + | వాయువుయొక్క | $\frac{4}{8}$ = మనస్సు. |
| ,, | $\frac{1}{8}$ + | అగ్నియొక్క | $\frac{4}{8}$ = బుద్ధి. |
| ,, | $\frac{1}{8}$ + | అప్పుయొక్క | $\frac{4}{8}$ = చిత్తము. |
| ,, | $\frac{1}{8}$ + | పృథ్వియొక్క | $\frac{4}{8}$ = అహంకారము. |

## ప్రాణపంచకము.

శ్లో. తతశ్చ వాయుభూతస్య భాగాః పంచ భవంతిహి,
వ్యోమాదిభాగాశ్చత్వారో ప్రాణపంచకమావిశేత్.

తా. వాయుభూతముయొక్క భాగములతో ఆకాశాది భూతములు చేరి వ్యానాది పంచవాయువులాయెను.

వి. 1. వాయువుయొక్క అర్ధాంశము వ్యానమాయెను. ఈ వ్యానమే డెబ్బది రెండువేల నాడులకు సూక్ష్మాన్నరసమును విభాగించి యిచ్చుచున్నది.

2. వాయువుయొక్క అముఖ్యపాదాంశము ఆకాశముయొక్క ముఖ్య అర్ధాంశముతోఁజేరి సమానవాయు వాయెను.

3. వాయువుయొక్క అముఖ్యపాదాంశము అగ్నియొక్క ముఖ్య అర్ధాంశముతోఁజేరి ఉదానవాయు వాయెను.

4. వాయువుయొక్క అముఖ్యపాదాంశము జలముయొక్క ముఖ్య అర్ధాంశముతోఁగూడి అపానవాయు వాయెను.

5. వాయువుయొక్క అముఖ్యపాదాంశము పృథ్వియొక్క ముఖ్య అర్ధాంశముతోఁజేరి ప్రాణవాయువాయెను.



## వాయుగుణనిరూపణము.

| | | | | |
|---|---|---|---|---|
| వాయువుయొక్క | $\frac{4}{8}$ + | | ○ | = వ్యానము. |
| ,, | $\frac{1}{8}$ + | ఆకాశముయొక్క | $\frac{4}{8}$ | = సమానము. |
| ,, | $\frac{1}{8}$ + | అగ్నియొక్క | $\frac{4}{8}$ | = ఉదానము. |
| ,, | $\frac{1}{8}$ + | జలముయొక్క | $\frac{4}{8}$ | = అపానము. |
| ,, | $\frac{1}{8}$ + | పృథ్వియొక్క | $\frac{4}{8}$ | = ప్రాణము. |

## జ్ఞానేంద్రియ పంచకము.

శ్లో. తతశ్చవహ్నిభూతస్య భాగాఃపంచభవంతిహి,
వ్యోమాదిభాగాశ్చత్వారో జ్ఞానేంద్రియమితిస్మృతః.

తా. అగ్నిభూతముయొక్క భాగములతో ఆకాశాది భూతములు చేరి చక్షురాదీంద్రియములైనవని చెప్పఁబడుచున్నది.

వి. 1. అగ్నియొక్క అర్ధాంశము నేత్రమాయెను. ఇది రూపవిషయమును పరిగ్రహించును.

2. అగ్నియొక్క అముఖ్యపాచాంశము ఆకాశముయొక్క ముఖ్య అర్ధాంశమునందుజేరి శ్రోత్రమాయెను.

3. అగ్నియొక్క అముఖ్యపాదాంశము వాయువుయొక్క ముఖ్య అర్ధాంశముతోఁజేరి త్వగింద్రియమాయెను.

4. అగ్నియొక్క అముఖ్యపాదాంశము అప్పుయొక్క ముఖ్య అర్ధాంశముతోఁగూడి జిహ్వేంద్రియమాయెను.

5. అగ్నియొక్క అముఖ్యపాదాంశము పృథ్వియొక్క ముఖ్యఅర్ధాంశముతోఁజేరి ఘ్రాణేంద్రియమాయెను.



## అగ్నిగుణనిరూపణము.

| | | | |
|---|---|---|---|
| అగ్నియొక్క | $\frac{4}{8}$ + | | ○ = నేత్రము. |
| ,, | $\frac{1}{8}$ + | ఆకాశముయొక్క | $\frac{4}{8}$ = శ్రోత్రము. |
| ,, | $\frac{1}{8}$ + | వాయువుయొక్క | $\frac{4}{8}$ = త్వక్కు. |
| ,, | $\frac{1}{8}$ + | అప్పుయొక్క | $\frac{4}{8}$ = జిహ్వ. |
| ,, | $\frac{1}{8}$ + | పృథ్వియొక్క | $\frac{4}{8}$ = ఘ్రాణము. |

## విషయపంచకము.

శ్లో. తతశ్చజలభూతస్య భాగాఃపంచభవంతిహి,
వ్యోమాదిభాగాశ్చత్వారో రసాదిగుణముద్భవేత్ .౫౨.

తా. జలభూతముయొక్క భాగములతో ఆకాశాది భూతములు చేరుటవలన రసాది విషయపంచకము కల్గుచున్నది.

వి. 1. జలముయొక్క అర్థభాగము రసవిషయమాయెను.

2. జలముయొక్క అముఖ్యపాదాంశము ఆకాశముయొక్క ముఖ్య అర్థాంశముతోఁగూడి శబ్దవిషయమాయెను.

3. జలముయొక్క అముఖ్య పాదాంశము వాయువుయొక్క ముఖ్య అర్థాంశముతోఁజేరి స్పర్శవిషయమాయెను.

4. జలముయొక్క అముఖ్యపాదాంశము అగ్నియొక్క ముఖ్యఅర్థాంశముతోఁగూడి రూపవిషయమాయెను.

5. జలముయొక్క అముఖ్యపాదాంశము పృథ్వియొక్క ముఖ్య అర్థాంశముతోఁజేరి గంధవిషయమాయెను.

ఈ విషయపంచకమును తన్మాత్రలనియు, సూక్ష్మ పంచభూతములనియు, అపంచీకృతపంచమహాభూతములనియుఁ జెప్పుదురు.



## జలగుణనిరూపణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| జలముయొక్క | $\frac{4}{8}$ + | | ○ | = | రసవిషయము. |
| ,, | $\frac{1}{8}$ + | ఆకాశముయొక్క | $\frac{4}{8}$ | = | శబ్దవిషయము. |
| ,, | $\frac{1}{8}$ + | వాయువుయొక్క | $\frac{4}{8}$ | = | స్పర్శవిషయము. |
| ,, | $\frac{1}{8}$ + | అగ్నియొక్క | $\frac{4}{8}$ | = | రూపవిషయము. |
| ,, | $\frac{1}{8}$ + | పృథ్వియొక్క | $\frac{4}{8}$ | = | గంధవిషయము. |

## కర్మేంద్రియ పంచకము.

శ్లో. తతశ్చభూమిభూతస్య భాగాఃపంచభవంతిహి
వ్యోమాదిభాగాశ్చత్వారో కర్మేంద్రియమితిస్మృతః.౫౩.

తా. పృథ్వి భూతముయొక్క భాగములతో ఆకాశాది నాలుగు భూతములు చేరుటవలన కర్మేంద్రియ పంచకము కలుగునని చెప్పఁబడు చున్నది.

వి. 1. పృథ్వియొక్క అర్ధాంశము గుదేంద్రియ మాయెను.

2. పృథ్వియొక్క అముఖ్యపాదాంశము ఆకాశముయొక్క ముఖ్య అర్ధాంశముతోఁజేరి వాగింద్రియ మయ్యెను.

3. పృథ్వియొక్క అముఖ్యపాదాంశము వాయువుయొక్క ముఖ్య అర్ధాంశముతోఁజేరి పాణియాయెను.

4. పృథ్వియొక్క అముఖ్యపాదాంశము అగ్నియొక్క ముఖ్యార్ధాంశముతోఁగూడి పాదమాయెను.

5. పృథ్వియొక్క అముఖ్యపాదాంశము జలముయొక్క ముఖ్య అర్ధాంశముతోఁజేరి గుహ్యమాయెను.

## పృథ్వీగుణనిరూపణము.

| | | | |
|---|---|---|---|
| పృథ్వియొక్క | $\frac{4}{8}$ + | | ○ = గుదము. |
| ,, | $\frac{1}{8}$ + | ఆకాశముయొక్క | $\frac{4}{8}$ = వాక్కు. |
| ,, | $\frac{1}{8}$ + | వాయువుయొక్క | $\frac{4}{8}$ = పాణి. |
| ,, | $\frac{1}{8}$ + | అగ్నియొక్క | $\frac{4}{8}$ = పాదము. |
| ,, | $\frac{1}{8}$ + | జలముయొక్క | $\frac{4}{8}$ = గుహ్యము. |

అవ. స్వామి! భగవంతుఁడు సృజించినట్లు చెప్పిన త్రిగుణముల యొక్క స్థితిని వివరించి చెప్పవలయునని ప్రార్థించిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

### గుణత్రయ విభాగ పంచదశ సూక్ష్మపంచీకరణము.

1. ఆకాశముయొక్క సత్త్వగుణభాగము శ్రోత్రము.
   ఆకాశముయొక్క తమోగుణభాగము శబ్దము.
   ఆకాశముయొక్క రజోగుణభాగము వాక్కు.
2. వాయువుయొక్క సత్త్వగుణభాగము త్వక్కు.
   వాయువుయొక్క తమోగుణభాగము స్పర్శము.
   వాయువుయొక్క రజోగుణభాగము పాణి.
3. అగ్నియొక్క సత్త్వగుణభాగము నేత్రము.
   అగ్నియొక్క తమోగుణభాగము రూపము.
   అగ్నియొక్క రజోగుణభాగము పాదము.
4. అప్పుయొక్క సత్త్వగుణభాగము జిహ్వ.
   అప్పుయొక్క తమోగుణభాగము రసము.
   అప్పుయొక్క రజోగుణభాగము గుహ్యము.
5. పృథ్వియొక్క సత్త్వగుణభాగము ఘ్రాణము.
   పృథ్వియొక్క తమోగుణభాగము గంధము.
   పృథ్వియొక్క రజోగుణభాగము గుదము.

దీనినే త్రివృత్కరణమనియుం జెప్పుదురు. పంచీకరణంబునందె త్రివృత్కరణ మంతర్భూతంబై యుండుటంబట్టి ప్రత్యేకముగాఁ జెప్పలేదు.

అవ. ఆచార్యుఁడు శిష్య బోధార్థమై సూక్ష్మశరీర పంచవింశతి తత్త్వ విషయము ననువదించుచున్నాఁడు.

## సూక్ష్మశరీర పంచభూత పంచవింశతి తత్త్వవివేచనము.

### పృథ్వీ పంచీకృతి.

శ్లో. అహంచప్రాణవాయుశ్చ నాసికాగంధమేవచ,
పాయుః పంచవిధః ప్రోక్తాః ఇత్యేతద్భూమిపంచకమ్. ౫౪.

తా. అహంకారము, ప్రాణవాయువు, ఘ్రాణేంద్రియము, గంధతన్మాత్ర, గుదేంద్రియము, ఇవి యైదును పృథ్వీపంచీకృతి.

| వి. | | | |
|---|---|---|---|
| | పృథ్వియందు | ఆకాశము | అహంకారము. |
| | పృథ్వియందు | వాయువు | ప్రాణము. |
| | పృథ్వియందు | అగ్ని | ఘ్రాణము. |
| | పృథ్వియందు | జలము | గంధతన్మాత్ర. |
| | పృథ్వియందు | పృథివి | గుదము. |

### జలపంచీకృతి.

శ్లో. చిత్తంచాపానవాయుశ్చ జిహ్వారసనమేవచ,
గుహ్యంపంచవిధంప్రోక్తం ఇత్యేతజ్జలపంచకమ్. ౫౫.

తా. చిత్తము, అపానము, జిహ్వా, రసతన్మాత్ర, గుహ్యేంద్రియము, అను నీయైదును జలపంచీకృతి.

| వి. | | | |
|---|---|---|---|
| | జలమునందు | ఆకాశము | చిత్తము. |
| | జలమునందు | వాయువు | అపానము |
| | జలమునందు | అగ్ని | జిహ్వా. |
| | జలమునందు | జలము | రసతన్మాత్ర. |
| | జలమునందు | పృథివి | గుహ్యము. |



## అగ్నిపంచీకృతి.

శ్లో. బుద్ధిశ్చోదానవాయుశ్చ నేత్రంరూపంతథైవచ,
పాదఃపంచవిధంప్రోక్త మిత్యేతదగ్నిపంచకమ్.౪౯.

తా. బుద్ధి, ఉదానవాయువు, నేత్రము, రూపతన్మాత్ర, పాదము, ఇవి యైదును అగ్నిపంచీకృతి.

| వి. | | | |
|---|---|---|---|
| వి. | అగ్నియందు | ఆకాశము | బుద్ధి. |
| | అగ్నియందు | వాయువు | ఉదానము. |
| | అగ్నియందు | అగ్ని | నేత్రము. |
| | అగ్నియందు | జలము | రూపతన్మాత్ర. |
| | అగ్నియందు | పృథ్వి | పాదము. |

## వాయుపంచీకృతి.

శ్లో. మానసంవ్యానవాయుశ్చ చర్మస్పర్శ స్తథైవచ,
పాణిఃపంచవిధఃప్రోక్తః ఇత్యేతద్వాయుపంచకమ్ ౫౧.

తా. మనస్సు, వ్యానవాయువు, త్వక్కు, స్పర్శతన్మాత్ర, పాణి, ఇవి యైదును వాయుపంచీకృతి.

| వి. | | | |
|---|---|---|---|
| వి. | వాయువునందు | ఆకాశము | మనస్సు. |
| | వాయువునందు | వాయువు | వ్యానము. |
| | వాయువునందు | అగ్ని | త్వక్కు. |
| | వాయువునందు | జలము | స్పర్శతన్మాత్ర. |
| | వాయువునందు | పృథ్వి | పాణి. |

## ఆకాశపంచీకృతి.

శ్లో. జ్ఞానంసమానవాయుశ్చ శ్రోత్రంశబ్దస్తథైవచ,
వాక్పంచకవిధఃప్రోక్తః ఇత్యేతద్వ్యోమపంచకమ్. ౫౨.

తా. జ్ఞాత, సమానవాయువు, శ్రోత్రము, శబ్దతన్మాత్ర, వాక్కు, ఇవి యైదును ఆకాశ పంచీకృతి.

| | | |
|---|---|---|
| వి. ఆకాశమునందు | ఆకాశము | జ్ఞాత. |
| ఆకాశమునందు | వాయువు | సమానవాయువు. |
| ఆకాశమునందు | అగ్ని | శ్రోత్రము. |
| ఆకాశమునందు | జలము | శబ్దతన్మాత్ర. |
| ఆకాశమునందు | పృథ్వి | వాక్కు. |

## తన్మాత్ర నిరూపణము.

శ్లో. శబ్దైకగుణమాకాశం శబ్దస్పర్శగుణోమరుత్,
శబ్దస్పర్శరూపగుణై స్త్రిగుణం తేజఉచ్యతే. ౫౯.
శబ్దస్పర్శరూపరస గుణైరాపశ్చతుర్గుణాః,
శబ్దస్పర్శరూపరస గంధైః పంచగుణామహీ. ౬౦.

తా. ఆకాశమునకు శబ్దము ఒకటియును, వాయువునకు శబ్దస్పర్శములు రెండును, అగ్నికి శబ్ద స్పర్శ రూపములు మూఁడును, జలమునకు శబ్ద స్పర్శ రూప రసములు నాలుగును, పృథ్వికి శబ్ద స్పర్శ రూప రస గంధములు నైదును, గుణములని తెలియవలయును.

| | |
|---|---|
| వి. ఆకాశమునకు గుణము | శబ్దము |
| వాయువునకు గుణము | స్పర్శము |
| అగ్నికి గుణము | రూపము |
| జలమునకు గుణము | రసము |
| పృథ్వికి గుణము | గంధము. |

తక్కిన గుణములు ఆయా భూతములయొక్క కారణ సంబంధము నుండి వచ్చినవని యెఱుంగునది. శబ్దాదిగుణనిరూపణ పఠకమును జూడుము.

## శబ్దాదిగుణ నిరూపణ పథకము.

| భూతోత్పత్తి. | భూతనిజగుణోత్పత్తి | కారణ సంబంధి గుణములు. | | | | జన్యసంఖ్య. | సమష్టిసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| ఆకాశము | శబ్దము | | | | | 1 | 1 |
| వాయువు | స్పర్శము | శబ్దము | | | | 1+1 | 2 |
| అగ్ని | రూపము | శబ్దము | స్పర్శము | | | 1+2 | 3 |
| జలము | రసము | శబ్దము | స్పర్శము | రూపము | | 1+3 | 4 |
| పృథ్వి | గంధము | శబ్దము | స్పర్శము | రూపము | రసము | 1+4 | 5 |

అవ. దీనికిం బ్రమాణమును మఱొకవిధముగా సుబోధార్థమై వ్యక్తపఱుచుచున్నాఁడు.

శ్లో. పార్థివఃపంచమాత్రస్తు — పృథ్వి 5
చతుర్మాత్రస్తు వారుణః — అప్పు 4
ఆగ్నేయస్తు త్రిమాత్రోఽసౌ — అగ్ని 3
వాయవ్యస్తు ద్విమాత్రకః — వాయువు 2
ఏకమాత్ర స్తథాకాశో — ఆకాశము 1
హ్యమాత్రంతు విచింతయేత్. ౬౧.

## సూక్ష్మపంచీకరణ పథకము.

| భూతములు | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథ్వి |
|---|---|---|---|---|---|
| ఆకాశము | జ్ఞాతృ | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| వాయువు | సమానము | వ్యానము | ఉదానము | అపానము | ప్రాణము |
| అగ్ని | శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము |
| జలము | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము |
| పృథ్వి | వాక్కు | పాణి | పాదము | ఉపస్థ | పాయువు |

వి. జ్ఞాతనువిడిచి, తక్కిన 24 తత్త్వములే సూక్ష్మశరీర తత్త్వము లనబడెను. కొందఱు సప్తదశతత్త్వములే సూక్ష్మశరీరతత్త్వములనెదరు.

శ్రోత్రేంద్రియమునకును వాగింద్రియమునకును మైత్రికలదు. శ్రోత్రము శబ్దమును వినుచున్నది. వాక్కు శబ్దమును చెప్పుచున్నది.

త్వగింద్రియమునకును పాణీంద్రియమునకును మైత్రికలదు. త్వక్కు స్పర్శమును గ్రహించుచున్నది. పాణి దాని నిర్వాహము చేయుచున్నది.

చక్షురింద్రియమునకును పాదేంద్రియమునకును మైత్రికలదు. చక్షు రూపమును గ్రహించుచున్నది. పాదము అచ్చటికి గమనము చేయుచున్నది.

జిహ్వేంద్రియమునకును ఉపస్థేంద్రియమునకును మైత్రికలదు. జిహ్వ రసమును గ్రహించుచున్నది. ఉపస్థ దానిని త్యాగము చేయుచున్నది.

ఘ్రాణేంద్రియమునకును గుదేంద్రియమునకును మైత్రికలదు. ఘ్రాణము గంధమును గ్రహించుచున్నది. గుదము గంధమును విసర్జించుచున్నది.

దీనిచే జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకును, సత్త్వ రజోగుణముల కును గల మైత్రి విశదమయ్యెను.

## అవస్థాత్రయనిరూపణ పథకము.

| సంఖ్య. | అవస్థ. | స్థానము. | వాక్కు | భోగము. | శక్తి (బలము). | గుణము. | అభిమాని. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | జాగ్రత్ | నేత్రము | వైఖరి | స్థూలము | క్రియాశక్తి | సత్త్వము | విశ్వుఁడు |
| 2 | స్వప్నము | కంఠము | మధ్యమ | సూక్ష్మము (వాసనామయము) | జ్ఞానశక్తి | రజస్సు | తైజసుఁడు |
| 3 | సుషుప్తి | హృదయము | పశ్యంతి | ఆనందము | ద్రవ్యశక్తి | తమస్సు | ప్రాజ్ఞుఁడు |

శ్లో. నేత్రస్థం జాగ్రతంవిద్యా త్కంఠేస్వప్నం సమావిశత్,
సుషుప్తి హృదయస్థంతు ఇతి తత్త్వ విదోవిదుః. ౬౨.



## సప్తదశ తత్త్వములు.

శ్లో. పంచప్రాణమనోబుద్ధి దశేంద్రియసమన్వితమ్,
అపంచీకృతభూతోత్థం సూక్ష్మాంగంభోగసాధనమ్. ౬౩.

తా. పంచప్రాణములును, మనస్సును, బుద్ధియును, జ్ఞానేంద్రియములును, కర్మేంద్రియములును, అను నీ అపంచీకృతభూతతత్త్వములు పదునేడును సూక్ష్మశరీర తత్త్వములు. సూక్ష్మశరీరము అనుభవించుటకు సాధనమైనది. 29 పుటయందు పుర్యష్టకమును జూడుము.

అవ. శిష్యుఁడా! తత్త్వవిషయమై అనేకు లనేకవిధంబులుగాఁ జెప్పియున్నారు. వాని నన్నిటిని సుబోధార్థ విపరించెద నాకర్ణింపుమను చున్నాఁడు.

శ్లో. చతుర్వింశతితత్త్వాని కేచిదిచ్ఛంతివాదినః,
కేచిత్షట్త్రింశతత్త్వాని కేచిత్షణ్ణవతీనిచ. ౬౪.
తేషాంక్రమంప్రవక్ష్యామి సావధానమనాశ్శృణు.

తా. తత్త్వములు 24 అని కొందఱును, 36 అని కొందఱును, 96 అని కొందఱును జెప్పెదరు. వాని క్రమమును జెప్పెదను, సావధానచిత్తుఁడవై వినుము.

## చతుర్వింశతి తత్త్వములు.

శ్లో. జ్ఞానేంద్రియాణిపంచైవ శ్రోత్రత్వగ్లోచనాదయః. ౬౫.
కర్మేంద్రియాణిపంచైవవాక్పాణ్యంఘ్రాదయఃక్రమాత్,
ప్రాణాదయస్తుపంచైవ పంచశబ్దాదయస్తథా. ౬౬.
మనోబుద్ధిరహంకార శ్చిత్తంచేతిచతుష్టయమ్,
చతుర్వింశతితత్త్వాని తాని బ్రహ్మవిదోవిదుః. ౬౭.



తా. శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, అను జ్ఞానేంద్రియపంచకమును; వాక్కు, పాణి, పాదము, ఉపస్థ, పాయువు, అను కర్మేంద్రియపంచకమును; సమాన వ్యాన ఉదాన అపాన ప్రాణము లను పంచప్రాణవాయువులును; శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడి పంచగుణములును; మనస్సు బుద్ధి చిత్తము అహంకారములను అంతఃకరణ చతుష్టయమును; ఇరువది నాలుగు (చతుర్వింశతి) తత్త్వములని వేదాంతవేత్తలు చెప్పెదరు.

వి. చతుర్వింశతి తత్త్వాతీతుఁడు పరమాత్మయనియు, చతుర్వింశతి తత్త్వములతోఁ గూడినవాఁడు జీవాత్మయనియు దెలియునది.

## షట్త్రింశత్తత్త్వములు.

శ్లో. ఏతైస్తత్త్వైస్సమంపంచీ కృతభూతాని పంచచ,
పృథివ్యాపస్తథాతేజో వాయురాకాశఏవచ. ౬౮.
దేహత్రయంస్థూలసూక్ష్మ కారణాని విదుర్బుధాః,
అవస్థాత్రితయంచైవ జాగ్రత్స్వప్న సుషుప్తయః. ౬౯.
ఆహత్యతత్త్వజాతానాం షట్త్రింశన్మునయోవిదుః.

తా. మున్నువచించిన ఇరువదినాలుగు తత్త్వములతోఁగూడ, పృథివ్వి అప్పు తేజస్సు వాయువు ఆకాశము అను పంచీకృత పంచమహాభూతములును; స్థూల సూక్ష్మ కారణములను శరీరత్రయమును; జాగ్రత్ స్వప్న సుషుప్తులను అవస్థాత్రితయమును; జేరి ముప్పదియారు (షట్త్రింశత్) తత్త్వములని యోగీశ్వరు లెంచెదరు.

వి. ఈచెప్పిన వానితో 24 తత్త్వంబులను జేర్పఁగా 35 తత్త్వంబులగుచున్నది. ఇంకొకటి యేదియనఁగా, జాగ్రత్ స్వప్న సుషుప్తులకు కారణంబైన అజ్ఞానము; దీనిని చేర్చినయెడల 36 తత్త్వంబులగును. వీనిని అతిక్రమించినవాఁడే పరమాత్మయని తెలియఁదగినది.



## షణ్ణవతి తత్త్వములు.

శ్లో. పూర్వోక్తైస్తత్త్వజాతైస్తు సమంతత్త్వాని యోజయేత్,
షడ్భావవికృతిశ్చాస్తి జాయతే వర్ధతేఽపిచ. ౨౦.
పరిణామంక్షయంనాశం షడ్భావవికృతింవిదుః,
అశనాచపిపాసాచ శోకమోహౌ జరామృతీ. ౨౧.
ఏతేషడూర్మయఃప్రోక్తా షట్కోశోతదనంతరమ్,
త్వక్చరక్తంమాంసమేదో మజ్జాస్థీని నిబోధత. ౨౨.
కామక్రోధౌలోభమోహౌ మదోమాత్సర్యమేవచ,
ఏతేఽరిషట్కావిశ్వశ్చ తేజసః ప్రాజ్ఞఏవచ. ౨౩.
జీవత్రయంసత్త్వరజ స్తమాంసిచ గుణత్రయమ్,
ప్రారబ్ధాగామ్యార్జితాని కర్మత్రయ మితీరితమ్. ౨౪.
వచనాదానగమన విసర్గానందపంచకమ్,
సంకల్పోఽధ్యవసాయశ్చాప్యభిమానోఽవధారణా. ౨౫,
ముదితాకరుణామైత్రీ ఉపేక్షాచ చతుష్టయమ్,
దిగ్వాతార్కప్రచేతోశ్వివహ్నీంద్రోపేంద్రమృత్యుకాః
ధాతాచంద్రశ్చతుర్వక్త్రో రుద్రఃక్షేత్రజ్ఞదేవతాః,
ఆహత్యతత్త్వజాతానాం షణ్ణవత్యస్తు కీర్తితాః. ౨౬.

తా. మున్నువచించిన మువ్వదియారు తత్త్వములతోఁగూడ, షడ్భావవికారములు; షడూర్మలు; షట్కోశములు; అరిషడ్వర్గములు; త్రివిధజీవులు; త్రిగుణములు; త్రివిధకర్మములు; కర్మేంద్రియ వ్యాపారములు; అంతఃకరణవృత్తులు; మైత్ర్యాది చతుర్గుణములు; జ్ఞానేంద్రియ కర్మేంద్రి

యాంతఃకరణ దేవతలు; అను నివి చేరి తొంబదియాఱు (షణ్ణవతి) తత్త్వములని చెప్పఁబడుచున్నది.

వి. ఈ తొంబదియాఱు తత్త్వముల నతిక్రమించినవాఁడే పరమాత్మ యగును.

షణ్ణవతి (96) తత్త్వార్థ వివరణము.

1. ౧. శ్రోత్రము—ఇది సర్వశబ్దములను గ్రహించును. ఆకాశాంశము. దిక్కు అధిదేవత.

2. ౨. త్వక్కు—ఇది స్పర్శంబును గ్రహించును. వాయు వంశము. వాయువు అధిదేవత.

3. ౩. చక్షువు—ఇది సర్వరూపంబులను గ్రహించును. అగ్న్యంశము. సూర్యుఁడు అధిదేవత.

4. ౪. రసనము—ఇది సకల రసంబులను గ్రహించును. జలాంశము. వరుణుఁడు అధిదేవత.

5. ౫. ఘ్రాణము—ఇది సర్వగంధమును గ్రహించును. పృథ్వ్యంశము. అశ్వినీదేవతలు అధిదేవతలు.

ఈ ౫ను జ్ఞానేంద్రియములు. ఈవిషయము అగ్నిగుణనిరూపణమును, సూక్ష్మపంచీకరణ పత్రికమును జూచిన స్పష్టమగును. "జ్ఞానేంద్రియాణిశ్రవణం స్పర్శనందర్శనంతథా, రసనంఘ్రాణమిత్యాహుః పంచ తేషాంతుగోచరాః. శబ్ద స్పర్శ స్తథారూపం రసోగంధ ఇతి క్రమాత్."

6. ౧. వాక్కు—వచించుట. పృథ్వ్యంశము. బ్రహ్మ అధిదేవత.

7. ౨. పాణి—ఇచ్చుట, పుచ్చుకొనుట. జలాంశము. ఇంద్రుఁడు అధిదేవత.

8. ౩. పాదము—వచ్చుట, పోవుట. తేజోంశము. ఉపేంద్రుఁడు అధిదేవత.

9\. ౪. గుదము—మలవిసర్జనము చేయునది. వాయ్వంశము. మృత్యువు అధిదేవత.

10\. ౫. ఉపస్థము—శుక్ల శోణిత మూత్ర విసర్జనము చేయునది. ఆకాశాంశము. ప్రజాపతి అధిదేవత.

ఈ ౫ ను కర్మేంద్రియములు. ఈవిషయము పృథ్వీగుణ నిరూపణమును, సూక్ష్మ పంచీకరణ పథకమును జూచిన బోధమగును. "వాక్పాణ్యంఘ్రిగుదోపస్థాన్యాహుః కర్మేంద్రియాణిచ, వచనాదానగమన విసర్గారతయఃక్రమాత్."

11\. ౧. ప్రాణము—ఉచ్ఛ్వాసము చేయునది. పృథ్వ్యంశము. హృదయము స్థానము. రక్తవర్ణము. విశిష్టుఁడు అధిదేవత.

12\. ౨. అపానము—నిశ్శ్వాసము చేయునది. జలాంశము. గుదము స్థానము. ఇంద్రగోపవర్ణము. విశ్వకర్త అధిదేవత.

13\. ౩. సమానము—ఆహారమును పచనంబు చేసి పోషించునది. ఆకాశాంశము. నాభిస్థానము. గోక్షీరవర్ణము. జయుఁడు అధిదేవత.

14\. ౪. ఉదానము—సుషుప్త్యవస్థయందు సకలేంద్రియములను ఉపసంహరించికొని జాగ్రదవస్థయం దాయాయింద్రియములను ఆయాగోళకము లందుంచికొనుచుండి ప్రాణోత్క్రమణకాలంబున నూర్ధ్వగతిని బొందునట్టిది. అగ్న్యంశము. కంఠము స్థానము. కృష్ణవర్ణము. అజుఁడు అధిదేవత.

15\. ౫. వ్యానము—శరీరమునంతయు వ్యాపించియుండి యింద్రియాదులకు బలమిచ్చి యుద్ధరించునది. వాయ్వంశము. సర్వాంగము స్థానము. విద్యుత్కాంతి. విశ్వయోని అధిష్ఠానదేవత.

ఇవి ౫ను పంచప్రాణవాయువులు. ఈవిషయము వాయుగుణ నిరూపణమును, సూక్ష్మపంచీకరణ పథకమును జూచినయెడల విశదమగును.

"ప్రాణో೭పానస్సమానశ్చోదాన వ్యానశ్చ పంచకమ్, ప్రాణ ఆద్యో హృదిస్థానే అపానస్తు పునర్గుదే. సమానో నాభి దేశేతు ఉదానః కంఠమాశ్రితః, వ్యానస్సర్వేషుచాంగేషు వ్యాప్యతిష్ఠతిసర్వదా. అథ వర్ణాస్తుపంచానాం ప్రాణాదీనా మను క్రమాత్, రక్తవర్ణో మణిప్రఖ్యః ప్రాణవాయుః ప్రకీర్తితః.అపానస్తస్యమధ్యేతు ఇంద్రగోపసమప్రభః, సమానస్తుద్వయోర్మధ్యే గోక్షీరధవళప్రభః. అపాండర ఉదానశ్చ వ్యానోహ్యర్చిసమప్రభః" అనిప్రమాణము. ఇదిగాక ఉపవాయువులు మొదలగు వానిని "హఠయోగప్రదీపిక" యందు గనందగును.

16. ౧. శబ్దము—శ్రోత్రముచే సకలశబ్దములను గ్రహించును. ఆకాశమునందు మాత్ర ముండునది. ఆకాశాంశము.

17. ౨. స్పర్శము—చర్మముచే స్పర్శమును గ్రహించునది. పృథివ్యప్తేజో వాయువులయందుమాత్ర ముండునది. వాయ్వంశము

18. ౩. రూపము—నేత్రముచే రూపములను గ్రహించునది. పృథివ్యప్తేజస్సులందు మాత్ర ముండునది. అగ్న్యంశము.

19. ౪. రసము—నాలుకచే రుచులను గ్రహించునది. పృథివీ జలములందు మాత్రముండునది. జలాంశము.

20. ౫. గంధము—నాసికచే వాసనలను గ్రహించునది. పృథివియందు మాత్రముండునది.

ఇది ౫ను విషయములనియును, తన్మాత్రలనియును, శ్రోత్రాదీంద్రియములకు లేక ఆకాశాది పంచభూతములకు గుణము లనియును జెప్పంబడును. ఈవిషయము జెలగుణ నిరూపణమును, సూక్ష్మ పంచీకరణ పథకమును, శబ్దాదిగుణనిరూపణ పథకమును జూచినయెడల స్పష్టమగును. దీనివిషయమైన ప్రమాణశ్లోకములు తన్మాత్రనిరూపణమునందు గనందగును.

21. ౧. మనస్సు—సంకల్పవికల్పములను జేయునది. కంఠము స్థానము. చంద్రుఁడు అధిదేవత. వాయ్వంశము.

22. ౨. బుద్ధి—నిశ్చయించునది. ముఖము స్థానము. చతుర్ముఖుఁడు అధిదేవత. అగ్న్యంశము.

23. ౩. అహంకారము—అభిమానించునది. హృదయము స్థానము. రుద్రుఁడు అధిదేవత. పృథ్వ్యంశము.

24. ౪. చిత్తము—ధారణచేయునది. నాభిస్థానము. జీవుఁడు (వాసుదేవుఁడు) అధిదేవత. జలాంశము.

ఈచెప్పినవి ౪ ను అంతఃకరణచతుష్టయ మనఁబడును. ఈ విషయము ఆకాశగుణనిరూపణమును, సూక్ష్మ పంచీకరణ పఠకమును జూచిన బోధమగును. "మనోబుద్ధిరహంకార శ్చిత్తం చేతి చతుష్టయమ్, సంకల్పోధ్యవసాయశ్చాప్యభిమానోవ ధారణా. మనఃస్థానం గళాంతంచ బుద్ధిస్థానం ముఖం తథా, అహంకారంతు హృదయం చిత్తంనాభౌ యథాక్రమమ్."

25. ౧. ఆకాశము—ఆకాశపంచీకరణ చక్రమును జూడుము.

26. ౨. వాయువు—వాయుపంచీకరణ చక్రమును జూడుము.

27. ౩. అగ్ని—అగ్నిపంచీకరణ చక్రమును జూడుము.

28. ౪. అప్పు—జలపంచీకరణ చక్రమును జూడుము.

29. ౫. పృథ్వి—పృథివీపంచీకరణ చక్రమును జూడుము. "ఖానిలాగ్ని జల పృథ్వ్యో మహాభూతాని మన్యతే".

ఈ ౫ ను ఆకాశాది పంచభూతము లనఁబడును.

30. ౧. స్థూలశరీరము—ఇదే అన్నమయకోశము. ఇది పృథివ్యాది తత్త్వపంచకముతోఁగూడినది. అనఁగా అస్థి మాంస చర్మ నాడీ రోమములను పృథ్వీతత్త్వములును; లాలా మూత్ర స్వేద రక్త శుక్లము లను జలతత్త్వములును, క్షుత్తృష్ణా నిద్రాలస్య



సంగమములను అగ్నితత్త్వములును, ధావనవల్గనాకుంచనప్రసా
రణ చలనములను వాయు తత్త్వములును, రాగ ద్వేష భయ
వ్రీడా మోహములను ఆకాశ తత్త్వములును, జేరి ఇరువ
దైదు తత్త్వములు స్థూలశరీర మనంబడును. ఈ విషయము
"స్థూలశరీరపంచభూత పంచవింశతితత్త్వ వివేచనము" నందు
24 పుటలో గనందగును. మఱియు "మతాంతర చక్రము"
లందును గనందగును.

31. ౨. సూక్ష్మశరీరము—ఇదే లింగశరీర మనఁబడును. అపంచీకృత
పంచమహాభూతములయొక్క పదునేడు తత్త్వములు సూక్ష్మశ
రీర మనఁబడును. ఈవిషయము "సప్తదశతత్త్వములు" అను
దానియందు గనందగును.

32. 3. కారణశరీరము—అవిద్య, లేక అజ్ఞానమే కారణశరీరము.
స్థూల సూక్ష్మశరీరములకు హేతువు అజ్ఞానమైయున్నది.
ఆహేతువు ఇదియే యగుటచేత కారణశరీర మనంబడెను.
మఱియు దీనికి అహంకారత్వము, అవిద్య, అజ్ఞానము, బీజము,
తమస్సు, భ్రాంతి, అనిర్వాచ్యము, అనాది, అను నీమొదలగు
నామములును కలవు. "అనాద్యవిద్యాऽనిర్వాచ్యా కారణో
పాధిరుచ్యతే." అని ప్రమాణము.

ఈ 3 ను శరీరత్రయ మనఁబడును. ఈ శరీరత్రయమునకంటె
విలక్షణుఁడైన వాఁడే పరమాత్మం డనఁబడును. "ఉపాధిత్రిత
యాదన్య మాత్మాన మవధారయేత్". అని ప్రమాణము.

33. ౧. జాగ్రదవస్థ—చతుర్దశేంద్రియములు, చతుర్దశేంద్రియాధిదేవ
తలు, చతుర్దశేంద్రియ విషయములు, అను నీ నలుబదిరెండు(42)
తత్త్వములు జాగ్రదవస్థయనఁబడును. ఇంద్రియములు అధ్యా
త్మము, దేవతలు అధిదైవము, విషయములు అధిభూతము, అని
తెలియఁదగినది. 1 అధ్యాత్మ 2 అధిదైవ 3 అధిభూతము లను



నివి మూఁడును జేరినవి త్రిపుటియనఁబడును. ఈ విషయము చతుర్దశతత్త్వ త్రిపుటీచక్రమునుజూచి తెలిసికొనునది. దీనికి ప్రమాణశ్లోకములు షణ్ణవతితత్త్వనిరూపణమునందు గనందగును.

34. ౨. స్వప్నావస్థ — జాగ్రదవస్థయందు శ్రోత్రాదీంద్రియములచే ననుభవింపఁబడిన విషయజ్ఞానముచే తోఁచునట్టి వాసనలెవియో అవి రోమాగ్రము (రోమమునందు వేయింట నొకపాలు, లేక నూఱింట నొకపాలు) వలె సూక్ష్మముగా కంఠమందుండు హితాయనెడి నాడియందుండును. సంస్కార స్వరూప వాసన యొక్క శబ్దాదివిషయములును, వానియొక్క జ్ఞానమును అగు నీద్వివిధస్వరూపములును ఏనిద్రాకాలంబునందు కలుగుచున్నవో దానిని స్వప్నావస్థయని చెప్పవలయును.

35. ౩. సుషుప్త్యవస్థ—నిద్రయందుండిలేచి "నే నీదినము ఏదియు నెఱుంగను. సుఖముగా నిదురించితిని." అని నిద్రాకాలము నందనుభవింపఁబడినట్టి అజ్ఞానస్మరణస్వరూపజ్ఞానమే (గాఢ నిద్రయే) సుషుప్త్యవస్థ యనఁబడును. బుద్ధ్యాదుల విలయావస్థయే సుషుప్త్యవస్థ.

ఈ ౩ ను త్రివిధావస్థ లనఁబడును. ఈ విషయము "అవస్థాత్రయ నిరూపణ పథకము" జూచిన స్పష్టమగును.

36. అజ్ఞానము. ఇది ముక్తికి ప్రతిబంధకమైనది.

37. ౧. జాయతే—పుట్టుట.

38. ౨. అస్తి—ఉండుట.

39. ౩. వర్ధతే—పెరుఁగుట.

40. ౪. విపరిణమతే—మార్పుబొందుట.

41. ౫. అపక్షీయతే—తగ్గుట.

42. ౬. వినశ్యతి—మరణమొందుట.

ఈ ౬ను షడ్భావవికారము లనఁబడును. ప్రమాణము "షణ్ణవతి తత్త్వములు" అను చోటఁ గనందగును.

43. ౧ అశనము—(ఆఁకలి) ఇది ప్రాణధర్మము.

44. ౨. పిపాస—(దప్పి) ఇది ప్రాణధర్మము.

45. ౩. శోకము—ఇది మనోధర్మము.

46. ౪. మోహము—ఇది మనోధర్మము.

47. ౫. జర (వృద్ధత్వము) ఇది దేహధర్మము.

48. ౬. మరణము—ఇది దేహధర్మము.

ఈ ౬ను షడూర్ము లనఁబడును. అనఁగా సంసార సముద్రమునకు అలలవంటివని తెలియనది. ప్రమాణము "షణ్ణవతి తత్త్వములు" అనుదానియందు చూడఁదగినది. కొందఱిమతంబున జననము, మరణము, క్షుత్తు, తృష, హర్షము, శోకము, అనునివి యాఱును షడూర్ములని చెప్పఁబడియున్నది.

49. ౧. చర్మము—(తోలు).

50. ౨. రక్తము—(నెత్తురు).

51. ౩. మాంసము—(కండ).

52. ౪. మేదస్సు—(కొవ్వు).

53. ౫. మజ్జ—(మూలుగు).

54. ౬. అస్థి—(ఎముక).

ఈ ౬ ను షట్కోశమనఁబడును. కోశము (ఒర) వలె నుండునది యని యర్థము. అనఁగా మూలుగునకు ఎముక ఒరవలె నున్నది. ఇట్లన్నిటఁ దెలియనది.

55. ౧. కామము—ప్రాప్తవస్తువునందలి భోగేచ్ఛ.

56. ౨. క్రోధము—ద్వేషము.

57. ౩. లోభము—అప్రాప్తవస్తువు లభింపవలయునని యిచ్ఛ.

58. ౪. మోహము — ఆత్మానాత్మముల యొక్క, లేక శుభాశుభకర్మముల యొక్క అవివేకము. అనఁగా భ్రమ.

59. ౫. మదము — గర్వము.

60. ౬. మత్సరము — పరోత్కర్షాసహనము. అనఁగా ఇతరుల మేలును జూచి యోర్వమి.

ఈ ౬ ను అరిషడ్వర్గము అనఁబడును. ప్రమాణము "షణ్ణవతి తత్త్వములు" అనుచోటఁ జూడఁదగినది. "కామక్రోధ స్తథా లోభో మదోమాత్సర్యమేవచ, మోహంచేత్యరిషడ్వర్గ మహంకారగతం విదుః" అరిషడ్వర్గము అహంకారమును బొందినదని తెలియఁదగినది.

61. ౧. విశ్వుఁడు — జాగ్రత్తయందు దేహత్రయాభిమానియైన జీవుఁడు.
62. ౨. తైజసుఁడు — స్వప్నమునందు స్థూలదేహాభిమానమును విడిచి సూక్ష్మదేహ కారణదేహము లను శరీరద్వయాభిమానియైన జీవుఁడు.

63. ౩. ప్రాజ్ఞుఁడు — సుషుప్తియందు కారణదేహమును ఏకశరీరాభిమానియైన జీవుఁడు.

ఈ ౩ ను త్రివిధ జీవులనఁబడును. ఈవిషయము "అవస్థాత్రయనిరూపణ పథకము" నందు జూచిన స్పష్టమగును.

64. ౧. సత్త్వగుణము — జ్ఞానము.
65. ౨. రజోగుణము — రాగద్వేషములు.
66. ౩. తమోగుణము — అజ్ఞానము.

ఈ ౩ ను త్రిగుణము లనఁబడును. ఇవి ప్రకృతిజన్యములు. "సత్త్వంరజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః" అని భగవద్గీతయందు చెప్పఁబడియున్నది. "అనిర్వాచ్యామహావిద్యా త్రిగుణాపరిణామినీ, రజస్సత్త్వంతమశ్చేతి తద్గుణాః పరికీర్తితాః". అనఁగా ఇట్టిదని వచింపనలవిగానిదియును, మహత్తైనదియును,

అగు అవిద్య (ప్రకృతి) త్రిగుణములతోఁగూడినదై వికారము గలదై యున్నది. దానిగుణములు సత్త్వరజస్తమములని చెప్పఁబడుచున్నవి. అని శివగీతయందును చెప్పఁబడియున్నది. ఈ విషయము "గుణత్రయ నిరూపణ పఠకము" నందు గనందగును.

67. ౧. సంచితము — జన్మాంతరములయందు కూడబెట్టిన కర్మము.

68. ౨. ఆగామి — వర్తమానజన్మమందలి క్రియమాణ కర్మము.

69. 3. ప్రారబ్ధము — వర్తమాన జన్మముయొక్క ఫలానుభవ కర్మము. ఈ 3 ను "త్రివిధకర్మము" లనంబడును.

70. ౧. వచనము. — పలుకుట.

71. ౨. ఆదానము. — ఇచ్చుట, పుచ్చుకొనుట.

72. 3. గమనము. — పోవుట, వచ్చుట.

73. ౪. విసర్జనము. — మలోత్సర్జనము చేయుట.

74. ౫. ఆనందము. — స్త్రీసంభోగము చేయుట.

ఈ ౫ ను కర్మేంద్రియ వ్యాపారములు. ఈవిషయము "చతుర్దశతత్త్వ త్రిపుటీచక్రము" నందు గనందగును.

75. ౧. సంకల్పము. — ఇది మనస్సుయొక్క వృత్తి.

76. ౨. అధ్యవసాయము. — ఇది బుద్ధియొక్క వృత్తి.

77. 3. అభిమానము. — ఇది అహంకారముయొక్క వృత్తి.

78. ౪. అవధారణము. — ఇది చిత్తముయొక్క వృత్తి.

ఈ ౪ ను అంతఃకరణ వృత్తులనఁబడును. ఈవిషయమును "చతుర్దశతత్త్వత్రిపుటీచక్రము" నందు విశదముగాఁ జెప్పఁబడియున్నది. "స్మృతిర్భీతి ర్వికల్పాద్యాః బుద్ధిస్స్యాన్నిశ్చయాత్మికా, అహం మమేత్యహంకార శ్చిత్తం చేతయతే యతః". అనఁగా స్మరణము, భయము, వికల్పము అను, నివి మనోవ్యాపారములు. నిశ్చయ జ్ఞానము బుద్ధి వ్యాపారము. నేను, నాది అనునివి అహంకార వ్యాపారములు. విచార రూపము చిత్తవ్యాపారము.

79. ౧. ముదిత—దేవునియందును, పుణ్యవంతులయందును, ఉత్కృష్టమైన గుణముగలవారియందును, ముముక్షువునందునుగల ప్రీతి.

80. ౨. కరుణ—దుఃఖవంతునియందును, నికృష్టగుణముగలవాని యందును, అజ్ఞానియందును, జిజ్ఞాసువునందును గల దయ.

81. ౩. మైత్రి—ఈశ్వరభక్తుల యందును, ఉపాసకపురుషుల యందును, కర్మిష్ఠులయందును, సమానగుణయుక్తులయందును, భాగ్యవంతులయందును, "వీరుమావారు" అనెడి బుద్ధి.

82. ౪. ఉపేక్ష—పాపిష్ఠులు, ద్వేషులు, పామరులు, అల్పగుణయుక్తులు, అగు వీరియందలి రాగద్వేషరహితమైన ఉదాసీనత్వము.

ఈ ౪ ను మైత్ర్యాదిచతుష్టయ మనంబడును.

83. ౧. దిక్కు—శ్రోత్రేంద్రియాధిష్ఠానదేవత.

84. ౨. వాయువు—త్వగింద్రియాధిష్ఠానదేవత.

85. ౩. సూర్యుఁడు—చక్షురింద్రియాధిష్ఠానదేవత.

86. ౪. వరుణుఁడు—రసనేంద్రియాధిష్ఠానదేవత.

87. ౫. అశ్వినీదేవతలు—ఘ్రాణేంద్రియాధిష్ఠానదేవతలు.

88. ౬. అగ్ని—వాగింద్రియాధిష్ఠానదేవత.

89. ౭. ఇంద్రుఁడు—పాణీంద్రియాధిష్ఠానదేవత.

90. ౮. ఉపేంద్రుఁడు—(వామనుఁడు) పాదేంద్రియాధిష్ఠానదేవత.

91. ౯. యముఁడు—గుదేంద్రియాధిష్ఠానదేవత.

92. ౧౦. చతుర్ముఖబ్రహ్మ—గుహ్యేంద్రియాధిష్ఠానదేవత.

93. ౧౧. చంద్రుఁడు—(ప్రద్యుమ్నుఁడు) హృదయాధిష్ఠానదేవత.

94. ౧౨. బ్రహ్మ—(వాసుదేవుడు) బుద్ధ్యధిష్ఠానదేవత.

95. ౧౩. రుద్రుఁడు—(అనిరుద్ధుఁడు) అహంకారాధిష్ఠానదేవత.

96. ౧౪. జీవుఁడు—(సంకర్షణుఁడు) చిత్తాధిష్ఠానదేవత.

ఈ ౧౪ను జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, అంతఃకరణాధిదేవతలు. దీనిని "చతుర్దశత్రిపుటీచక్రము" నందు గనందగును.

## చతుర్దశతత్త్వత్రిపుటీచక్రము.

### జాగ్రదవస్థా వివరణము.

| | | ఇంద్రియము. | దేవత. | విషయము. |
|---|---|---|---|---|
| | | అధ్యాత్మము. (సాధనము) | అధిదైవము. (సాధకము) | అధిభూతము. (సాధ్యము) |
| జ్ఞానేంద్రియములు. | 1 | శ్రోత్రము | దిక్కు | శబ్దము |
| | 2 | త్వక్కు | వాయువు | స్పర్శము |
| | 3 | చక్షువు | సూర్యుఁడు | రూపము |
| | 4 | జిహ్వ | వరుణుఁడు | రసము |
| | 5 | ఘ్రాణము | అశ్వినీదేవతలు | గంధము |
| కర్మేంద్రియములు. | 1 | వాక్కు | అగ్ని | వచనము |
| | 2 | పాణి | ఇంద్రుడు | ఆదానము |
| | 3 | పాదము | ఉపేంద్రుడు | గమనము |
| | 4 | పాయువు | యముడు | విసర్గము |
| | 5 | ఉపస్థము | బ్రహ్మ | ఆనందము |
| అంతఃకరణములు. | 1 | మనస్సు | చంద్రుఁడు | సంకల్పవికల్పము |
| | 2 | బుద్ధి | బ్రహ్మ | నిశ్చయము |
| | 3 | అహంకారము | రుద్రుఁడు | అభిమానము |
| | 4 | చిత్తము | జీవుఁడు | చింతనము |

అవ. ఆచార్యుఁడు 96 తత్త్వములను విశదముగునట్లుగా వచించి ఈ తత్త్వములకంటె విలక్షణుండైనవాఁడే పరమాత్మయనియును, దానిని బ్రహ్మజ్ఞానియే తెలిసికొనఁగలఁడనియును జెప్పుచున్నాఁడు.

శ్లో. పూర్వోక్తతత్త్వజాతానాం వైలక్షణ్య మనామయమ్,
సర్వగం సచ్చిదానందం జ్ఞానచక్షుర్నిరీక్ష్యతే. ౭౮.

తా. మున్ను వచించిన షణ్ణవతితత్త్వములకు వేఱైనవాఁడుగను, అనామయుండుగను, సర్వవ్యాపిగను, సచ్చిదానందస్వరూపుఁడుగను నుండు పరబ్రహ్మమును జ్ఞాననేత్రము కలవాఁడు దర్శించును.

ఓం తత్సత్.

రాజయోగరత్నాకరమునందు
ప్రథమప్రకరణము ఉపదేశప్రకరణము
సంపూర్ణము.



ఓమ్.

శ్రీనివాస పరబ్రహ్మణేనమః.

# రాజయోగరత్నాకరము.

తాత్పర్యసహితము.

## సాధనప్రకరణము.

శ్లో. ఓంనమోవిశ్వరూపాయ విశ్వస్థిత్యంతహేతవే,
విశ్వేశ్వరాయ విశ్వాయ శాశ్వతాయ నమోనమః.

అవతారిక.

ఆచార్యుఁడు ఉపదేశప్రకరణంబునందు ప్రపంచసృష్ట్యాదిగా ననేక విషయములను విస్తరించి వచించి, పరమాత్మ షణ్ణవతి తత్త్వాతీతుండని యును, ఆ పరమాత్మను జ్ఞానదృష్టి కలవాఁడే దర్శించుననియును చెప్పఁగా, శిష్యుఁడు ఆచార్యునింజూచి—స్వామీ! పరమాత్మ విషయంబును, జ్ఞాననేత్రము కలుగుటకు సాధనంబును, బోధింప వలయునని ప్రార్థింప, ఆచార్యుండు—శిష్యుఁడా! నీ ప్రశ్నకు సంతసించితిని, తత్సాధనమైన జ్ఞానమును నిరూపించెద వినుమని చెప్పుచున్నాఁడు.

జ్ఞానోత్కర్షము.

శ్లో. అజ్ఞానాదేవసంసారో జ్ఞానాదేవ విముచ్యతే,
జ్ఞానస్వరూపమేవాదౌ జ్ఞానం జ్ఞేయైకసాధనమ్. ౧.

తా. అజ్ఞానమువలన సంసారము కలుగుచున్నది. సంసారనివృత్తి జ్ఞానమువలననే కలుగుచున్నది. తెలిసికొనందగిన పరమాత్మ వస్తువును దెలిసికొనుటకు జ్ఞానమే సాధనము. కనుక మొదట జ్ఞానస్వరూపమునే తెలిసికొనం దగినది.

వి. శిష్యుఁడు జ్ఞానస్వరూపమునే యడిగినాఁడు. గురువును తెలిసి కొనందగిన దానిని (పరమాత్మను) తెలిసికొనుటకు సాధనమైన జ్ఞానమునే మొదట తెలిసికొనఁదగినది యని నిరూపించియున్నాఁడు. అయినను ఇది యధికారి భేదము ననుసరించి చెప్పఁబడినదనియును, జ్ఞానమునందు ప్రవృత్తి కలుగుటకై జ్ఞానస్వరూపమును సూచించినాఁడనియును తెలియఁదగినది.

శ్లో. జ్ఞానాదేవహిసంసార వినాశోనైవకర్మణా,
విరక్తస్యతుసంసారాత్ జ్ఞానం కైవల్యసాధనమ్. ౨.

తా. సంసారనివృత్తి, జ్ఞానముచేతనే కలుగును. కర్మముచేతఁ కలుగదు. సంసారమునుండి విరక్తి నొందినవానికి మోక్షసాధనము జ్ఞానమే గాని వేఱుకాదు.

వి. కర్మముయొక్క ఫలము నివృత్తి యైనమీఁద మఱల జన్మమే కలుగునని భావము. "క్షీణేపుణ్యేమర్త్యలోకం విశంతిచ యథామతి". ఇట్లె భగవద్గీతయందును చెప్పఁబడియున్నది.

శ్లో. జ్ఞానమేవపరంబ్రహ్మాఽజ్ఞానం బంధాయచేష్యతే,
జ్ఞానమేకమిదంవిశ్వం నజ్ఞానాద్విద్యతే పరమ్. 3.

తా. జ్ఞానమే పరబ్రహ్మ స్వరూపము, అజ్ఞానము బంధము నిమిత్తము కల్గియున్నది. ఈ ప్రపంచ మంతయు నొక్కటైన జ్ఞానస్వరూపమైయున్నది. జ్ఞానముకంటె వేఱైన దేదియును లేదు.

వి. అనఁగా, జ్ఞానులకు ప్రపంచమంతయును జ్ఞానస్వరూపముగ నున్నదని భావము.

అవ. స్వామీ! ఇది వఱకును జ్ఞానముయొక్క మహిమను బోధించితిరి. మున్ను అజ్ఞానమే సంసారమును కలుగఁజేయుచున్నదని వచించితిరి. ప్రపంచ మంతయు జ్ఞానస్వరూపమైనప్పుడు అజ్ఞాన మెక్కడిది? యని యడుగఁగా ఆచార్యుం డిట్లని చెప్పుచున్నాఁడు.

మలమే అజ్ఞానము.

శ్లో. మలమజ్ఞానమిత్యుక్తం సంసారాంకురకారణమ్,
తత్తమస్తేన తమసా యుక్తోయస్తామసః స్మృతః. ౪.

తా. మలమే అజ్ఞానము. అది సంసారాంకుర కారణము. ఆ యజ్ఞానమే తమస్సనియుఁ జెప్పఁబడును. అజ్ఞానముతోఁ గూడినవాఁడే తామసుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

అవ. మల లక్షణమును బోధించుచున్నాఁడు.

మల త్రయము.

శ్లో. ఆణవంగర్భసంబంధ మణురూపం వ్యవస్థితమ్,
మాయికం జాతిభేదంచ మోహాఇత్యభిధీయతే. ౫.
కార్మికంద్రవ్యసంబంధ మీషణత్రయసంయుతమ్,
ఇదంమలత్రయందోషం గురుర్దేవవిమోచయేత్. ౬.

తా. పూర్వజన్మ వాసనను అనుగమించి జీవికి అణుత్వరూపము గా గర్భమునుండియే కల్గియుండునది ఆణవమల మనఁబడును. లోకమునంగల వారిలో నేనే యుత్కృష్టుండనెడి భేదమును బుట్టించునట్టి మోహమనెడి పేరుగలది మాయికమల మనఁబడును. ధన సంబంధమైన కోర్కెచేఁ గట్టువడి యీషణత్రయముతోఁ గూడియుండునది కార్మికమల మనఁబడును. ఈ మలత్రయదోషము సద్గురువుచేతనే నివృత్తి కాఁదగినది.

వి. 1. ఆణవమలము—పూర్వజన్మ వాసనాబద్ధమైన కర్మజీవి తద్దోషము నెఱుంగమిచేత వానిని బ్రహ్మమని నెఱుంగక చేయుచున్నది.



2. మాయికములము—ప్రపంచముయొక్క అస్థిరత్వమును దెలిసికొనక పోవుటచే అజ్ఞానమును కలుగఁజేయుచున్నది.

3. కార్మికమలము—ఇహ సౌఖ్యముకొఱకు పుణ్యపాప వివేచనలేక సకల కార్యములను చేయుటచే పునర్జన్మమునకు హేతువగు చున్నది.

కావున నీత్రిమలములను గురుకృప నొందినవాఁడె తొలఁగించి కొనఁగలఁడనియును, ఇతరుఁడు తొలఁగించి కొనఁడనియును భావము. ఈ మల విషయము సిద్ధాంతశైవ పక్షముని కొండ ఱుందుఱు.

అజ్ఞానమే చిత్తము.

శ్లో. అజ్ఞానభ్రాంతిరేవాంత శ్చిత్తమిత్యభిధీయతే.
అజ్ఞానముచ్యతేచిత్త మసత్సదివసంస్థితమ్. ౭.

తా. అజ్ఞానమనెడి భ్రాంతియే చిత్తముని చెప్పఁబడుచున్నది. అజ్ఞానమైన చిత్తము అసత్తుగా నున్నది. పామరులచే అసత్తు సత్తని చెప్పఁబడుచున్నది.

అవ. చిత్తమే అహంకారమని చెప్పుచున్నాఁడు.

చిత్తమే అహంకారము.

శ్లో. చిత్తం నిజమహంకారం విదు శ్చిత్తవిదోజనాః,
అంతర్యోయమహంభావో జంతో స్తచ్చిత్తముచ్యతే.

తా. చిత్తస్వరూపము నెఱింగిన జ్ఞానులు చిత్తమును నిశ్చయముగా అహంకారముని తెలిసికొనెదరు. జంతువులయొక్క హృదయమునందలి ఈ అహంభావము (నేననుతలంపు) చిత్తముని చెప్పఁబడుచున్నది.

అవ. బుద్ధియొక్క భేదమే అజ్ఞానముని చెప్పుచున్నాఁడు.

అజ్ఞానమే బుద్ధి.

శ్లో. అజ్ఞానశ్చమతేర్భేదో నాస్త్యన్యస్యద్వయంపునః,
దర్శనేషుచ సర్వేషు మతిభేదఃప్రదృశ్యతే. ౯.

తా. అజ్ఞానము, అందువలన గల్గిన భేదము, ఈరెండును బుద్ధికే గాని వేఱొకదానికిని గాదు. కనంబడు నీప్రపంచమునందుగల సమస్తవస్తువులయొక్కభేదమును బుద్ధియే చూచుచున్నది.

వి. అనఁగా, అజ్ఞానమే బుద్ధియని భావము. ఇట్లనుటచే అంతఃకరణ వృత్తులైన మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అను నివి నాలుగును అజ్ఞానమును కల్పించునదిగా నున్నదియని యభిప్రాయము. అనఁగా అంతఃకరణవృత్తులలో నే వృత్తి ప్రపంచమునందు ప్రసరించినను సంసారమును లేక అజ్ఞానమును కలుగఁజేయునని తాత్పర్యము. ఎట్లన, రాజాంగమునందు మంత్రి మొదలగువారు వేఱైనను, వీరుచేయు సకల కార్యములయొక్క పరిణామము రాజునే చెందునట్లు, ఏ వృత్తి ప్రబలమైనను దానికార్యము అజ్ఞానముగనే పరిణమించునని భావము.

అవ. చిత్తమే సంసారమునకుఁ గారణమని యనువదించుచున్నాఁడు.

చిత్తము సంసారకారణము.

శ్లో. చిత్తాంతరేవసంసారః కుంభాంతఃకుంభఖంయథా,
చిత్తనాశేనసంసారః కుంభనాశేన కుంభఖమ్. ౧౦.

తా. ఘటమం దెట్లు ఘటాకాశమున్నదో, అట్లు చిత్తమునందు సంసారమున్నది. ఘటనాశముచేత ఘటాకాశము లేనట్లు చిత్త నాశమైన మీఁద సంసారము నశించుచున్నది.

## చిత్తచాంచల్యము సంసారము.

శ్లో. చిత్తేచలతిసంసారో నిశ్చలే మోక్షఏవ హి,
తస్మాచ్చిత్తంస్థిరంకుర్యాత్ ప్రజ్ఞయాపరయాబుధః. ౧౧.

తా. చిత్తము చలించుటవలన సంసారము కలిగియున్నది. చిత్తము నిశ్చలమైన యెడల సంసారనివృత్తి (మోక్షము) అగుచున్నది. కాఁబట్టి బుద్ధిమంతుఁడైన ప్రాజ్ఞుఁడు చిత్తమును చంచల రహితము గాఁజేయఁదగినది.

అవ. చిత్తమే విషయానుభవములకును, సర్వప్రపంచమునకును కారణమని నిరూపించుచున్నాఁడు.

## చిత్తము విషయానుభవకారణము.

శ్లో. చిత్తంకారణమర్థానాం తస్మిన్సతిజగత్త్రియమ్,
తస్మిన్ క్షీణే జగత్ క్షీణం తచ్చికిత్స్యంప్రయత్నతః.

తా. విషయానుభవంబులకు చిత్తమే కారణమైయున్నది. ఆ చిత్తమువలననే త్రిలోకములును ప్రకాశించుచున్నది. చిత్తము నశించిన యెడల జగత్తు నశించును. కనుక అట్టి చిత్తమును ప్రయత్నముచేత శుద్ధి చేయవలయును.

వి. శరీరమందుగల రోగమును నివర్తిచేసికొనుట కెట్లు వైద్యుఁడును ఔషధమును ఆవశ్యకమో, అట్లు చిత్తశుద్ధిని చేసికొనుటకు (చిత్తమందలి మలినమనెడి రోగమును పరిహరించికొనుటకు) గురువనెడి వైద్యుఁడును, యోగామృతరసమనెడి ఔషధమును ఆవశ్యకమని సూచింపఁబడినది.

అవ. స్వామీ! చిత్తమందు విషయానుభవం బెలాగున కల్గియున్నది? యని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

## అజ్ఞానావరణము.

శ్లో. కోశాకారవదాత్మానం వాసనాతనుతంతుభిః,
వేష్టాయంశ్చైవ చేతోంతః బాలత్వాన్నావబుధ్యతే.



తా. ఆత్మయైనవాఁడు మనస్సులోపల వాసనలనెడి సూక్ష్మము లైన పోగులచే సాలెపురుగువలె చుట్టఁబడినవాఁడై అజ్ఞానమువలనఁ దన్ను తానే తెలిసికొనుటలేదు.

వి. తన్నే తెలిసికొననివాఁడు (ఆత్మస్వరూపము నెఱుంగనివాఁడు) ప్రపంచమంతయు జ్ఞానస్వరూపమని యెఱుంగఁడని యభిప్రాయము.

అవ. వాసనలనఁగానేమి? యని యడిగిన శిష్యునకు ఆచార్యుఁ డుపదేశించు చున్నాఁడు.

## వాసనా లక్షణము.

శ్లో. దృఢభావనయాత్యక్త పూర్వాపరవిచారణమ్,
యదాదానంపదార్థస్య వాసనా సా ప్రకీర్తితా. ౧౮.

తా. బహుకాలముగా దృఢముగా భావింపఁబడి ముందు వెనుకల నాలోచింపక అవివేకముతో నేది వస్తువును గ్రహించుటకు కారణముగ నుండునో అదే వాసన యనంబడును.

వి. దృఢభావన యనఁగా జన్మాంతరమునుండి కలిగినదని భావము.

## వాసనా భేదములు.

శ్లో. వాసనాద్వివిధాప్రోక్తా శుద్ధాచ మలినా తథా,
మలినా జన్మహేతుస్స్యాత్ శుద్ధా జన్మవినాశినీ. ౧౯.

తా. వాసన శుద్ధమనియు మలినమనియు నిరు తెఱంగులు. మలిన వాసన జన్మాదిదుఃఖములను గలుగఁ జేయుచున్నది. శుద్ధవాసన జన్మరాహిత్యము నొసంగుచున్నది.

వి. జన్మరాహిత్య మనఁగా మోక్షమని భావము.

## మలినవాసనా లక్షణము.

శ్లో. అజ్ఞానసుఘనాకారా ఘనాహంకారశాలినీ,
పునర్జన్మకరీప్రోక్తా మలినావాసనా బుధైః. ౨౦.

తా. అజ్ఞానమే మలినవాసన యనునది, అది మిగుల దృఢమైన ఆకారముగాఁ గలది, ప్రబలమైన అహంకారముతోఁ గూడినది, పునర్జన్మ మును కలుగఁజేయునది, అని పెద్దలచేతఁ జెప్పఁబడుచున్నది.

## మలినవాసనా భేదములు.

శ్లో. లోకవాసనయాజంతో శ్శాస్త్రవాసనయాపిచ,
దేహవాసనయాచాపి యథావన్నైవజాయతే. ౧౭.

తా. లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన, అను నీమూఁడును మలినవాసనా భేదములు. ఈ మూఁడింటిచేత ప్రాణులు తత్త్వజ్ఞానము నొందక యున్నారు.

వి. దుష్టములైనవి యన్నియు మలినవాసన లనఁబడును. లోకవాసన యనఁగా, తమ దేశము తమకులము తమయాచారము మొదలగువాని యం దభిమానము. శాస్త్రవాసన యనఁగా, తాను జదివిన గ్రంథములే ప్రమాణములనియును లేక శాస్త్రములనంతయు నభ్యసింపవలయుననియు ననెడికోరిక. దేహవాసన యనఁగా, శరీరముతోఁ బుట్టిన సుకృత దుష్కృతముల ప్రకారము వర్తించుట, లేక తనశరీరమునం దభిమానముంచుట.

అవ. స్వామీ! ఇట్టి యనర్థదాయకములగు వాసనల నెట్లు తొలఁగించికొనవచ్చు ననియడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

## వాసనా నాశము.

శ్లో. పౌరుషేణప్రయత్నేన బలాత్సంత్యజ్యవాసనాః,
స్థితం బధ్నాసిచేత్తర్హి పదమాసాదయస్యలమ్. ౧౮.

తా. పురుషప్రయత్నముచేత మలినవాసనల నన్నిటిని బలాత్కారముచే చక్కఁగా త్యజింతువేని పరమపదము సిద్ధించును.

వి. వాసనానాశముచేతనే ముక్తి కలుగుననని భావము. ఈయభిప్రాయము నిదివఱకే ౧౫ శ్లోకమున చెప్పఁబడియున్నది.

అవ. ప్రయత్నముచే నందఱును వాసనానాశము చేసికొనకుండు టకుఁ గతంబేమని యడిగిన శిష్యున కాచార్యుండిట్లనుచున్నాఁడు. శిష్యుఁడా! సద్గురూపదేశము నొంది గురువాక్య ప్రకారముగా ప్రయత్నము చేయవలయును. అట్లులేనినాఁడా ప్రయత్న మెకప్పుడును ఫలింపదు. అట్లు ఫలింపనందున కర్మల ననుభవించుటకై మఱల మఱల పుట్టుచు గిట్టుచు నుండును. అయినను జ్ఞానికిమాత్రము అవి అనుభవనీయములు కావు అని చెప్పుచున్నాఁడు.

## ఆగామికర్మనాశము.

శ్లో. స్వమసంగ ముదాసీనం పరిజ్ఞాయ నభోయథా,
నశ్లిష్యతేయతిఃకంచిత్ కదాచిద్భావికర్మభిః. ౧౯.

తా. బ్రహ్మవేత్తయైన యతి తన్ను సర్వసంగ పరిత్యాగియైన బ్రహ్మమని తెలిసికొని ఆకాశమువలె స్వచ్ఛత్వముచేతను విభుత్వముచేతను అసంగత్వముచేతను బ్రహ్మమాత్రుండై యుండుటవలన అగామికర్మములు అంటవు.

వి. ఆగామి కర్మమనఁగా, వర్తమాన కాలంబునందు జేయునట్టి కర్మములలో మిగిలియుండునది. ఇదే రాఁగలజన్మమున అనుభవింపఁబడునట్టి సంచితముతోఁ జేరునది.

## సంచిత కర్మనాశము.

శ్లో. అహంబ్రహ్మేతివిజ్ఞానాత్ కల్పకోటిశతార్జితమ్,
సంచితంవిలయంయాతి ప్రబోధాత్స్వప్నకర్మవత్.

తా. నేను బ్రహ్మమైతిననెడి దృఢాపరోక్షజ్ఞానము (శ్రవణ మనన నిది ధ్యాసన సమాధులచే జీవబ్రహ్మైక్య సాక్షాత్కారము) కలవానికి శత కోటి కల్పకాలముచేసిన సంచిత కర్మము నిద్రనుండి మేల్కాంచిన వానికి స్వప్నమందలి కర్మలు నశించునట్లు నశించును.

వి. సంచిత కర్మమనఁగా, జన్మాంతరములయం దనుభవింపఁబడక మిగిలియుండునది. ఇందలి కొంతభాగమె రాఁగల జన్మమునం దనుభవించు నట్టి ప్రారబ్ధమనఁబడును.

## ప్రారబ్ధ కర్మనాశము.

శ్లో. అజరోస్మ్యమరోఽస్మీతి య ఆత్మానం ప్రపద్యతే,
తదాత్మనాతిష్ఠతోఽస్య కుతః ప్రారబ్ధకల్పనా. ౨౧.

తా. నేను వార్ధిక్యము లేనివాఁడను, నేను మరణము లేనివాఁడను, అని యే బ్రహ్మజ్ఞానిపొందునో అట్టి బ్రహ్మవేత్తకు ప్రారబ్ధముయొక్క ఆరోపమును సంభవింపదు. అనఁగా ప్రారబ్ధము బ్రహ్మవేత్తకు కలదని ఆరోపమునైన చేయకూడదని భావము.

వి. ప్రారబ్ధకర్మమనఁగా, పూర్వజన్మమునందు చేర్చియుంచిన సంచితకర్మమునుండి యనుభవింపఁబడునది. ఈ కర్మము నిశ్శేషముగా అనుభవింపఁబడక పోయినయెడల మిగిలినది సంచితముతోఁ జేరి మఱల జన్మమును గలుగఁజేసి యనుభవింపఁజేయును. ప్రారబ్ధనివృత్తి జ్ఞానులకుతప్ప తదితరులచే నివర్తిచేసికొనుటకు సాధ్యముకాదు.

## సర్వదోషనాశము.

శ్లో. జ్ఞానినస్సర్వపాపాని జీర్యతేనాత్రసంశయః,
క్రీడన్నపినలిప్యేత పాపైర్నానావిధైరపి. ౨౨.

తా. జ్ఞానికి సకలపాపములును నశించుచున్నవి. సంశయములేదు. వానికి పలువిధములైన పాపము లున్నను, వాఁడు విషయలోలుఁడై యున్నను, ఆ పాపములు వాని ననుసరించుటలేదు.

వి. జ్ఞానికి పాపము సంభవింపదని యభిప్రాయము.

అవ. స్వామీ! కర్మ లనుభవింపక తీరదని శాస్త్రములందు చెప్పఁబడియున్నదికదా? యనియడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

## కర్మానుభవ నిరూపణము.

శ్లో. అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మశుభాశుభమ్,
నాభుక్తంక్షీయతేకర్మ కల్పకోటిశతైరపి. —౨౩.

తా. ప్రాణి చేసినట్టి పుణ్యపాపకర్మలు ఎంతకాలమైనను అనుభవింపక తీరదు. కావున అవశ్యము వానిని అనుభవింపవలయును.

అవ. శిష్యుఁడా! పుణ్యపాపకర్మలనుభవింప వలసినదని చెప్పఁబడియున్నను, జ్ఞానులకు త్రివిధకర్మలునశించుచున్నది. వా రనుభవింపవలసినది లేదు, అని చెప్పుచున్నాఁడు.

## కర్మనివృత్తి.

శ్లో. ప్రియేషుస్వేషుసుకృత మప్రియేషుచదుష్కృతమ్,
విసృజ్యధ్యానయోగేన బ్రహ్మాభ్యేతి సనాతనమ్. —౨౪.

తా. బ్రహ్మజ్ఞాని తనయొక్క పుణ్యమును మిత్రులవద్దను, తనయొక్క పాపమును శత్రువులవద్దను నుంచి ధ్యానయోగముచేత శాశ్వతబ్రహ్మానందము నొందుచున్నాఁడు.

వి. "తస్య పుత్రాదాయ ముపయంతిసుహృదః సాధుకృత్యం, ద్విషంతః పాపకృత్యం" అని శ్రుతియును గలదు. అనఁగా, జ్ఞానియొక్క ధనాది పదార్థములను వానిపుత్రులు గ్రహించెదరు. వానిపుణ్య కర్మమును వాని సేవచేయు సుహృదులును భక్తులును గైకొనెదరు. వాని పాపకర్మమును ద్వేషించునట్టి నిందకపురుషులు గ్రహించెదరు.

అవ. స్వామీ! జ్ఞానుల కిట్లు సుకృత దుష్కృతములు లేకపోవుచున్నవియని వచించితిరి. తదితరులకెట్లు నివర్తియగుననఁగా, సంచిత ప్రారబ్ధాగాములనఁబడు త్రివిధకర్మము లను త్రివిధములైన కర్మలచేతనే నివృత్తిచేసి కొనందగును; ఆ త్రివిధకర్మలచేతనే బంధమును గలుగఁజేసికొనవచ్చును. తద్విధం బెఱింగించెద వినుము నీ వ్యతిరేకముగా చెప్పుచున్నాఁడు



## త్రివిధకర్మములు.

శ్లో. శుభాఽశుభఫలంకర్మ మనోవాగ్దేహసంభవమ్,
కర్మజా గతయోన్నౄణాం ఉత్తమాధమమధ్యమాః.

తా. పుణ్యపాప ఫలమునిచ్చు కర్మము మనస్సుచేతను, వాక్కుచేతను, దేహముచేతను చేయఁబడుచున్నది. ఈ కర్మముయొక్క భేదము చేతనే ఉత్తమ మధ్యమ అధమ గతులను బొందెదరు.

## కర్మకారణము.

శ్లో. తస్యేహత్రివిధస్యాపి త్య్రధిష్ఠానస్య దేహినః,
దశలక్షణయుక్తస్య మనోవిద్యాత్ప్రవర్తతే. ౨౬.

తా. ఉత్తమ మధ్యమ అధమ రూపములుగలదిగను, ప్రాణులయొక్క త్రికరణములచేఁ జేయఁబడునదిగను, పదివిధములుగను నుండు కర్మకు మనస్సే కారణముగ నున్నది.

అవ. దశవిధకర్మములను అనువదించుచున్నాఁడు.

## మానసిక కర్మము.

శ్లో. పరద్రవ్యేష్వభిధ్యానం మనసాఽనిష్టచింతనమ్,
వితథాభినివేశశ్చ త్రివిధంకర్మమానసమ్. ౨౭.

తా. పరద్రవ్యము నభిలషించుట, బ్రహ్మహత్యాది కార్యములం జేయ నిచ్చయించుట, దేహమే యాత్మయని దానియం దభిమానముంచుట, అను నీ మూఁడును మానసిక అశుభకర్మములు.

వి. వీనికి వ్యతిరిక్తమైనట్టి మానసికకర్మలు శుభకర్మలని తెలియఁదగినది.

## వాచిక కర్మము.

శ్లో. పారుష్యమనృతంచైవ పైశున్యంచాపిసర్వశః,
అసంబద్ధప్రలాపశ్చ వాఙ్మయంస్యా చ్చతుర్విధమ్.

తా. అప్రియముగఁ బల్కుట, అసత్యమును జెప్పుట, దోషారోపణము చేయుట, వ్యర్థప్రసంగము చేయుట, ఇవి నాలుగును వాక్కుచే కావింపఁబడు అశుభకర్మములు.

వి. వీనికి వ్యతిరిక్తములైనవి వాచిక శుభకర్మములని యెఱుంగునది.

కాయిక కర్మము.

శ్లో. అదత్తానాముపాదానం హింసాచైవావిధానతః,
పరదారోపసేవాచ శారీరం త్రివిధం స్మృతమ్. ౨౯.

తా. పరుల ద్రవ్యమును అన్యాయముగాఁ దీసికొనుట, జీవహింస చేయుట, పరదారగమనము చేయుట, అను నీ మూఁడును కాయికమైన అశుభకర్మములు.

వి. వీనికి అన్యములైనవి కాయిక శుభకర్మలని తెలియఁదగినది.

త్రివిధకర్మఫలము.

శ్లో. శరీరజైః కర్మదోషై ర్యాతిస్థావరతాం నరః,
వాచికైః పక్షిమృగతాం మానసై రంత్యజాతిజామ్.

తా. కాయిక అశుభకర్మముచేత స్థావరముగను, వాచిక అశుభకర్మముచేత పశుపక్షులుగను, మానసిక అశుభకర్మముచేత అంత్యజాతిగను పుట్టుచున్నాఁడు.

వి. అంత్యజాతి యనఁగా బ్రహ్మవేత్తకంటె విలక్షణుఁడైన పామరుఁడని యభిప్రాయము. పామరుఁడు అనేక జన్మములకు తరించును. పామరునికంటె అనేక జన్మములకు పశుపక్షులు తరించును. పశుపక్షులకంటె అనేక జన్మములకు స్థావరములు తరించును.

అవ. స్వామీ! కర్మాయత్తమైన జన్మమునందు భ్రమించు జీవుఁడెట్లు కర్మఫల మనుభవింపక చేసికొన నగునని మఱల నడిగిన శిష్యున కాచార్యుఁ డిట్లని చెప్పుచున్నాఁడు.



## ప్రయత్న ప్రయోజనము.

శ్లో. పౌరుషేణప్రయత్నేన యోజనీయా శుభేపథి,
అశుభేషుసమావిష్టం శుభేష్వేవావతారయేత్. ౩౧.

తా. పురుషప్రయత్నముచేత మనస్సును సత్కర్మమునం దుంచఁ దగినది. అసత్కర్మలయందు ప్రవర్తించిన, మనస్సును మళ్లించి సత్కర్మమునందే యుంచవలెనినది.

వి. సత్కర్మ మాచరించువానికి ప్రారబ్ధాదికర్మలు నశించునని భావము.

అవ. సత్కర్మ మనునది యెట్టిదని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

## ద్వివిధకర్మములు.

శ్లో. ప్రవృత్తంచ నివృత్తంచ, ద్వివిధంకర్మ ఈరితః. ౩౨.

తా. కర్మము ప్రవృత్తియనియు, నివృత్తియనియు రెండువిధములుగాఁ జెప్పఁబడుచున్నది.

వి. ప్రవృత్తికర్మము అసత్కర్మమనియును; నివృత్తికర్మము సత్కర్మమనియును దెలియునది.

## ద్వివిధకర్మ ఫలము.

శ్లో. ప్రవృత్తంకర్మసంసేవ్య దేవానామేతిసామ్యతామ్,
నివృత్తంసేవమానస్తు భూతాన్యత్యేతిపంచవై. 33.

తా. ప్రవృత్తి కర్మాభ్యాసముచే దేవసమానత్వము నొందును. నివృత్తికర్మముచే పాంచభౌతిక సంబంధమగు శరీరమును మఱలఁ బొందఁడు. అనఁగా పునర్జన్మము లేని మోక్షము నొందును.

వి. ప్రవృత్తికర్మమనఁగా, యజ్ఞాదులు మొదలగునవి చేయుట. నివృత్తికర్మమనఁగా జ్ఞానముచే మోక్షము నొందుట యనిభావము.

అవ. యజ్ఞాది కర్మలయొక్క ఫలమును జెప్పుచున్నాఁడు.

కర్మఫల నిరూపణము.

శ్లో. యజ్ఞైశ్చదేవానాప్నోతి వైరాజం తపసాపదమ్,
బ్రహ్మణఃకర్మసన్న్యాసాద్వైరాగ్యాత్ ప్రకృతౌలయమ్.
జ్ఞానాత్ప్రాప్నోతికైవల్యంపంచైతాగతయః స్మృతాః.

తా. యజ్ఞములచే దేవతలయొక్క స్థానమును, తపస్సుచే విరాట్ స్థానమును, కర్మములనువిడిచినట్టి సన్న్యాసముచే బ్రహ్మస్థానమును, వైరాగ్యముచే (సర్వవిషయనివృత్తిచే) ప్రకృతిలయ మనెడి అజ్ఞాననాశమును, జ్ఞానముచే మోక్షమును బొందుచున్నాఁడు. ఇట్లు పొందునట్టి స్థానములు అయిదు విధములుగ నున్నవి.

అవ. స్వామీ! ప్రాణులాచరించు కర్మలకుందగిన శరీరములు కలుగవలయునని బోధమైనది. కనుక కర్మయే చేయకుండుట మేలుకదాయని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు. శిష్యుఁడా! భగవంతుఁడు స్వకులోచిత ధర్మంబుల నాచరింపవలయుననియును,ఇతరధర్మంబులు శ్రేష్ఠంబులైనను వాని నాచరింపరాదనియును విధించియున్నాఁడు. మఱియు కర్మలను తత్తద్వర్ణాశ్రమముల ననుసరించి యాచరింపనిచో దోషము కలుగుననియును విధించియున్నాఁడు. కనుక కర్మలను అవశ్యమాచరింపవలయును. అయినను ఆకర్మలయొక్క ఫలమును గోరక భగవంతునికే సమర్పించినయెడల కర్మఫలము లంటవని చెప్పుచున్నాఁడు.

కర్మార్పణము.

శ్లో. యత్కించిత్కురుతేకర్మ పురుషః సాధ్వసాధువా,
సర్వం నారాయణేన్యస్య కుర్వన్నపి న లిప్యతే. 3౫.

తా. పురుషుఁడు పుణ్యపాపకర్మముల నెంతకొంచెముగాఁజేసినను వానిని నారాయణునియందు సమర్పణము చేసినయెడల వాఁ డాకర్మము చేసినవాఁడైనను వానిని ఆకర్మఫలము లంటవు.

వి. భగవంతుఁడును గీతయందు సర్వకర్మలను తనయందు (కృష్ణ పరమాత్మయందు) అర్పణము చేయువారు ముక్తులగుదురని చెప్పియున్నాఁడు.

అవ. స్వామీ! కర్మలయందే యేకర్మలు, శ్రేష్ఠములును ఆచరింపఁదగినవియును ముక్తిమార్గదాయకమైనవియును నై యున్నవని యడిగిన శిష్యునింజూచి, ప్రాణులకు హితంబగు ధర్మంబులన్నియు సత్కర్మంబులనఁబడును గాన, తత్ప్రతిపాద్యంబులగు ధర్మంబుల నాచరించుటయే శ్రేయమని చెప్పుచున్నాఁడు.

ధర్మలక్షణము.

శ్లో. ధృతిఃక్షమాదమోఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః,
ధీర్విద్యాసత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్. ౩౬.

తా. సంతోషము, ఓర్పు, మనోనిగ్రహము, ఇతరులధనము నపహరింపకుండుట, శౌచము, ఇంద్రియనిగ్రహము, శాస్త్రజ్ఞానము, ఆత్మజ్ఞానము, సత్యము, అక్రోధము, అను నీపదియును ధర్మస్వరూపమునకు లక్షణములు.

అవ. శౌచలక్షణమును విశదీకరించుచున్నాఁడు.

శ్లో. శౌచంచద్వివిధంప్రోక్తం బాహ్యమాభ్యంతరతథా,
మృజ్జలాభ్యాంస్మృతంబాహ్యంభావశుద్ధిస్తథాఽన్తరమ్.

తా. శౌచము రెండువిధములుగా చెప్పఁబడుచున్నది. మృత్తికచేతను జలములచేతను శుద్ధి చేసికొను బాహ్యశౌచము, దేహశుద్ధి యనఁబడును. అట్లే (మనస్సునందుగల సంకల్పవికల్పాదులనెడి దుష్టచింతనలను పోఁగొట్టునట్టి మనోనిగ్రహము) రెండవదైన అంతరశౌచము, భావశుద్ధి యనఁబడును.

అవ. శౌచ మావశ్యకమని యనువదించుచున్నాఁడు.



శ్లో. శౌచంతుపరమంబాహ్యం తస్మాదాభ్యంతరంవరమ్,
ఉభాభ్యాంచ శుచిర్యస్తు స శుచి ర్నేతరశ్శుచిః. ౩౮.

తా. బాహ్యశౌచము ఉత్తమమైనది. దానికంటెను ఆంతరశౌచము (మనశ్శుద్ధి) ఉత్తమమైనది. బాహ్యాభ్యంతరము లనెడి ద్వివిధశౌచములు కలిగినవాఁడే పరిశుద్ధుఁడు. ఇందొకటియుండి మఱొకటి వదలినవాఁడు పరిశుద్ధుఁడు కాఁడు.

అవ. మున్ను వచించిన దశవిధములైన ధర్మములు గృహస్థునకు మాత్రము స్మృతులందు నియమించి యున్నదనితలంచి, జ్ఞాని స్వేచ్ఛగా వర్తింపఁదగదని చెప్పుచున్నాఁడు.

అధర్మదోషము.

శ్లో. అధర్మాజ్జాయతేఽజ్ఞానం యథేష్టాఽచరణం తతః,
ధర్మకార్యే కథం తస్య స్యాత్రధర్మో వినశ్యతి. ౩౯.

తా. అధర్మము వలన అజ్ఞానము కలుగుచున్నది. అందు వలన విధి నిషేధ వివేచనము లేని యథేష్టాచరణము కలుగుచున్నది. జ్ఞానస్వరూపమైన ధర్మ కార్యమునందు ప్రవృత్తి కలవారికి యథేష్టాచరణ మెక్కడిది? అనఁగా జ్ఞానులు అధర్మము నాచరింపరు. మఱియు జ్ఞానమునకు హేతువైన ధర్మము జ్ఞానస్వరూప ఫలముయొక్క తిరోధానముచేత వినాశము నొందుచున్నది. కావున జ్ఞానులకు యథేష్టాచరణమునందు ప్రవృత్తి కలుగుట లేదు.

వి. ఇట్లనుటచేత జ్ఞానులును సన్న్యాసులును స్వధర్మముల ననుష్ఠించుటతోఁగూడ దశవిధధర్మములను నాచరింప వలయునని భావము.

అవ. స్వామీ! ధర్మాతిక్రమణముచేత అజ్ఞానము కలుగునని చెప్పితిరి. మున్ను అజ్ఞానమే సంసారమునకు హేతువని వచించియున్నారు. కనుక సంసారమువలని దోషమేమియో చెప్పవలయును. అని యడిగిన శిష్యునకు ఆచార్యుండు క్రమముగాఁ జెప్ప నుపక్రమించి యిట్లనుచున్నాఁడు.

## సంసారవృక్ష నిరూపణము.

శ్లో. సహస్రాంకురశాఖాత్మ ఫలపల్లవశాలినః,
అస్యసంసారవృక్షస్య మనోమూలమిదంస్థితమ్. ౪౦.

తా. గణింపరాని కామాదులే సంసారవృక్షమునకు అంకురములు. స్వర్గనరకములే కొమ్మలు. శరీరములే వృక్షములు. సుఖదుఃఖములే ఫలములు. ఈషణత్రయములే(భార్యాపుత్త్రులు ధనము) చిగుళ్లు. ఇట్టిసంసారవృక్షమునకు మూలము మనస్సని తెలియఁదగినది.

మఱియొక విధము.

శ్లో. కామస్కంధః క్రోధలోభాదిశాఖః
తృష్ణాపత్త్రందుఃఖసౌఖ్యాఖ్యపుష్పమ్,
సంసారాఖ్యేనిష్ఫలో జృంభతే యో
వృక్షోరూఢస్తస్యమూలం మనోహి. ౪౧.

తా. సంసార వృక్షమునకు కామము (ఇచ్ఛ) మొద్దుగా నున్నది. క్రోధము లోభము మొదలగునవి కొమ్మలుగా నున్నవి. ఆశ పత్త్రములుగా నున్నవి. దుఃఖమును సుఖమును పుష్పములుగా నున్నవి. ఇట్టి చెట్టునందు మంచి ఫలమేదియు లేదు. ఈ చెట్టునకు వేఱు మనస్సుగా నున్నది.

వి. ఇట్లెన్ని విధములుగాఁ జెప్పినను సంసారమునకుఁ గారణము మనస్సనియే తెలియఁదగినది.

అవ. స్వామీ! సంసారమునకు మనస్సే కారణమని చెప్పితిరి. అదెట్లు? అని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు

## ఆశాదోష నిరూపణము.

శ్లో. యదాసర్వేప్రముచ్యంతే కామాయేఽస్యహృదిశ్రితాః,
అథ మర్త్యోఽమృతోభవత్యత్ర బ్రహ్మసమశ్నుతే. ౪౨.

తా. ఎప్పుడు మనస్సునందుండు ఆశలు పోవునో అనంతరము మోక్షము కల్గును. వాఁడు పరమాత్మ యగుచున్నాఁడు.

వి. కోరిక లున్నంతవఱకు బంధమని భావము.

శ్లో. సర్వ సంసార దుఃఖానాం తృష్ణైకా దీర్ఘ దుఃఖదా.

తా. సంసారమందలి సకల దుఃఖములయందును ఆశ యనునదే మిగుల దుఃఖము నొసంగునదిగా నున్నది.

వి. “శ్లో. ఆశాయా యేదాసా స్తేదాసాస్సర్వలోకస్య, ఆశా దాసీయేషాం తేషాం దాసాయతేలోకః”. అనఁగా, ఎవరు ఆశకు దాసులో వారు సకలజనులకును దాసులుగనుందురు. ఎవరికి ఆశ దాసిగానుండునో వారికి సకలజనులును దాసులుగానుందురు. అనియును; మఱియు “శ్లో. ఆశాపాశగళేబద్ధం గృహశాఖావలంబినమ్, పుత్రదారాదయః శ్వానః ఖాదన్తే తమహర్నిశమ్” అనఁగా, ఆశయనెడి దారముచేఁ కంఠమునందు బంధింపఁబడి గృహమనెడి కొమ్మయందు వ్రేలాడఁగట్టఁబడి యుండు జీవుని; పుత్రులు, భార్య, బంధువులు అను కుక్కలు రేయుం బవల్లు పెఱికి తినుచున్నవి. అనియును జెప్పియున్నారు.

అవ. ఆశ యెన్నివిధము లనియడిగిన శిష్యున కాచార్యుండిట్లని చెప్పుచున్నాఁడు.

ఈషణత్రయము.

శ్లో. భార్యాపుత్త్రంచ విత్తంచ ఈషణత్రయ మీరితమ్.

తా. భార్యయు, పుత్రుఁడును, ధనమును, ఆశా (ఈషణ) త్రయమనఁబడును.

అవ. స్వామీ! ఈ యాశ లందఱికిని కలిగియుండఁగా. వీనియందు దోషమేమని యడిగిన శిష్యునింజూచి ఆచార్యుడు, శిష్యుఁడా! లోకమునందందఱికిని యీషణత్రయముండదు. ఉండినను కేవలము పామరుని కున్నంత పండితున కుండునని భావింపకుము. ఉభయుల చిత్తవృత్తియు

వేర్వేరుగనే యుండును. పాఠకుఁడు మాత్రము స్త్రీని పొగడుచు నుండును. తద్విధం బెఱింగించెద వినుము, అని చెప్పుచున్నాఁడు.

## స్త్రీవర్ణనము.

శ్లో. సువర్ణగౌరీదూర్వాయా శైవళచ్ఛ్యామలాపివా,
పీనోత్తుంగస్తనాభోగ భుగ్నసూక్ష్మావలగ్నకా. ౭౭.

తా. బంగారమువంటి శరీర కాంతిగలది. గౌరాంగి. గరికవంటి శ్యామల వర్ణముకలది. ఉత్తుంగపీనస్తని. ఆ స్తన భారముచే సూక్ష్మమైన మధ్యముకలది.

శ్లో. బృహన్నితంబజఘనా రక్తపాదసరోరుహా,
రాకాచంద్రముఖబింబ ప్రతిబింబరదచ్ఛదా. ౭౫.

తా. గొప్పదగు పిఱుఁదులుకలది. కమలమువంటి యెఱ్ఱని పాదములు కలది. పూర్ణచంద్రునివంటి ముఖముకలది. దొండపండువంటి పెదవులు కలది.

శ్లో. నీలేందీవరనీకాశ నయనద్వంద్వశోభితా,
మత్తకోకిలసల్లాపా మత్తద్విరదగామినీ. ౭౬.

తా. నీలోత్పలమువంటి నేత్రములచే శోభిల్లునది. మదించిన కోకిల వంటి స్వరముకలది. మత్తేభమువంటి నడకగలది.

## స్త్రీనింద.

శ్లో. కటాక్షైరనుగృహ్ణాతి మాం పంచేషుశరోత్తమైః,
ఇతి యో మన్యతేమూర్ఖః సతు పంచేషుశాసితః.౭౭.

తా. ఇట్టి సుందరవతి మన్మథునియొక్క ఉత్తమ బాణములైనట్టి తన కటాక్షముచే నన్ను కృతార్థునిం జేయుచున్నదని యేమూర్ఖుఁడు తలంచునో వాఁడు మన్మథునిచే శిక్షింపంబడినవాఁ డగుచున్నాఁడు.



వి: మన్మథుండు పురుషుని తేజస్సును తక్కువ పఱుచుచున్నాఁడు. తేజస్సనఁగా వీర్యము. వీర్యముతగ్గుటచే శరీర పాటవమును, శరీర పాటవము తగ్గుటచే మనోబలమును, మనోబలము తగ్గుటచే ఇహ పర సౌఖ్యమును తగ్గునని భావము.

## భార్యాదూషణము.

శ్లో. సంప్రసూతకళ్త్రాణి గృహాణ్యుగ్రాపదామివ,
ఇయమస్మిన్ స్థితోదారాః సంసారే పరిపేలవా. ౪౭.

తా. సత్కులమునందు బుట్టిన భార్యలు భయంకరములైన ఆపదలకు స్థానములు. ఈ సంసారమునందు (గృహమునందు) ఉండునట్టి భార్య మిక్కిలి యుపద్రవముగానున్నది.

వి. సత్కులమందు జనించిన స్త్రీవిషయమునవే యిట్లుండఁగా దుష్కులమునందు, అనఁగా దుర్మార్గులగు తలిదండ్రులకు బుట్టినట్టి స్త్రీల విషయమును చెప్పవలయునా? అని భావము.

## స్త్రీసంగదుఃఖము.

శ్లో. కామనామ్నాకిరాతేన వికీర్ణా ముగ్ధచేతసః,
నార్యోనరవిహంగానా మంగబంధనవాగురాః. ౪౮.

తా. మన్మథుఁడను పేరుగల (ఆశయనెడి) బోయవానిచే పఱచఁబడిన ముగ్ధలగు స్త్రీలు మనుష్యులనెడి పక్షులకు శరీరమును బంధింపఁజేయు వలలై యున్నవి.

శ్లో. జ్వలతామతిదూరేపి సరసా అపి నీరసాః,
స్త్రియోహి నరకాగ్నీనాం ఇంధనంచాతిదారుణమ్.

తా. అతి దూరమందు (యమలోకమందు) మండుచుండు నరకాగ్నులకు స్త్రీలనెడి పదార్థములు (కట్టెలు) చెమ్మకలదిగా నున్నను, వానిని చక్కఁగా వెలిఁగింపఁజేయునవియై యున్నవి.

శ్లో. కేశకజ్జలధారిణ్యో దుస్స్పర్శాలోచనప్రియాః,
దుష్కృతాగ్నిశిఖానార్యో దహంతితృణవన్నరమ్.

తా. కేశములును, కాటుకయును ధరించి, తాఁకుటకు (స్పృశించుటకు) శక్యముగాకుండునట్టి స్త్రీలు, చూచుటకు సొగసుగానుండియు(అగ్ని ప్రకాశమానముగనుండియు తాఁకుటమాత్రముచే కాల్చునట్లు) పాపము నెడి యగ్నిజ్వాలలవంటివారై, గడ్డిపోచను కాల్చునట్లు, పురుషుని కాల్చుచున్నారు.

వి. కాటుకనలుపు కనుక అది పాపము. వెంట్రుకలు శిఖలవలెనుండుటచే నది అగ్నిజ్వాలలు. ఇట్లు రూపకముగాఁ జెప్పఁబడెను.

అవ. స్వామీ! ఇట్టిదోషయుక్త స్త్రీయందు పురుషున కేల మోహము జనించియున్నదని యడిగిన శిష్యునకు ఆచార్యుఁడు, అవిచారమే కారణమని చెప్పుచున్నాఁడు.

## మోహ నివృత్త్యుపాయము.

శ్లో. ఇతోమాంసమితోరక్త మితోఽస్థీనీతివాసరైః,
బ్రాహ్మణక్షీయతేరేవ యాతి స్త్రీవిషచారుతామ్.

తా. ఇచట మాంసమున్నది, ఇచట రక్తమున్నది, ఇక్కడ ఎముకలున్నవి, అని కొన్ని దినములు ఎవఁడు పురుషుఁడు విచారము చేసిన యెడల, స్త్రీశరీరము విషమువలె భయమును గలిగించును.

శ్లో. స్త్రీనామవాచ్యదేశస్య క్లిన్ననాడీవ్రణస్యచ,
అభేదేపిమనోభేదా జ్జనఃప్రాయేణ వంచ్యతే. ౫౩.

చర్మఖండంద్విధాభిన్న మపానోద్గారధూపితమ్,
యేరమంతి నరాస్తత్ర క్రిమితుల్యాః కథంనతే. ౫౪.

తా. స్త్రీలయొక్క చెప్పరానిచోటు (మర్మస్థానము) నెత్తురు స్రవించు వ్రణమువంటిది. వ్రణమునకును, దానికిని (గుహ్యమునకును), భేద

ము లేదు. పురుషులు తఱుచుగా వంచింపఁబడినవారై, రెండుగా చీలిన చర్మఖండమునందును, అపానవాయువుచే దుర్గంధముగఁ జేయఁబడిన దాని యందును, రమించుచున్నారు. ఇట్లు రమించుపురుషులు వ్రణము నందు సంచరించు పురుగులవంటివారే కదా.

అవ. మోహము శాశ్వతము గాదని చెప్పుచున్నాఁడు.

## మోహనివృత్తికాలము.

శ్లో. స్త్రీపుంసోర్యౌవనేరూపం యశ్చాన్యోన్యప్రియంపురా
తదేవ జరయాగ్రస్త ముభయోరపి నప్రియమ్. ౫౫.

తా. యౌవన కాలమునందు స్త్రీకి పురుషునియందును, పురుషునకు స్త్రీయందును, మోహముండును. ఆ యౌవనము పోయి, ముదిమి రాఁగానే, ఒండొరులపై ప్రియము తగ్గిపోవును.

అవ. స్వామీ! ఇట్టి మోహమేల కలిగినదని యడిగిన శిష్యునకు, ఆచార్యుఁడు, ఇంద్రియజయము లేకపోవుటే కారణమని విశదముగాఁ జెప్పుచున్నాఁడు.

## ఏకైకేంద్రియజంతునాశ నిరూపణము.

శ్లో. మాతంగో రతిభేదాశ్చ పతంగో దృష్టిభేదతః,
భృంగశ్చ గంధసంయోగాత్ కురంగః శబ్దలోల్యతః ౫౬.
మత్స్యశ్చ జిహ్వాలాంపట్యా దేకైకేంద్రియతో హతాః,
పంచేంద్రియసమాయుక్త మనుష్యాణాం హి కా కథా.

తా. ఏనుఁగు త్వగింద్రియము చేతను, పతంగము (మిడుత) చక్షురింద్రియము చేతను, తుమ్మెద ఘ్రాణేంద్రియము చేతను, జింక శ్రోత్రేంద్రియము చేతను, చేపలు జిహ్వేంద్రియము చేతను, నాశమొందుచున్నవి. ఈ పంచేంద్రియములును గల మనుష్యులచే పంచేంద్రియ చాపలమును తప్పించుకొనుటకు సాధ్యమా? అనఁగా సాధ్యముకాదని భావము.

అవ. ప్రపంచమంతయు స్త్రీయొక్క మర్మస్థానము వలని స్వల్ప సౌఖ్యముచేత మిగుల దుఃఖమొందెడునని నిరూపించుచున్నాఁడు.

### సుఖలేశానుగత మహాదుఃఖము.

శ్లో. హరిణీపాదమాత్రేణ బంధనంచ జగత్త్రయమ్,
సుఖంతు బిందుమాత్రేణ దుఃఖం పర్వతమేవచ. ౫౮.

తా. జింకగొరిజమాత్రమైన స్త్రీయొక్క గుహ్యముచేత మూఁడు లోకములును గట్టువడియున్నవి. దీనియందలి సుఖము బిందుమాత్రము. అనఁగా మిగులకొంచెము. దుఃఖముమాత్రము కొండవలెనధికముగానున్నది.

వి. “హరిణీఖురమాత్రేణ చర్మణా మోహితంజగత్, అన్యత్ర భీష్మాత్ గాంగేయా దన్యత్రచ హనూమతః” భీష్మాచార్యులు, అంజనేయుఁడు, వీరు తక్క తక్కినవారందఱును మోహమునొందిరని యభిప్రాయము. శుకాదులును మోహమొందని వారే. స్త్రీమోహమువలని నష్టమును విశ్వామిత్రాదులందు గనందగును.

అవ. స్వామీ! స్త్రీని వర్జించినవానికి, అనఁగా మొదటనుండి స్త్రీసంగములేనివానికిఁ బ్రయోజనమేమని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లు చెప్పుచున్నాఁడు.

### స్త్రీరహితఫలము.

శ్లో. యస్యస్త్రీతస్యభోగేచ్ఛా నిస్త్రీకస్యక్వభోగభూః,
స్త్రియంత్యక్త్వాజగత్యక్తం జగత్త్యక్త్వాసుఖీభవేత్.

తా. ఎవనికి స్త్రీకలదో వానికి భోగములయం దాశ కలుగును. ఎవనికి స్త్రీలేదో వానికి భోగములు లేవు. స్త్రీని విడిచినవానికి జగమే లేదు. జగమునువిడిచి సుఖవంతుఁడు (ముక్తుఁడు) కావలయును.

వి. “భోగేచ్ఛామాత్రాబంధాచ తత్త్యాగో మోక్ష ఏవచ” అని పెద్దలు చెప్పుచున్నారు.

అవ. ఇవ్విధముగా స్త్రీవిషయిక దుఃఖలక్షణములను బోధించి పుత్రవిషయిక దుఃఖమును నిరూపించుచున్నాఁడు.

## పుత్రదుఃఖము.

శ్లో. అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరమ్,
లబ్ధోపి గర్భపాతేన ప్రసవేనచ బాధతే. ౬౦.

తా. పుత్త్రుఁడు కలుగని కాలమునందు తలిదండ్రులు మిగుల దుఃఖించెదరు. గర్భముదాల్చినమీఁద గర్భపాతమైనపుడును, ప్రసవించునపుడును దుఃఖము కలుగుచున్నది.

శ్లో. జాతస్యగ్రహరోగాదిః కుమారస్యచ మూర్ఖతా,
ఉపనీతేప్యవిద్యత్వ మనుద్వాహశ్చ పండితే. ౬౧.

తా. బిడ్డపుట్టినతర్వాత బాలగ్రహములచేతను, లేక నవగ్రహదోషములచేతను, రోగాదులచేతను, బాధపడునపుడు తలిదండ్రులకు దుఃఖము కలుగుచున్నది. బాలుఁడు మూర్ఖుఁడైను, ఉపనయనానంతరము చదువక పోయినను, విద్వాంసుఁడైనమీఁద వివాహము కాకపోయినను, దుఃఖము కలుగుచున్నది.

శ్లో. యూనశ్చపరదారాది దారిద్ర్యంచ కుటుంబినః,
పిత్రోర్దుఃఖస్యనాస్త్యంతో ధనీచేన్మ్రియతే తదా.

తా. పుత్త్రుఁడు యౌవనవంతుఁడైనపుడు పరదారగమనము చేసినను, కుటుంబమునందుండియు దరిద్రవంతుఁడైనపుడును, ధనికుఁడుగా నుండియు మృతినొందినను, తలిదండ్రులు మరణపర్యంతమును మహాదుఃఖమును అనుభవించెదరు.

అవ. ఇట్లు పుత్రవిషయిక దుఃఖమును బోధించి ధనవిషయిక దుఃఖమును విశదీకరించుచున్నాఁడు.



## ధన దుఃఖము.

శ్లో. అర్థానామార్జనేదుఃఖ మార్జితానాంచ రక్షణే,
నాశేదుఃఖంవ్యయేదుఃఖం ధిగర్థాః క్లేశకారిణః. ౬౩.

తా. ధనమును సంపాదించుట యందును దుఃఖము. సంపాదించిన ధనమును సంరక్షించుట యందును దుఃఖము. ఆధనము వ్యయమైనపుడును దుఃఖము. ఇట్టి క్లేశకారణమైన ధనము నిందింపఁదగినది.

వి. అయినను, "ధిగ్జన్మ భాగ్యరహితం ధిగ్జన్మ ధనవర్జితమ్" అనియును; "దరిద్రః పురుషోలోకే శవవల్లోకనిందితః" అనియును; చెప్పఁబడియున్నది కదా యని కపటముచేతను, మోసముచేతను, ధనము నార్జింపఁదగదు. గృహస్థుఁడు న్యాయముగ ధనము నార్జించి కుటుంబ పోషణములను దాన ధర్మములను చేయవలయును గాని, కేవలము ధనాధికుండు కావలయునని యభిలషించి యార్జింపరాదనియు, అది మిగుల దుఃఖమును కలుగఁజేయుననియు, భావము.

అవ. సకల దుఃఖములకును గారణము, ఆ వస్తువుల యందుంచి యుండు స్నేహమే యని చెప్పుచున్నాఁడు.

## స్నేహ దుఃఖము.

శ్లో. యత్రస్నేహోభయంతత్ర స్నేహోదుఃఖస్యభాజనమ్,
స్నేహమూలానిదుఃఖాని తస్మిన్ త్యక్తేమహత్సుఖమ్.

తా. ఎచ్చట (ఏవస్తువునందు) స్నేహమున్నదో, అచ్చట దుఃఖమున్నది. స్నేహమే దుఃఖమునకు స్థానము. దుఃఖమునకు స్నేహమే మూలము. కావున స్నేహమును విడిచిన యెడల మహాసౌఖ్యము కల్గును.

అవ. ఇట్లాచార్యుఁడు చెప్పఁగావిని, శిష్యుఁడు, స్వామీ! ఆశ మిగుల దుష్టమైనదనియును, ఈషణత్రయములచేఁ గలుగు కష్టము లిట్టివని యును నిరూపించి, దీనికి స్నేహము కారణమని తెలియఁజేసితిరి. లోకమందు ఈ షణత్రయములచేతను స్నేహముచేతను నెందఱో సుఖమొందు

చున్నారు కదా? యని యడిగిన శిష్యున కాచార్యుఁడు— శిష్యుఁడా! కాకతాళీయన్యాయము ప్రకారము సుఖము లేశమాత్రముండినను, సంసారమునం జిక్కినవాఁడు తత్సుఖ సంపాదనకై యెన్నియో పాట్లుపడుచున్నాఁడు. అందువలన ఇహమున దుఃఖము ప్రాప్తమగుటగాక, అవసానంబున వాఁడాచరించిన పుణ్యపాపములను వాఁడే యనుభవింప వలయును. తద్విషయం బెఱింగించెద వినుము, అని చెప్పుచున్నాఁడు.

## పుణ్యపాపానుసరణము.

శ్లో. ఏకః ప్రజాయతే జన్తు రేకఏవ ప్రలీయతే,
ఏకానుభుంక్తే సుకృత మేకఏవచ దుష్కృతమ్. ౬౫.
మృతంశరీరముత్సృజ్య కాష్ఠలోష్ఠసమం క్షితౌ,
విముఖాబాంధవాయాంతి ధర్మస్తమనుగచ్ఛతి. ౬౬.

తా. ఒక్కొకజీవుఁడును తానొక్కఁడుగనే పుట్టుచున్నాఁడు. ఒక్కఁడుగనే గతించుచున్నాఁడు. వాఁడు చేసిన పుణ్య పాప కర్మములను వాఁడొక్కఁడుగనే యనుభవించు చున్నాఁడు. మరణమొందిన వీని శరీరమును కట్టెలను మట్టిపెళ్లలనువలె భూమిలో వేయుచున్నారు. బంధువులందఱును మఱలి పోయెదరు. వీనియొక్క పుణ్య పాప ఫలములు మాత్రము వీనిని యనుసరించి పోవుచున్నవి.

వి. "సుకృతం దుష్కృతంచైవ గచ్ఛంతమను గచ్ఛతి" అని పెద్దలు చెప్పుచున్నారు. "కావా కస్య ప్రియా పుత్రో బంధుః కోవా భవార్ణవే". అనఁగా సంసార సాగరమునందు భార్యయేది? బిడ్డలెవరు? బంధువులెక్కడిది? ఇందువలన ఇతరులకొఱ కాచరించు కార్యములన్నియు నిష్ప్రయోజనమని బోధమయ్యెడిని.

అవ. స్వామీ! ఈ జీవుని వెన్నంటి పుణ్యపాపములు పోవుసంటిరి. పుణ్యకర్మచే స్వర్గాదిలోకప్రాప్తి కల్గునని మున్ను చెప్పితిరి. పాపకర్మచే ప్రాణిని యనేక జన్మము లెత్తునట్లు చేయుటవలన మఱల జన్మములనెత్తి పుణ్యముచేసి తరింపఁడా? అని యడుగఁగా, ఆచార్యుఁడు-శిష్యుఁడా!

జన్మదుఃఖము చెప్పశక్యముగునా? తద్విషయం ఖేటించిగించెద వినుమని చెప్పుచున్నాడు.

జన్మదుఃఖము.

శ్లో. దుఃఖబీజమిదంజన్మ దుఃఖరూపంచ దుస్సహమ్,
నివృత్తధర్మోనోపాత్తో నయోగజ్ఞానసాధనమ్. ౬౭.

తా. ఈ జన్మము దుఃఖమునకు విత్తనము గా నున్నది. దుఃఖముగను ఓర్వఁగూడనిదిగను నుండునట్టి జన్మదుఃఖమును దొలఁగించి కొనునట్టి ధర్మమును నేను జేయలేదు. జ్ఞాన సాధనమైన యోగమును జేయలేదు. (అని గర్భస్థ శిశువు చెప్పుచున్నది.) మఱియును.

శ్లో. అహోదుఃఖోదఘోమగ్నో నపశ్యామిప్రతిక్రియామ్,
ధిగజ్ఞానం ధిగజ్ఞానం ధిక్కామక్రోధసంకటమ్. ౬౮.
సంసారశృంఖలంధిగ్ధిగాచార్యాద్జ్ఞానమాప్నుయాత్.

తా. మహాపాపమైనదుఃఖసముద్రమునందు మునిఁగియున్నాను. దీనికి పరిహారమైన (మోక్షసిద్ధికరమైన) కార్యములను నేనెఱుఁగలేదు. ఈ అజ్ఞానము నిందింపఁదగినది. ఈ కామక్రోధాది సంకటమును నిందింపఁదగినది. ఈ సంసారమనెడి సంకిలియు నిందింపఁదగినది. ఆచార్యులవలన జ్ఞానము నొందితినని నా జ్ఞానమును నిందింపఁదగినది.

వి. సద్గురువుచేఁ దెలిసికొనమి, లేక ఉపదేశప్రకార మనుష్ఠింపమి, ఇందువలన, జ్ఞానము నిందింపఁబడెనుగాని వేఱు కాదు.

శ్లో. యదియోన్యాంప్రముంచామి
సాంఖ్యయోగంసమాశ్రయే.
అశుభక్షయ కర్తారం
ఫలముక్తిప్రదాయకమ్.

తా. ఈ యోనిద్వారమునుండి వెలువడి బయటికి వత్తునేని సాంఖ్యయోగమును అభ్యసింతును. అశుభమైన పాపములను నాశముచేసి ముక్తినొసంగునట్టి భగవంతుని యాశ్రయింతును.

వి. సాంఖ్యయోగమును "భగవద్గీత" యందు రెండవ అధ్యాయమునఁగనందగును. సాంఖ్యమనఁగా, పరమార్థజ్ఞానము, ఇదే ఆత్మతత్త్వము, లేక తత్త్వజ్ఞానము అని భావము.

శ్లో. యోన్యాంయదిప్రముంచామి ప్రపద్యే పరమేశ్వరమ్.
యదియోన్యాంప్రముంచామి ప్రపద్యే జగదీశ్వరమ్.

తా. ఈ యోని ద్వారమునుండి వెలువడుదునేని పరమేశ్వరుని ఉపాసింతును. ఈ గర్భ ద్వారంబునుండి బయటికి వత్తునేని జగత్కారణుండైన జగదీశ్వరుని యుపాసింతును.

శ్లో. గర్భవాసాత్ప్రముచ్యేయం యది విష్ణుంభజేహ్యాది.౭౧.
అమృతప్రదమానందం నారాయణమనామయమ్.

తా. ఈ గర్భవాసమునుండి వెలువడుదునేని అమృతము (మోక్షము) నొసంగు వాఁడును, ఆనంద స్వరూపుఁడును, నిర్మలుఁడును, సర్వత్ర వ్యాపించియుండు వాఁడును నగు నారాయణుని హృదయమునందు భజింతును.

శ్లో. మాతృకుక్షానిబద్ధోస్మి ముచ్యేయద్యద్యబంధనైః.౭౨.
వాసుదేవంప్రతోష్యామి భగవంత మనన్యధీః.

తా. తల్లి కడుపునందు కట్టువడి యున్నాను. ఇపుడీబంధములనుండి విడివడుదునేని భగవంతుఁడైన వాసుదేవుని అనన్య మనస్కుఁడనై (వాసుదేవుఁడే గతియనెడి తలంపుగలవాఁడనై) సంతోషింపఁ జేయుదును.

వి. అనఁగా భగవత్ప్రీతికరంబులగు సత్కార్యంబు లాచరింతునని భావము.



శ్లో. పురాపరజనస్యార్థే కృతంకర్మశుభాశుభమ్. ౭౩.
ఏకాకీ తేన దహ్యామి గతాస్తే ఫలభాగినః.

తా. పరుల కొఱకు పూర్వ జన్మమునందు పుణ్యకర్మలను పాప కర్మలను నాచరించితిని. అ ఫలమును బొందినవారేమొ పోయిరి. ఆ కర్మ ఫలముల ననుభవించుటకొఱకు నేనొక్కఁడనుగనే దహింపఁ బడుచున్నాఁడను. (అని దుఃఖించు చున్నాఁడు).

అవ. ఇట్లాచార్యుఁడు చెప్పఁగావిని, శిష్యుఁ డిట్లనుచున్నాఁడు.

శ్లో. గర్భస్థస్య స్మృతిర్యాసీ సా జాతస్య ప్రణశ్యతి. ౭౪.

తా. గర్భమందు శిశువునకుఁ గల్గియుండిన జ్ఞానము, పుట్టిన మీఁద నశించుచున్నది. (దీనికిం గారణమేమి?)

అవ. ఇట్లడిగిన శిష్యునకు, ఆచార్యుఁ డిట్లనుచున్నాఁడు.

విష్ణుమాయ.

శ్లో. బాహ్యేనవాయునావిష్ణు మాయాసంజ్ఞేనబధ్యతే.

తా. విష్ణుమాయ యనెడి బాహ్యవాయువుచేత జీవుఁడు కట్టువడు చున్నాఁడు.

అవ. విష్ణుమాయచేఁ గట్టువడిన జీవునికి జ్ఞానముండదా యని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

అవిద్యామోహిత జన్మస్థితి.

శ్లో. అవిద్యామోహితోజీవో బ్రహ్మైక్యజ్ఞానవర్జితః. ౭౫.
పరిభ్రమతిసంసారో నిజకర్మానుసారతః.

తా. మాయచేతఁ గట్టువడిన జీవుఁడు బ్రహ్మైక్య జ్ఞానశూన్యుఁడై కర్మానుసారముగా సంసారమునందు పరిభ్రమించుచున్నాఁడు.

వి. మాయచేఁ గట్టుపడుటయును అవిద్యచే మోహితుండగుటయు నిచ్చట సమానార్థకములని గ్రహింపవలయును.

అవ. కర్మానుసారముగా నెట్లు సంసారమునందు పరిభ్రమింపు చున్నారని యడిగిన శిష్యున కాచార్యుఁడిట్లు చెప్పుచున్నాఁడు.

కర్మానుసార జన్మలక్షణము.

శ్లో. పంచభూతాత్మకోదేహీ పూర్వకర్మానుసారతః. ౭౬.
చోరపాపిష్ఠధీమన్తో వ్రతభ్రష్టోదయాపరః,
దరిద్రోధనికః కామీ వ్యాధిపీడ్యస్తుపండితః. ౭౭.
వివేకీభోగీనృపతిః తత్త్వవేత్తా యథాక్రమాత్.
నానాయోనిసహస్రాణి జాయతేచముహుర్ముహుః.౭౮.

తా. పాంచభౌతిక సంబంధముతోఁ గూడిన జీవుఁడు; పూర్వజన్మ పాప పుణ్యఫలము ననుసరించి దొంగగను, పాపమాచరించు వాఁడుగను, బుద్ధిమంతుఁడుగను, వ్రత భ్రష్టుఁడుగను, దయగలవాఁడుగను, దరిద్రుఁడు గను, ధనవంతుఁడుగను, ఆశాపరుఁడుగను, లేక స్త్రీలోలుఁడుగను, లేక ఉప భోగము లనుభవించు వాఁడుగను, రాజుగను, పరమార్థ మెఱింగినవాఁడు గను, లేక జ్ఞానవంతుఁడుగను, ఇట్లుగా అనేకయోనులందు మాటి మాటికి పుట్టుచున్నాఁడు.

వి. అనేక యోనులందు మాటి మాటికి పుట్టుచున్నాఁడని చెప్పుట వలననే పలుమఱు గిట్టుచు నున్నాఁడనియును ధ్వని గలుగుచున్నది. కావు ననే "మృతశ్చాహం పునర్జాతో జాతశ్చాహం పునర్మృతః" అనియును; "జాతస్య హి ధ్రువోమృత్యుః" అనియును; "జాతస్య మరణం ధ్రువమ్" అనియును పెద్దలు చెప్పియున్నారు. పుణ్యపాప ఫలములకుం దగిన జన్మ ములును, భోగములును, గలుగుటను గుఱించి స్మృతులందు విశేషాకారము గాఁ జెప్పఁబడియున్నది.

అవ. ఇట్టి హేయమైన మానవజన్మము శ్రేష్ఠమైనది కాదుగదా యని శిష్యుఁడడుగ, ఆచార్యుం డిట్లనుచున్నాఁడు.

## మానవజన్మ శ్రేష్ఠత్వము.

శ్లో. జంతూనాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం మతిజీవినః,
బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠాః నరేషు బ్రహ్మవాదినః. ౭౯.

తా. స్థావరము మొదలగు జడవస్తువులలోపల ప్రాణముగల జంతువులు శ్రేష్ఠములు. వానికంటెను బుద్ధిచే జీవించు మనుష్య మృగ పక్షి క్రిమి కీటకాదులు శ్రేష్ఠములు. బుద్ధిచే జీవించు జంతువులలోపల మనుష్యులు శ్రేష్ఠులు. ఆ మనుష్యులలోపల బ్రహ్మజ్ఞానులు శ్రేష్ఠులు.

అవ. జంతువులలో నుత్తమమైన మనుష్యజన్మమును వ్యర్థపుచ్చరాదని చెప్పుచున్నాఁడు.

## ఆత్మఘాతుకజన్మలక్షణము.

శ్లో. ప్రాప్యచాప్యుత్తమంజన్మ లబ్ధ్వాచేంద్రియసౌష్ఠవమ్,
నవేత్త్యాత్మహితం యస్తు స భవే దాత్మఘాతుకః. ౮౦.

తా. శ్రేష్ఠమైన మనుష్య జన్మము నొందియు, చక్కని స్థితియందుండు ఇంద్రియములను గలిగియుండియు, ఆత్మహితమైన కార్యము నెవఁడు తెలిసికొనఁడో, వాఁడు తన్ను తానె చంపువాఁ డగుచున్నాఁడు.

అవ. మానవజన్మము స్థిరమని తలంపరాదనియును, సత్కార్యము నాలస్యములేక చేయవలయుననియును చెప్పుచున్నాఁడు.

## శరీర అశాశ్వతము.

శ్లో. అహన్యహనిభూతాని ప్రవిశంతి యమాలయమ్.
శేషాః స్థావరమిచ్ఛంతి కిమాశ్చర్యమతఃపరమ్. ౮౧.

తా. ప్రాణులు ప్రతిదినమును యమలోకమునకుఁ బోవుచున్నారు. మిగిలియుండువారు, తాము స్థిరముగా నుందుమని తలంచుచున్నారు. ఇంత కంటె ఆశ్చర్య మేమున్నది?

శ్లో. నహిప్రమాణంజంతూనాం ఉత్తరక్షణజీవనే.

తా. జంతువులు ఉత్తరక్షణమునందు బ్రదికి యుందురనుటకు ప్రమాణ మేమియు కనఁబడలేదు.

వి. జన్మము అస్థిరముగాన, సత్కార్యముల నాలస్యములేక చేయ వలయును. కావుననే "అస్థిరం జీవనం లోకే" అనఁగా, లోకము నందు మనుష్య జీవితము శాశ్వతము కాదు. అనియును; "శ్లో. జలబుద్బుద వత్సర్వం సంసారమతినశ్వరమ్, జలరేఖాయథామిథ్యా తద్వత్ లోకత్ర యంవిదుః." అనఁగా, ఈ సకలమైన జనన మరణ ప్రవాహరూపమైన సంసారము నీటిబుగ్గవలె నాశమొందఁ దగినదిగనున్నది. జలమందు గీయఁ బడిన గీఁత యేలాగు అబద్ధమై పోవుచున్నదో, అట్లే మూఁడులోకములును నాశమొందఁదగినది. అనియును;"శ్లో. ఆపదఃక్షణమాయాంతిక్షణమాయాంతి సంపదః, క్షణంజన్మాథమరణం సర్వంనశ్వరమేవతత్." అనఁగా, ప్రాణులు క్షణకాలమునం దాపదయును, క్షణము నేవులో సంపదయును, క్షణము న జన్మమును, క్షణకాలమున మరణమును పొందెదరు. ప్రపంచమంతయు నాశము కావలసినదిగనే యున్నయది. అనియును; పెద్దలు చెప్పుచున్నారు.

అవ. స్వామీ! ప్రపంచమందు సంసారబంధము ఆశచేతనే కలిగి యున్నదనియును, సంసారమునుండి తరించిన యెడల ముక్తి కల్గుననియును మున్ను నిరూపించితిరి. సంసారబంధము నెట్లు తొలఁగించికొని ముక్తినొంద వచ్చునని శిష్యుఁడడుగఁగా, ఆచార్యుఁడు శిష్యునింగూర్చి కరుణగలవాఁడై, భక్తిమార్గము ప్రపన్నులకు ప్రయోజన మొసంగునదిగ నున్నదనియును, తద్ద్వారా ముక్తి కల్గుననియును, అభ్యాసికిభక్తిఆవశ్యకమైనదనియును నిశ్చ యించి, ప్రథమంబునం దనుష్ఠేయమునకు లక్ష్యభూతమైన సగుణోపాసన మును బోధించుచున్నాఁడు.

## సగుణోపాసనాక్రమము.

శ్లో. సంసారవిషవృక్షేయః సర్వతోఽతిభయంకరః. ౧౨.
విష్ణుభక్తికుఠారేణ భిద్యతే నాఽన్యథా భువి.

తా. అతి భయంకరమైన సంసారమనెడి విషవృక్షమును విష్ణుభక్తియనెడి గొడ్డలిచేతనే ఛేదింపవలయును. ఇది తప్ప వేఱే ఉపాయము భూమియందు లేదు.

వి. "శివభక్తి కుఠారేణ" యనియుం జెప్పవచ్చును. శివ విష్ణు శబ్దములయందు విరోధంబులేదు.

అవ. స్వామి! విష్ణువుయొక్క భక్తి నేలాగు చేయవలయునని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

## సర్వం విష్ణుమయము.

శ్లో. సర్వేవిష్ణుమయాదేవాః సర్వేవిష్ణుమయాగణాః. ౧౩.
నహి విష్ణుసమా కాచిత్ గతిరన్యావిధీయతే,
ఇత్యేవంసతతంవేదా గాయన్తినాత్రసంశయః. ౧౪.

తా. సకల దేవతలును విష్ణుస్వరూపులు. సకల గణములును విష్ణుస్వరూపులు. విష్ణువునకు సమానముగాఁ బొందఁదగినది వేఱేదియు లేదు. వేదము లిట్లు సదా ఘోషించుచున్నవి. దీనికి సందేహము లేదు.

వి. అనఁగా సర్వమును విష్ణువనెడి భావముతో భక్తి చేయవలయును. కావుననే "సర్వం విష్ణుమయం జగత్" అనెదరు. "సర్వం శివమయం జగత్" అని చెప్పుటవలనను దోషము లేదు.

అవ. విష్ణుభక్తియే చేయవలయుననుటకుం బ్రమాణమును జెప్పుచున్నాఁడు.

## విష్ణుభక్తివిశేషము.

శ్లో. ఆలోడ్యసర్వశాస్త్రాణి విచార్యచ పునః పునః,
ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణస్సదా. ౧౫.

శ్లో. కింతస్య బహుభిర్మంత్రైః కింతస్య బహుభిర్వ్రతైః,
నమోనారాయణాయేతి మంత్రస్సర్వార్థసాధకః. ౧౬.

తా. సకల శాస్త్రములను పరిశోధించియు, మాటిమాటికి విచారించియు చూచినందువలన, సదా ధ్యానింపఁ దగిన వస్తువు నారాయణుం డొక్కఁడే యని విశదమయ్యెను. అట్టి పరమాత్మను ధ్యానించు వానికి వివిధ మంత్రములచేతను, వివిధ వ్రతములచేతను ప్రయోజన మేమి? ఓంనమోనారాయణాయ యను మంత్రము సకలాభీష్టముల నొసంగు నట్టిదిగా నున్నది.

వి. కఠవల్లి -3-9, తైత్తిరీయము 1-12, తైత్తిరీయము నారాయణీయము 6-6, అంచే 6-13, సుబాలోపనిషత్ అ-6, వీని యందును; వాసుదేవ, తారాసార, శాట్యాయని మొదలగు ఉపనిషత్తులయందును; నారాయణ మహత్త్వమును, సర్వమును నారాయణుఁడే యనియును జెప్పఁబడియున్నది. విస్తర భయంబుచే వివరించలేదు.

అవ. భగవంతుని యెట్లు ధ్యానింప నగునని యడిగిన శిష్యునకు నాచార్యుం డిట్లనుచున్నాఁడు. శిష్యుఁడా! విష్ణువు లోకోద్ధరణార్థమై వివిధావతారములను దాల్చియున్నాఁడు. ఇష్టమైన మూర్తిని ధ్యానింప వచ్చును. తద్విధం బెఱింగించెద వినుమని చెప్పుచున్నాఁడు.

భక్తానుగ్రహాశరీరపరిగ్రహము.

శ్లో. నిర్గుణం చేంద్రియాతీతం నిరాకారం నిరంజనమ్,
స్వభక్తరక్షణార్థాయ జాయతే హి యుగేయుగే. ౧౭.

తా. నిర్గుణుఁడును, ఇంద్రియములచే నెఱుఁగఁబడని వాఁడును, ఆకారము లేని వాఁడును, నిరంజనుండును నగు పరబ్రహ్మము తనయొక్క భక్తులను (ఆశ్రితులను) సంరక్షించు కొఱకు, ప్రతియుగమునందును(రామ కృష్ణాద్యవతారములుగా) అవతరించుచున్నాఁడు.

అవ. విష్ణు స్వరూపమును విశదీకరించుచున్నాఁడు.

## వ్యక్తాఽవ్యక్తస్వరూపము.

శ్లో. విష్ణురూపం ద్విధాప్రోక్తం వ్యక్త మవ్యక్తమేవచ,
తయోరేకమతిత్యక్త్వా పతత్యేవ నసంశయః. ౮౮.

తా. విష్ణు స్వరూపము వ్యక్తము, అవ్యక్తము అని రెండు విధములు. వీనియం దొకదాని నైనను ఉపాసింపక విడిచిపెట్టిన వాఁడు అధోగతి నొందును. సంశయము లేదు.

వి. వ్యక్తము అనఁగా భగవంతుఁడు శంఖచక్రాద్యాయుధములను పీతాంబరమును ధరించి, శ్రీభూనీళలతోఁగూడి ప్రకాశించు సగుణరూపము. అవ్యక్తము అనఁగా సర్వత్ర వ్యాపించియుండు నిర్గుణరూప పరతత్త్వ వస్తువని భావము.

అవ. స్వామీ! అష్టాక్షరమంత్రము శ్రేష్ఠమని యుపదేశించితిరి. దాని నెట్లు జపింప వలయునని యడిగిన శిష్యునికి ఆచార్యుం డిట్లని చెప్పుచున్నాఁడు.

## జప లక్షణము.

శ్లో. జపస్తు ద్వివిధః ప్రోక్తో వాచకో మానసస్తథా,
వాచకోపాంశురుచ్చైశ్చ ద్వివిధః పరికీర్తితః. ౮౯.
మానసో మననధ్యాన భేదాత్ ద్వైవిధ్యమాశ్రితః,
ఉచ్చైర్జపాదుపాంశుశ్చ సహస్రగుణ ఉచ్యతే. ౯౦.
మానసశ్చతథోపాంశు స్సహస్రగుణ ఉచ్యతే
ఉచ్చైర్జపశ్చసర్వేషాం యథోక్తఫలదోభవేత్. ౯౧.
నీచైశ్శ్రోత్రేణచేన్మంత్ర శ్శ్రుతశ్చేన్నిష్ఫలంభవేత్.

తా. జపము వాచకమన్నియును మానసికమనియును రెండు విధములు. వాచకమునందు ఉపాంశువు అనియును ఉచ్చము అనియును రెండు

విధములు. మానసికమునందు మననము అనియును ధ్యానము అనియును రెండు విధములు. ఉచ్చమునకంటె ఉపాంశువు వేయిపాళ్లు మేలైనది. ఉపాంశువుకంటె మననము వేయిపాళ్లు ఉత్తమమైనది. సకలజపములందు నిర్విఘ్నముగా ఫలము కలుగును. మఱియు నీచుల చెవిని, మంత్రము వినఁబడునట్లు జపించినయెడల నిష్ఫలమగును.

వి. ఉచ్చమనఁగా ఇతరులకు వినంబడునట్లు జపించుట. ఉపాంశువనఁగా నాలుకయు పెదవులును మెల్లఁగా కదలునట్లుచ్చరించుట.విచారసాగరమును జూడుము. "భాష్యాదుపాంశుశ్శస్తస్స్యాత్తస్మాచ్ఛస్తోహిమానసః,ప్రాగాస్యశ్చోత్తరాస్యోవా మంత్రాణాంస్యాజ్జపాదికమ్".అనఁగా, మంత్రములయొక్క శబ్దములు వినఁబడునట్లుచ్చరించుట కంటెను ఉపాంశువు (రహస్యముగా నుచ్చరించుట) శ్రేష్ఠము. ఉపాంశువు కంటెను మానసముగా నుచ్చరించుట (మననము) శ్రేష్ఠము. తూర్పుముఖముగా నైనను,ఉత్తరముఖముగానైనను, జపము ప్రణవోపాసనము మొదలగునవి చేయవలయును. ప్రణవజపము "చైత్ర్యాదిదినమారభ్య ఫాల్గున్యంతదినాంతకమ్" చైత్రశుద్ధ ప్రథమ మొదలు ఫాల్గున బహుళ అమావాస్య వఱకును చేయవలయు నని చెప్పఁబడియున్నది. అనఁగా అభ్యాసి ఒక్క సంవత్సరము దాఁక ప్రతిదినమును తప్పక జపింపవలయునని భావము.

## మంత్రోపదేశ కాలము.

శ్లో. మంత్రాస్సర్వేదివాపూర్వ గ్రాహ్యాస్తత్రహితాస్తువా.

తా. సకలమంత్రములును ఉదయకాలముననే ఉపదేశము నొందవలయును. ఆ కాలమున గ్రహించినయెడల ఫలసిద్ధి యగును.

## మంత్రసిద్ధి క్రమము.

శ్లో. గుర్వాజ్ఞాపూర్వకంఏవం గృహ్ణీయాన్మంత్రముత్తమమ్.

తా. గుర్వాజ్ఞాప్రకారముగా మంత్రమును గ్రహింపఁదగినది. అదే శ్రేష్ఠమైనది.

## మంత్రవైపరీత్యము.

శ్లో. అన్యథాస్వీకృతంమంత్రం తజ్జపేద్యద్యనర్థకమ్. ౯౩.

తా. గురువుయొక్క ఆజ్ఞాపూర్వకముగా గ్రహింపని మంత్రమును జపించుటవలన విపరీతము సంభవించును.

వి. గుర్వాజ్ఞలేక గురువుయొక్క పుస్తకము నందుండు మంత్రమును, లేక గురువు ప్రసంగవశంబునం జెప్పినప్పుడు వినిన మంత్రమును పఠింపరాదు. మఱియు నట్టి జపముచే ననేకానర్థములు సంభవించును.

అవ. స్వామీ! నారాయణాష్టాక్షరి మొదలగు మంత్రముల నుపదేశమొంది దానినే జపింపవలయునా? లేక వేఱె సాధనములున్నవా? యనియడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

## నవవిధ భక్తిమార్గములు.

శ్లో. శ్రవణంకీర్తనంవిష్ణోః స్మరణం పాదసేవనమ్,
అర్చనం వందనందాస్యం సఖ్యమాత్మనివేదనమ్. ౯౪.

తా. శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము, అను నీతొమ్మిదియు భక్తియొక్క మార్గములు.

వి. 1. శ్రవణము—భగవంతుని కథలను వినుట. దీనివలన పరీక్షిద్రాజు ముక్తినొందెను.

2. కీర్తనము—భగవంతుని నామములను పొగడుట, లేక భజించుట. ఇందువలన నారదమహర్షి ముక్తినొందెను.

3. స్మరణము—భగవన్నామములను స్మరించుచుండుట. దీనివలన శుకమహర్షి ముక్తినొందెను.

4. పాదసేవనము—భగవంతుని దివ్యాలయములకుం జనుట. ఇందువలన లక్ష్మీదేవి భగవంతుని యెడబాయకయుండి శ్రేష్ఠతనొందెను.

5. అర్చనము — భగవంతుని పూజించుట. దీనివలన పృథుచక్రవర్తి ముక్తి నొందెను.

6. వందనము — భగవంతునికి సాష్టాంగ దండప్రణామం బాచరించుట. ఇందువలన అక్రూరుఁడు ముక్తినొందెను.

7. దాస్యము — భగవంతునికి కైంకర్యము చేయుట. దీనివలన గరుడ హనుమదాదులు కీర్తినొందిరి.

8. సఖ్యము — భగవంతునితోఁ గూడియుండునట్లు భావించుట. ఇందువలన అర్జునుఁడు ముక్తినొందెను.

9. ఆత్మనివేదనము — భగవంతునికి సమస్తమును అర్పణము చేయుట. దీనివలన బలిచక్రవర్తి ముక్తినొందెను.

తక్కిన విషయములను "నారదభక్తిసూత్రములు" అను గ్రంథమునందుఁ గనందగును.

అవ: స్వామీ! విష్ణుభక్తియు అష్టాక్షరీజపమును చేయువానికి సంధ్యావందనాది నిత్యకర్మ లనావశ్యకమే కదా? యని యడిగిన శిష్యునకు ఆచార్యుం డిట్లనుచున్నాఁడు.

## సంధ్యావందన ప్రయోజనము.

శ్లో. సంధ్యాముపాసతే యేతు సతతం సంచితవ్రతాః,
విధూతపాపాస్తేయాంతి బ్రహ్మలోకమనామయమ్.

తా. ఏపురుషుఁడు క్రమముగా నెల్లపుడును (త్రికాలములయందును) శ్రద్ధాభక్తితోఁ సంధ్యోపాసనాది నిత్యకర్మలను చేయుచున్నాఁడో, వాఁడు సర్వపాపనివృత్తినొంది, పునరావృత్తిరహితమైన బ్రహ్మలోకమును జెందుచున్నాఁడు.

వి. అనఁగా మున్ను చెప్పినట్లు కులోచిత ధర్మంబును గృహస్థుఁడు మానఁగూడదనియును, సంధ్యావందనాదులును ముక్తిప్రదంబు లనియును భావము.

అవ: స్వామీ! లోకంబునం దనేక దేవతల నుపాసించుచున్నారు కదా? వారి గతి యేమని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

మతములు.

శ్లో. దర్శనంషడ్విధంప్రోక్తం శైవశాక్తేయవైష్ణవమ్,
గాణాపత్యంచసౌరంచ కాపాలిక మితిస్మృతమ్. ౯౬.

తా. శైవము, శాక్తేయము, వైష్ణవము, గాణాపత్యము, సౌరము, కాపాలికము, అని ఆఱు మతములు చెప్పఁబడియున్నది.

వి. ఆయా మతమునకు ఆయా దేవతయే పరతత్త్వముగ నుండును. ఇంకను అనేకమతములు కలవు. వానిలో ప్రధానము లీయాఱని యెఱుంగునది. "సకలార్థసాగరము" అను గ్రంథమును జూచినచో మత విషయములన్నియును స్పష్టమగును.

దేవతాంతరభక్తి ప్రయోజనము.

శ్లో. యోయందేవంభజేద్భక్త్యా సచాదాలభతేచ తమ్.
కాలే పశ్చాత్తేనసార్థం పరం విష్ణోఃపదం లభేత్. ౯౭.

తా. ఎవఁడెవఁడు ఏయే దేవతను భజించినను, వాఁడు వాఁడా యా దేవతయొక్క స్థానమును బొందును. తర్వాత ఆయా దేవతతోఁ గూడ అంతమునందు శ్రేష్ఠమైన విష్ణువుయొక్క పదమును బొందును.

వి. విష్ణుపదం బనఁగా మోక్షమని యర్థము. "సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" అను నట్లు, భగవంతునికి ప్రత్యంగ స్థానములగు ఇతర దేవతా భజనాదులును భగవంతునే చెందును. మఱియును, ఉపాసకు లెట్లెట్లు భగవంతుని భావించి ధ్యానించినను, తత్తద్రూపములుగా దర్శన మిచ్చి ముక్తి నొందించుచున్నాఁడు. ఈ విషయమును భగవద్గీత ౭ అ. ౬ శ్లోకము నందును, మైత్రాయణ్యుపనిషత్ అ 4 లోను చూడుము.

అవ. స్వామీ! పూర్వము ఈషణాత్రయములే బంధమనియును, అవియే సంసారమునకుఁ గారణమనియును వచించి, మఱల మనస్సే వీనిని కలుగఁ జేయుచున్నదనియును, అదే బంధమోక్షములకుఁ గారణమనియును బోధించి, ఇపుడు స్వధర్మాచరణమును, భగవద్భక్తియును గూర్చి యుపదేశించితిరి, బంధనివృత్తికి యితరోపాయము లున్నయెడల నుపదేశింపవలయునని ప్రార్థించిన శిష్యున కాచార్యుం డిట్లని చెప్పుచున్నాఁడు

## నిస్పృహత్వ మహిమ.

శ్లో. యదాభావేనభవతి సర్వభావేషు నిస్పృహః,
తదా సుఖమవాప్నోతి ప్రేత్యచేహచశాశ్వతమ్. ౯౮.

తా. ఎప్పుడు తత్త్వజ్ఞానముచేత దోషములను గలుగఁజేయునట్టి విషయాభిలాషలయందు (ప్రపంచసంబంధమైన కోరికలయందు) నిస్పృహుఁడగునో, అపుడు ఇహమందును పరమందును సౌఖ్యము నొందును.

వి. కావుననె "ఉదారస్యతృణంవిత్తం శూరస్యమరణంతృణమ్, విరక్తస్యతృణంభార్యా నిస్పృహస్యతృణంజగత్." అనియును; "ఆశాచ నరకశ్చైవ నిరాశా ముక్తిరేవచ, ఆశానిరాశేచయస్య న్యస్తస్తస్యసుఖం భవేత్" అనియును, పెద్దలచేఁ జెప్పఁబడెను.

అవ. ఇహ పర సౌఖ్యములను కలుగనీయక ప్రతిబంధించునట్టిది యహంకారమనియును, తద్దోషమిట్టిదనియును నిరూపించుచున్నాఁడు.

## అహంకారదోషము.

శ్లో. అహం మమత్వం హి భవస్యబీజం
నాహం మమత్వం భవబీజనాశమ్,
బీజే ప్రణష్టే కుతఏవ జన్మ
నిరింధనా ద్వహ్ని రుపైతి శాన్తిమ్. ౯౯.

తా. నేను, నాది, అనునదే సంసారమునకు (జన్మమునకు) బీజము (కారణము). నేను కాను, నాది కాదు, అనుటయే సంసారమునకు (జన్మమునకు) నాశము. సంసారమునకు కారణమైన అహంకార మమకారములు నష్టమైనమీఁద జన్మ యెక్కడిది? అనఁగా లేదు. కట్టెలు లేకపోవుటవలన అగ్ని శమించునట్లుగా (నశించుచున్నది).

శ్లో. అహంకారవశాదాప దహంకారాద్దురాధయః,
అహంకారవశాద్దేహో నాహంకారాత్పరోరిపుః. ౧౦౦.

తా. అహంకారమువలననే ఆపదయును, అహంకారమువలననే దుష్టమైన మనోవ్యథలును, అహంకారమువలననే దేహములును, కలుగుచున్నవి. అహంకారమునకంటె వేఱైన శత్రువులేదు.

అవ. స్వామీ! ఇట్టియహంకారము నెట్లు తొలఁగించికొన నగునని యడిగిన శిష్యునకు ఆచార్యుండు తన్నివృత్తిసాధన మిట్టిదని నిరూపించుచున్నాఁడు.

## సాధనచతుష్టయము.

శ్లో. స్వవర్ణాశ్రమధర్మేణ తపసా గురుతోషణాత్,
సాధనంప్రభవేత్పుంసాం వైరాగ్యాదిచతుష్టయమ్.

తా. కులోచిత ధర్మముచేతను, తపస్సుచేతను, గురువును సంతోషింపఁ జేయుటచేతను, పురుషులకు వైరాగ్యాది సాధన చతుష్టయము కల్గును.

అవ. సాధనచతుష్టయమును విశదీకరించుచున్నాఁడు.

శ్లో. నిత్యానిత్యవివేకశ్చ ఇహాముత్రవిరాగతా,
శమాదిషట్కసంపత్తిర్ముముక్షుతాంత్సమభ్యసేత్.

తా. నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్ర ఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వము, ఇవి నాలుగును సాధన చతుష్టయమనఁబడును. వీనిని చక్కఁగా అభ్యసింపవలయును.



వి. 1. నిత్యానిత్యవస్తువివేకమనఁగా, బ్రహ్మము నిత్యమనియును, జగత్తు అనిత్యమనియును, నిశ్చయించుట.

2. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగమనఁగా, ఇహమందు సుఖసాధనములని భ్రమించిన విషయ సంబంధమునందును, పరలోకమునందు రంభాసంభోగేచ్ఛాది సుఖము నిరంతరమని భావించినవిషయసంబంధమునందున్ను విరక్తి కలిగి యుండుట.

3. శమాది షట్కసంపత్తి యనఁగా, ౧ శమము, ౨ దమము, ౩ ఉపరతి, ౪ తితీక్ష, ౫ క్షమా, ౬ శ్రద్ధ, ఈ౬ను చేరి శమాదిషట్కమనఁబడును. అందు ౧ శమమనఁగా, అంతరింద్రియ నిగ్రహము. ౨ దమమనఁగా, బహిరింద్రియ నిగ్రహము. ౩ ఉపరతి యనఁగా, సర్వసంగ పరిత్యాగము, లేక సన్న్యాసము, లేక కర్మఫల త్యాగము. ౪ తితీక్షయనఁగా, సుఖదుఃఖములయందు సమభావన. ౫ క్షమయనఁగా, ఓర్పు కలిగియుండుట. ౬ శ్రద్ధయనఁగా, ఆస్తికత.

4. ముముక్షుత్వము. అనఁగా, మోక్షేచ్ఛ.

ఈ నాలుగు గుణములు కలవాఁడే బ్రహ్మవిచారాధికారి యగును.

మఱియొక విధము.

1. నిత్యానిత్యవస్తువివేకము—ప్రపంచమందు గోచరించు సమస్త వస్తువులును అసత్యమనియును, పరబ్రహ్మ మొక్కటే సత్యమనియును తెలిసికొనుట.

2. ఇహాముత్రార్థఫలభోగవిరాగము— భూలోకమందలి భోగము లందును స్వర్గాదిభోగము లందును ఆశ లేకుండుట.

3. శమాదిషట్కసంపత్తి—శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము.

శమము— అంతఃకరణచతుష్టయమును స్వాధీనమం దుంచికొనుట. ఇదే అంత రింద్రియ నిగ్రహము.



దమము—దశేంద్రియములను ఇష్టానుసారముగా పోనీక యుంచుట. ఇది బహిరింద్రియ నిగ్రహము.

ఉపరతి—మనస్సును వృత్తులయందు పోనీయక యడ్డగించి ఆత్మతో నైక్యపఱుచుట.

తితీక్ష—సుఖాదుఃఖములందు సమబుద్ధి కలిగియుండుట.

శ్రద్ధ—గురువునందును ఈశ్వరునియందును భక్తి కలిగియుండుట.

సమాధానము—గురుముఖముగా తత్త్వ విషయముల నెఱుంగునపుడు స్వస్థచిత్తుఁడై, అనఁగా విషయములయందు ఇంద్రియములను మనస్సును పోనీయక చేయుట.

4. ముముక్షుత్వము—సంసార సాగరమునుండి తరింప వలయుననెడి చిత్తవృత్తి కలిగియుండుట.

ఈ చతుస్సాధనంబులు కలవాఁడే మోక్షాధికారి యగును. పరరాజ్య సిద్ధికై ప్రాజ్ఞుండగు రాజు, చతురంగ బలము కలిగియుండునట్లు, స్వారాజ్య సిద్ధికై సదసద్వివేకి, సాధనచతుష్టయమును కలిగియుండ వలయును.

అవ. స్వామీ! సాధనచతుష్టయమును తెలిసికొంటిని. అయినను విషయాభిలాష నశింపకున్న యది. దీనికి హేతు వెయ్యది యని యడిగిన శిష్యునికి ఆచార్యుం డిట్లనుచున్నాఁడు

మనోలక్షణము.

శ్లో. మనోహి ద్వివిధంప్రోక్తం శుద్ధంచాశుద్ధమేవచ,
అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్. ౧౦౩.

తా. మనస్సు శుద్ధమనియు, అశుద్ధమనియును రెండు విధములు. కామ సంకల్పము (విషయాభిలాష) అశుద్ధ మనస్సు. నిష్కామము (విషయరాహిత్యము) శుద్ధమనస్సు అని తెలియుము.

వి. మనస్సే బంధమోక్షము లొసంగుచున్నది. అశుద్ధ మనస్సు బంధమును, శుద్ధమనస్సు మోక్షమును నొసంగుచున్నది. కనుక విషయా

ఖిలాషల యందు ప్రవర్తింపక యుండుటకును మనస్సే కారణముగ నున్న దని భావము.

### బంధనివృత్త్యుపాయము.

శ్లో. ఉపాయఏకఏవాస్తి మనసస్స్వస్యనిగ్రహే,
మనసోఽభ్యుదయేనాశో మనోనాశోమహోదయః.

తా. మనస్సును వృత్తి రూపముగా పరిణమింపఁ జేసినయెడల బంధమును, లేక సంసారమును, మనస్సును నివృత్తి రూపముగా పరిణమింపఁ జేసినయెడల మోక్షమును లేక సంసారనాశమును కల్గును. ఇంతకంటె వేఱే యుపాయ మెదియును లేదు.

### బంధమోక్షములు.

శ్లో. ద్వేపదేబంధమోక్షాయ మమేతి నమమేతిచ,
మమేతిబధ్యతేజంతు ర్నిర్మమేతి విముచ్యతే. ౧౦౫.

వి. బంధ మోక్షము లనునవి రెండే మాటలు. 'నాది' యనుట బంధము కొఱకగుచున్నది. 'నాది కాదు' అనుట మోక్షము కొఱకగుచున్నది.

వి. అనఁగా బంధముచే కట్టువడిన వాఁడు, మోక్షమొందఁడని భావము.

అ. దానినే మఱొక విధముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో. ఆత్మాకారితయావృత్తిః మోక్ష ఇత్యభిధీయతే,
విషయాకారితావృత్తిః బంధ ఇత్యభిధీయతే. ౧౦౬.

తా. ప్రపంచమందు గల సకల భూతములయందును పరమాత్మ ప్రకాశించుచున్నాఁ డనెడి మనోవృత్తి మోక్షమని చెప్పఁబడుచున్నది. అట్లుగాక విషయాదులయందు ప్రవేశించిన మనోవృత్తి బంధమని చెప్పఁబడుచున్నది.

అవ. బంధ మోక్షములకు, మనస్సే కారణమని నిరూపించు చున్నాఁడు.

### బంధమోక్షకారణము.

శ్లో. మనఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః,
బంధాయవిషయాసక్తం ముక్త్యైనిర్విషయంమనః.

తా. మనుష్యులయొక్క బంధమోక్షములకు మనస్సే కారణము. విషయాదులం దాశకలుగుట బంధము. విషయాదులం దాశ లేకపోవుట మోక్షము, అనఁబడును.

వి. ఈ విషయమును భగవద్గీత, త్రిపురతాపిన్యుపనిషత్, శాట్యాయనీయోపనిషత్, మొదలగు వానియందును గనందగును.

శ్లో. సంకల్పాద్వర్ధతేచిత్తం తదేవాశు పరిత్యజ,
దృశ్యమాత్రాయసీదంచే త్తస్మాచ్చిత్తోసిబాంధవాక్.
దృశ్యం సంత్యజ సీదంచే త్తదాచిత్తోసి మోక్షవాక్.

తా. మనస్సుయొక్క సంకల్పము చేత (కోరికలు) వృద్ధినొందు చున్నది. కనుక అమనోసంకల్పమును శీఘ్రముగా నివర్తిచేయుము. కనఁబడునట్టి యీప్రపంచమునందు కోరికలుగలవాఁడ వైతివేని అందువలన మనస్సుతోఁగూడిన వాఁడవై, బంధము నొందుదువు. కనఁబడునట్టి, యీ ప్రపంచమును నిగ్రహించితివేని అందువలన మోక్షమును బొందుదువు.

అవ. ప్రపంచమును నిగ్రహించుటెట్లు ? కనఁబడుచుండు దానిని లేకుండునట్లు భావింప నగునా ? యని యడిగిన శిష్యునకాచార్యుం డిట్లని చెప్పుచున్నాఁడు.

### మనఃకల్పితము ప్రపంచము

శ్లో. ఇదంప్రపంచంనాస్త్యేవ నోత్పన్నంనోస్థితంక్వచిత్
చిత్తంప్రపంచమిత్యాహు ర్నాస్తినాస్త్యేవసర్వదా.

తా. ఈ కనఁబడు ప్రపంచము లేనే లేదు. కలిగియు నుండలేదు. కొంచెమైన నుండునట్టిది కాదు. చిత్తమే (మనస్సే) ప్రపంచమని చెప్పెదరు. ఎప్పుడును ప్రపంచ ముండునది కానే కాదు.

అవ. మనస్సే సర్వమునని అనువదించుచున్నాఁడు.

సర్వం మనోమయము.

శ్లో. మనఏవ జగత్సర్వం మనఏవ సదారిపుః. ౧౧౦.
మనఏవ హి సంసారో మనఏవ జగత్త్రియమ్

తా. ఈ సకలప్రపంచమును మనస్సే. మనస్సెప్పుడును శత్రువుగా నున్నది. సంసారమును మనస్సే. త్రిలోకములును మనస్సే.

ప్రపంచము బ్రహ్మమయము.

శ్లో. కల్పనాన్యాజగన్నామ్ని నాసీ దస్తి భవిష్యతి. ౧౧౧.
బ్రహ్మణో జగతోభేదో మనాగపి నవిద్యతే,
ఇతి భావయ యత్నేన హ్యాన్య త్సర్వం పరిత్యజ.౧౧౨.

తా. జగత్ అను నామము కల్పనయేగాని వేఱు కాదు. అది ముందును లేదు. ఇప్పు డుండునదియును కాదు. బ్రహ్మమునకును జగత్తునకును కొంచెమైనను భేదము లేదు. ఇట్లు ప్రయత్నముచేత భావింపుము.

వి. అనఁగా సమస్తచేతనాచేతనములును బ్రహ్మమేయని భావింపుమని యర్థము.

అవ. ఈకనఁబడు ప్రపంచము సచ్చిదానంద స్వరూపమని చెప్పుచున్నాఁడు.

ప్రపంచము సద్రూపము.

శ్లో. అస్తిచేదస్తితారూపం బ్రహ్మైవాస్తి త్వలక్షణమ్,
అస్తీత్యుక్తేజగత్సర్వం సద్రూపంబ్రహ్మతద్భవేత్. ౧౧౩.

తా. ఉన్నది యనెడి వస్తువు ఉండునెడల, అట్లున్నదనెడి లక్షణముగలది బ్రహ్మమే. జగత్తు ఉన్నదియనఁగా, అట్లుండు జగత్తు మొదలగునవి యన్నియును సద్రూపమైన బ్రహ్మమే యగును.

వి. సమస్తమును బ్రహ్మమేయని భావము.

అవ. ఈజగత్తు బ్రహ్మముగా కనఁబడక, జగముగనే కనఁబడుచున్నది యని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లనుచున్నాఁడు.

## ప్రపంచము చిద్రూపము.

శ్లో. భాతీయుక్తేజగత్సర్వం భానం బ్రహ్మైవకేవలమ్,
మరుభూమౌజలంసర్వం మరుభూమాత్రమేవతత్. ౧౧౪.
జగత్త్రియమిదంసర్వం చిన్మాత్రం స్వవిచారతః.

తా. జగము కనఁబడుచున్నది కదా యనఁగా, అట్లు కనఁబడునదియును బ్రహ్మమే. మరుభూమియందు తోఁచునట్టి జలమంతయు (విచారించినయెడల) మరు భూమిగనేయున్నట్లు (జలము కానట్లు) తనయొక్క స్వరూప విచారమువలన త్రిలోకములును చిత్స్వరూపముగనే యున్నది.

వి. అనఁగా బ్రహ్మమే ప్రపంచముగాఁ గనఁబడుచున్నదని భావము.

## ప్రపంచము ఆనందరూపము.

శ్లో. దృశ్యతేశ్రూయతేయద్య ద్బ్రహ్మణోన్యన్నతద్భవేత్.
నిత్యశుద్ధవిముక్తైక మఖండానందమద్వయమ్.

తా. ఏదేది కనఁబడుచున్నదో, ఏదేది వినఁబడుచున్నదో, అది యంతయు బ్రహ్మము తప్ప వేఱు కాదు. ఆ బ్రహ్మము నిత్యమై శుద్ధమై బంధరహితమై ఏకమై అఖండానందమై రెండవదిలేనిదై యున్నది.

అవ. ఆచార్యుఁడు, సచ్చిదానంద స్వరూపమైన ప్రపంచము బ్రహ్మాభిన్నముగాఁ దోఁచకుండుటకు కారణమును చెప్పుచున్నాఁడు.

## మాయా నిరూపణము.

శ్లో.ఏకస్సన్ విద్యతేభ్రాంత్యా మాయయా న స్వరూపతః.౧౧౭.

తా. ఒక్కటిగనే యుండు ఆత్మ (బ్రహ్మము) మాయయనెడి భ్రాంతిచేత భేదింపఁబడుచున్నది. స్వరూపమునందు భేదము లేదు.

వి. మాయయే బ్రహ్మమును మఱఁగించుచున్నదని భావము.

## మాయా ప్రభావము.

శ్లో. ద్వైతాఽద్వైతసముద్భూతై ర్జగన్నిర్మాణలీలయా,
పరమాత్మమయీశక్తి రద్వైతైవ విసృజ్యతే. ౧౧౮.

తా. పరమాత్మ స్వరూపిగానుండు శక్తియైనది ఒక్కటిగనే యుండి, జగమును సృష్టిచేసెడు లీలచేత ఒక్కటిగను అనేకములుగను నుండు జగములుగా వృద్ధి నొందుచున్నది.

## మాయా లక్షణము.

శ్లో.విష్ణుశక్తిసముద్భూత మేతత్సర్వం చరాచరమ్,
యస్మాభిన్నమిదంసర్వం యచ్చేదంయచ్చ నేంగతమ్,
ఉపాధిభిర్యథాకాశో భిన్నత్వేన ప్రతిష్యతే,
అవిద్యోపాధిభేదేన తథేద మఖిలంజగత్. ౧౧౯.
యదా హరి ర్జగచ్ఛక్తి తస్యశక్తిస్తథాభవేత్,
దాహశక్తిర్యథాంగారో స్వాశ్రయంవ్యాప్యతిష్ఠతి. ౧౨౦.

తా. చరాచరము లణఁగిన యీ సకలప్రపంచమును విష్ణువుయొక్క శక్తివలనఁ గల్గినదిగానున్నది. ఎది స్థిరముగానున్నదో, ఎది అస్థిరముగానున్నదో, అట్టి సకలప్రపంచమును విష్ణువునకు వేఱుగా లేదు. ఆకాశము (ఘట మఠ)ఉపాధులచే నెట్లు వేఱుగాఁ గనఁబడుచున్నదో, అట్లు ఈసకల జగత్తును అవిద్యోపాధిచేత భేదముగాఁ గనఁబడుచున్నది. హరి, ఈశ్వరా

రముగ సకల జగత్తునందును వ్యాపించియున్నాఁడో, ఆప్రకారముగ అతని యొక్క శక్తి (విష్ణుమాయ) వ్యాపించి యున్నది. ఉష్ణశక్తి తనకు వాసస్థానమైన అగ్నియందెట్లు వ్యాపించియున్నదో, అట్లు విష్ణుశక్తియు తనకు వాసస్థానమైన పరమాత్మయందె వ్యాపించియున్నది.

## మాయా నామములు.

శ్లో. ఉమేతికేచిదాహుస్తాం శక్తిం లక్ష్మీతిచాపరే,
భారతీత్యపరేచైనాం గిరిజేత్యంబికేతిచ. ౧-౨౧.
దుర్గేతిభద్రకాళీతి చండీ మాహేశ్వరీతిచ,
కౌమారీ వైష్ణవీచేతి వారాహ్యైంద్రీతిచాపరే. ౧-౨౨.
బ్రాహ్మీతి విద్యాఽవిద్యేతి మాయేతిచ తథాపరే,
ప్రకృతిశ్చ పరాచేతి వదంతి పరమర్షయః. ౧-౨౩.
సేయంశక్తిఃపరావిష్ణో ర్జగత్సర్గాదికారిణీ,
వ్యక్తావ్యక్తస్వరూపేణ జగద్వ్యాప్యవ్యవస్థితా. ౧-౨౪.
ప్రకృతిశ్చపుమాంశ్చైవ కాలశ్చేతి త్రిధా స్థితా,
సృష్టిస్థితివినాశానా మేకాకారణతాంగతా. ౧-౨౫.

తా. ఆ విష్ణుశక్తిని ఉమ, లక్ష్మి, భారతి, గిరిజ, అంబిక, దుర్గ, భద్రకాళి, చండి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఐంద్రి, బ్రాహ్మి, విద్య, అవిద్య, మాయ, ప్రకృతి, అనిచెప్పెదరు. పరమఋషులు పరాయనెదరు. ఇట్టి పేర్లు కల ఆశక్తియే జగత్సృష్టి స్థితి లయకార్యములు చేయునదిగను, కనఁబడునదిగను, కనఁబడనిదిగను నగురూపముతో జగత్తును వ్యాపించికొని యున్నది. ఇదే విష్ణువుయొక్క పరాశక్తి. అది ప్రకృతి యనియును, పురుషుఁడనియును, కాలమనియును, మూఁడు విధములుగానున్నది. అదియే సృష్టికిని, స్థితికిని, నాశమునకును కారణముగ నున్నది.



వి. పైనజెప్పిన మాయానామములకు కారణమేమనఁగా, బ్రహ్మయే జగత్కర్తయను మతస్థులకు బ్రాహ్మీశక్తియనియును, మహేశ్వరుఁడే జగత్కర్తయను మతస్థులకు మాహేశ్వరియే శక్తియనియును, ఇట్లుగా తత్తన్మతీయులకు బోధమగుట కొఱకు చెప్పఁబడెనని గ్రహించునది. ఈ మాయయే ప్రకృతియై సృష్టిని, పురుషుఁడై రక్షణమును, కాలమై నాశమును జేయుచున్నది.

అవ. ఇపుడు ఉపదేశించిన మాయానామముల వలన వస్తువునందు భేదంబు కలదని సామాన్యముగా స్ఫురించుటంబట్టి, యా భేదంబు నామమాత్రంబని వివరించుచున్నాఁడు.

పరమాత్మస్థితి.

శ్లో. ఏకఏవహిభూతాత్మా భూతేభూతే వ్యవస్థితః,
ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్.౧౨౮.

తా. భూతాత్మయైన యొకఁడే ఒక్కొక భూతమునందు నున్నాఁడు. జలమునందు చంద్రునివలె, ఒక్కఁడుగను అనేకములుగను కనఁబడుచున్నాఁడు.

వి. జలపూరితమైన వివిధ ఘటములలో ప్రతిఘటమునందును నొక్కొక చంద్రుఁడున్నట్లుగాఁ గన్పట్టినను, చంద్రుఁడుమాత్ర మొక్కండే యైనట్లు, భూతములు వివిధములైనను, ప్రతిభూతమునం బ్రకాశించు పరమాత్మ యొక్కఁడే యని భావము.

అవ. సర్వమును పరబ్రహ్మస్వరూపమని విశదీకరించుచున్నాఁడు.

సర్వం బ్రహ్మమయము.

శ్లో. ఏకమేవాఽద్వయంబ్రహ్మ నేహనా నాస్తికించన.

తా. రెండవదిలేని బ్రహ్మమొక్కటేయున్నది. ఇచ్చట వేఱేదియు కొంచెమైనను లేదు.



## మాయా చక్రము.

జగత్.

ఈశ్వరుఁడు.

జీవుఁడు.

విక్షేపము.

శుద్ధమాయ.

ఆవరణము.

పరబ్రహ్మము.
సచ్చిదానందరూపము

అనఁగా, పరబ్రహ్మమునందుండి కలిగిన విక్షేపమను మాయవలనజగత్తును, శుద్ధమాయవలన ఈశ్వరుఁడును, ఆవరణమనుమాయవలనజీవుఁడును కలిగియున్నది. కావుననే సర్వమును బ్రహ్మమయ మనిచెప్పఁబడెను.



మఱియు, సచ్చిదానంద స్వరూప పరబ్రహ్మమునుండి కలిగిన శుద్ధ సత్త్వమనెడి మాయవలన ఈశ్వరుఁడును, విశుద్ధసత్త్వ అవిద్యవలన జీవుఁడును, తమఃప్రధాన ప్రకృతివలన జగత్తును కలిగియున్నదనియు చెప్పనొప్పును. ఈ జీవేశ్వరజగముల కూటమి కలదానికి "బ్రహ్మప్రతిబింబసమన్వితప్రకృతి" యనిపేరు కలిగియున్నది.

ఇదియునుగాక, మాయ అనునది అసత్తు, జడము, దుఃఖము, అనిత్యము, ఖండిత, అను పంచలక్షణములతోఁగూడినది.

బ్రహ్మము అనునది సత్తు, చిత్తు, ఆనందము, నిత్యము, అఖండము, అను పంచలక్షణములతోఁ గూడినది.

అవ. స్వామీ! పరబ్రహ్మమునకంటె నన్యముగా నామరూపములతోఁ బ్రకాశించు దేవతాదులును, మఱియుఁ గనఁబడునట్టి భూతములును, దేనియొక్క స్వరూపములు? అని యడిగిన శిష్యునకు, సర్వమును నారాయణస్వరూపమని విశదీకరించుచున్నాఁడు.

సర్వాత్మకత్వము నారాయణస్వరూపము.

శ్లో. నారాయణపరాలోకా నారాయణపరాస్సురాః. ౧౨౭.
నారాయణపరంసత్యం నారాయణపరంపదమ్,
నారాయణపరాపృథ్వీ నారాయణపరంజలమ్. ౧౨౮.
నారాయణపరోవహ్ని ర్నారాయణపరంనభః,
నారాయణపరోవాయు ర్నారాయణపరంమనః. ౧౨౯.
అహంకారశ్చబుద్ధిశ్చ ఉభే నారాయణాత్మికే,
భూతంభవ్యంభవిష్యంచ యత్కించిజ్జీవసంజ్ఞికమ్. ౧౩౦
స్థూలంసూక్ష్మంపరంచైవ సర్వంనారాయణాత్మకమ్.

తా. సకలలోకములును, సకలదేవతలును, సత్యము, పరమపదము, భూమి, జలము, అగ్ని, ఆకాశము, వాయువు, మనస్సు, అహంకారము,

బుద్ధి, గతకాలము, వర్తమానకాలము, భవిష్యత్కాలము, అనునివియును; జీవుఁడును, స్థూలసూక్ష్మములును, ఉత్తమమును, అగు నివియన్నియును నారాయణ స్వరూపము.

వి. అనఁగా సర్వమును నారాయణస్వరూపమనియును, నారాయణుఁడే పరమాత్మ, లేక పరబ్రహ్మమనియును భావము.

అవ. నారాయణుఁడే పరమాత్మయని అనువదించుచున్నాఁడు.

శ్లో. ఆత్మానారాయణశ్చైవ నభిన్నస్తిలతైలవత్,, ౧౩౧.
తద్దైవ శౌక్ల్యపటవత్ కుసుమామోదవత్తదా,
యోహివిష్ణుస్సఏవాత్మా యోహ్యాత్మాసౌజనార్దనః ౧౩౨.
విష్ణ్వాత్మశబ్దాపర్యాయా యథా విటపిపాదపౌ.

తా. నువ్వులును నూనెయునువలెను, తెల్లని వస్త్రమునందలి తెలుపును వస్త్రమునువలెను, పుష్పమును వాసనయునువలెను, ఆత్మయును నారాయణుఁడును భేదము కలవారు కారు. ఆప్రకారముగ విష్ణువే ఆత్మ. ఆత్మయే జనార్దనుఁడు. విటపి యనుశబ్దమును పాదపమను శబ్దమును ఎట్లు వృక్షమునే సూచించునో, అట్లు విష్ణుశబ్దమును ఆత్మ శబ్దమును ఒకే వస్తువును సూచించును.

అవ. ఇచటఁ గొందఱికి నారాయణుఁడే ఆత్మయని చెప్పఁబడుట వలన, శివుఁ డాత్మ కాదా యను శంకకలుగును. తత్పరిహారముకొఱకు శివుఁడును ఆత్మయే యని యనువదించుచున్నాఁడు.

## సర్వం శివాత్మకము.

శ్లో. యతస్సర్వంసముత్పన్నం నిర్గుణాత్పరమాత్మనః.౧౩౩.
తదేవ శివ సంజ్ఞంహి వేదవేదాన్తినో విదుః.

తా. ఏ నిర్గుణమైన పరమాత్మయందుండి యీ సకలప్రపంచమును కలిగెనో, దానినే శివుఁడని వేద వేదాంతులు ఎఱింగెదరు.



అవ. సకల నామములును పరబ్రహ్మ నామములే యని చెప్పుచున్నాఁడు.

సర్వశబ్దవాచ్యుఁడు పరమాత్మ.

శ్లో. నారాయణశ్శివోవిష్ణు శ్శంకరః పురుషోత్తమః. ౧౩౪.
ఏతేషు నామభిర్బ్రహ్మ పరంప్రోక్తం సనాతనమ్.

తా. నారాయణుఁడు, శివుఁడు, విష్ణువు, శంకరుఁడు, పురుషోత్తముఁడు, అను నీ నామములయందు, ఏ నామముచేతను శాశ్వతపరబ్రహ్మమే చెప్పఁబడుచున్నది.

అవ. ఒక్క పరమాత్మ వస్తువే శివవిష్ణువులైరని చెప్పుచున్నాఁడు.

హరిహర స్వరూపము.

శ్లో. రుద్రోనారాయణశ్చైవ సత్త్వమేకంద్విధాకృతమ్ ౧౩౫.

తా. సత్త్వమైన ఒక్కవస్తువే రుద్రుఁడుగను నారాయణుఁడుగను చేయఁబడి యున్నది.

శ్లో. యథాశివ స్తథావిష్ణు ర్యథావిష్ణు స్తథాశివః,
అంతరం శివవిష్ణ్వోశ్చ మనాగపి నవిద్యతే. ౧౩౬.

తా. శివుఁడెట్లో అట్లు విష్ణువు. విష్ణువెట్లో అట్లు శివుఁడు. శివ విష్ణువులకు కొంచెమైనను భేదములేదు.

శ్లో. యోవిష్ణు స్స స్వయం రుద్రో యోరుద్ర స్స జనార్ధనః,
ఇతిమత్వా భజేద్దేవం సయాతి పరమాంగతిమ్. ౧౩౭.

తా. ఎవఁడు విష్ణువో అతఁడేరుద్రుఁడు. ఎవఁడురుద్రుఁడో అతఁడే జనార్ధనుఁడు. ఇట్లెఱింగి యాదేవుని భజించువాఁడు శ్రేష్ఠమైనపరమపదమును బొందుచున్నాఁడు.

అవ. ఒక్క పరమాత్మ వస్తువున్నుండియే త్రిమూర్తులు కల్గిరని బోధించు చున్నాఁడు.



## త్రిమూర్తి స్వరూపము.

శ్లో. ఏకమూర్తేస్త్రిధాజాతా బ్రహ్మావిష్ణుమహేశ్వరః.

తా. ఒక మూర్తియందుండి (పరమాత్మయందుండి) బ్రహ్మ విష్ణు రుద్రులను ముమ్మూర్తులు కలిగిరి.

## మూర్తిత్రయము నామమాత్రము.

శ్లో. యోవిష్ణుస్సస్వయంబ్రహ్మాయోబ్రహ్మాఽసౌ మహేశ్వరః.
వేదత్రయేచ యజ్ఞేస్మిన్ పండితేష్వేషు నిశ్చయః.

తా. ఎవఁడు విష్ణువో అతఁడు బ్రహ్మదేవుఁడు. ఎవఁడు బ్రహ్మదేవుఁడో వాఁడు రుద్రుఁడు. అని మూఁడువేదములచేతను, యజ్ఞవిధులచేతను, వేదాంతవేత్తలచేతను నిశ్చయింపఁబడి యున్నది.

వి. అనఁగా త్రిమూర్తులు నొకర్రే యని భావము.

అవ. స్వామీ! త్రిమూర్తులు నొకర్రేయనుట యెట్లని యడిగిన శిష్యున కాచార్యుం డిట్లని చెప్పుచున్నాఁడు.

## త్రిమూర్తి స్వరూప నిరూపణము

శ్లో ఉత్పన్నస్యజగద్యోని రగుణోపి రజోగుణమ్. ౧౩౯.
భుంజన్ ప్రవర్తతేసర్గే బ్రహ్మత్వం సముపాశ్రితః,
బ్రహ్మత్వే సప్రజాస్సృష్ట్వా తతస్సత్త్వాతిరేకవాన్.
విష్ణుత్వమేత్యధర్మేణ కురుతే పరిపాలనమ్.
తతస్తమోగుణోద్రిక్తో రుద్రత్వేచాఖిలంజగత్. ౧౪౦.
ఉపసంహృత్యవై శేతే త్రైలోక్యంత్రిగుణోఽగుణః ౧౪౧.

తా. జగత్కారణమైన పరమాత్మ గుణరహితుఁడైనను, రజోగుణమును స్వీకరించి బ్రహ్మస్థితిని బ్బొఁది సృష్టి చేయుచున్నాఁడు. తర్వాత సత్త్వగుణప్రధానుఁడై విష్ణుస్థితిని బొంది జగత్తును ధర్మముగా బరిపాలించు

చున్నాఁడు. ఆమీఁద తమోగుణ ప్రధానుఁడై రుద్రుఁడను నామమును బొంది ప్రపంచమునంతయు నశింపఁజేసి త్రిలోకములను స్వప్నమువలెఁ జేయుచున్నాఁడు. పరమాత్మ నిర్గుణుఁడైనను త్రిగుణములతోఁ గూడి యున్నాఁడు.

వి. త్రిలోకములను స్వప్నమువలె మిథ్యయనియును, పరమాత్మ యొకఁడే సత్యమనియును భావము. శివవిష్ణువులు పరమాత్మ స్వరూపు లనుటను గూర్చి తైత్తిరీయోపనిషత్, రుద్రహృదయోపనిషత్, మైత్రేయోపనిషత్, మొదలగు వానియందుఁ గనందగును.

అవ. ఆచార్యుండు శివ విష్ణ్వాదు లేకరూపమని గ్రహింపని వాని యొక్కయు, గ్రహించువాని యొక్కయు, స్థితిని చెప్పుచున్నాఁడు.

దేవతాభేదబుద్ధి దోషము.

శ్లో. హరిశంకరయోర్మధ్యే బ్రహ్మణశ్చాపి యోనరః. ౧౪౨.
భేదకృన్నరకంభుంక్తే యావ దాచంద్రతారకమ్,
హరంహరింవిధాతారం యఃపశ్యే దేకరూపిణమ్.౧౪౩.
సయాతి పరమానందం శాస్త్రాణామేష నిర్ణయః.

తా. విష్ణువునకును శివునకును బ్రహ్మకును భేదము కలదని తలంచువాఁడు చంద్రుఁడును నక్షత్రములు నుండునంతకాలము నరకము ననుభవించును. బ్రహ్మ విష్ణు రుద్రులను ఒక్కరూపమని తలంచువాఁడు బ్రహ్మానందమును పొందును. ఇదే సకలశాస్త్రములయొక్క నిశ్చయము.

అవ. దేవతాభేదము మొదలగునవి కించిద్జ్ఞుల కొఱకు చెప్పఁబడినదే గాని విజ్ఞులకొఱకు గాదనుటను గూర్చి యనువదించుచున్నాఁడు.

దేవతాస్థానము.

శ్లో. నకాష్ఠేవిద్యతేదేవో న పాషాణేనమృణ్మయే. ౧౪౪.
భావేతు విద్యతే దేవ స్తస్మాత్ భావేన భావ్యతే.

తా. దేవుఁడు కట్టెయందును, ఱాతియందును, మట్టియందును లేఁడు. భావమునందు (హృదయగుహయందు) తెలియవలయును. కాఁబట్టి మనస్సుచేతనే దేవుని భావింపవలయును.

శ్లో. తీర్థేదానేతపోయజ్ఞే కాష్ఠేపాషాణకే సదా. ౧౪౫.
శివంపశ్యంతిమూఢాత్మా శివోదేహేప్రతిష్ఠితః.

తా. తీర్థములయందును, దానములయందును, తపస్సునందును, యజ్ఞమునందును, కట్టెయందును, శిలయందును, మూఢులు శివుని వెదకెదరు. శివుఁడు (పరమాత్మ) తన దేహమునందే యున్నాఁడు.

వి. తీర్థములనఁగా గంగా యమునాది తీర్థములు. వీనియందు స్నానముచేసి నంతనే పరమాత్మ దర్శనము కలుగదు. దానములనఁగా కృఛ్రచాంద్రాయణాది వ్రతములు. వీనివలనను పరమవస్తువు గోచరింపదు. పంచాగ్నిమధ్యమునందుండి తపస్సు చేయుటచేతను, యజ్ఞ యాగములు చేయుటచేతను, దారుమయమైనట్టియు శిలామయమైనట్టియు విగ్రహములను దర్శించుట మొదలగువానిచేతను పరబ్రహ్మము కనఁబడదు. భగవంతుఁడు ఆత్మస్వరూపియై శరీరమునం దున్నాఁడనుట నెఱుంగక, కేవలము బాహ్య వ్యాపారాదులచే నెఱుంగ నగునని పామరులు తలంచెదరు. "శ్లో. పాషాణలోహమణి మృణ్మయ విగ్రహేషు పూజా పునర్జనన భోగకరీ ముముక్షోః, తస్మాద్యతిస్స్వహృదయార్చనమేవ కుర్యా ద్బాహ్యార్చనం పరిహారేదపునర్భవాయ. అనఁగా, మోక్షేచ్ఛకలవానికి పాషాణము (ఱాయి) లోహము, మణి, మృత్తిక, ఈ రూపమైన విగ్రహములయందు చేయు పూజ యైనది పునర్జన్మమును, భోగమును (ప్రారబ్ధమును) నొసంగునది. కనుక యతియైనవాఁడు పునర్జన్మమును బడయకుండుటకొఱకు తనయొక్క హృదయార్చనమునే చేయవలసినది. బాహ్యార్చనమును నిగ్రహింపవలసినది" అని మైత్రేయోపనిషత్తునందు చెప్పఁబడియున్నది. ఇచ్చట యతిశబ్దము జ్ఞానికి నొప్పునని తెలియునది. "శ్లో. సంత్యజ్యహృద్గుహేశానం దేవ మన్యంప్రయాంతియే, తే రత్నమభివాంఛంతి త్యక్తహస్తస్థకౌస్తుభాః.

అనఁగా, ఎవరు హృదయగుహయందుండు స్వప్రకాశమైన భగవంతుని విడిచిపెట్టి యితరమైనదానిని దేవునిగా భావించెదరో, వారు చేతియందున్న దివ్యరత్నమును విడిచిపెట్టి యితరమైన రత్నమును గోరువారితో సమాను లని భావము" ఇట్లు మహోపనిషత్తునందు చెప్పఁబడియున్నది. ఈవిషయము భాగవతము తృతీయస్కంధము ౨౯-వ అధ్యాయమునందు భగవంతుఁడేయిట్లని చెప్పుచున్నాఁడు—"నన్ను సకలభూతములయందుండు నన్నెఱుంగక విగ్రహములయందున్నాఁడని పూజించెదరు. అట్టి మూఢులు బూడిదెయందు హోమముచేయువారితోఁ దుల్యులు". మఱియు భాగవతము ఏకాదశస్కంధము ౨-వ అధ్యాయమునందు—"విగ్రహమునందు హరిని పూజించువాఁడు ప్రాకృతుఁడు. వాఁడు, భక్తుఁడు కాఁడు." అనియును జెప్పఁబడియున్నది. ఇదియునుగాక, ముండకోపనిషత్ ౧-౨; సుబాలోపనిషత్ ౯; వీనియందు—"యజ్ఞములు, దానములు, వేదాంత శ్రవణమననాదులు, తపస్సు, సన్న్యాసము, ఈమొదలగువానిచేత పరమాత్మ యెఱుంగఁబడఁడు." అనియును చెప్పఁబడియున్నది.

అవ. స్వామీ! ఆ పరమాత్మను ఎట్లు తెలిసికొనవచ్చునని యడిగిన శిష్యునికి, ఆచార్యుండు—శిష్యుఁడా! పరమాత్మ సర్వత్ర వ్యాపించి యున్నాఁడని మున్ను చెప్పఁబడెను కదా? కనుక నీయందును ఉన్నాఁడని తెలిసికొనుము. ఇతరములయందు వెదక వలసినది లేదని చెప్పుచున్నాఁడు.

## పరమాత్మస్థానము.

శ్లో. అశరీరం శరీరేషు అనవస్థేష్వవస్థితమ్. ౧౪౬.
మహాంతంవిభుమాత్మానం మత్వాధీరోనశోచతి.

తా. నిలుకడలేని దేహములయందు దేహములేక యుండు వాఁడుగను, మహాపురుషుఁడుగను, సర్వవ్యాపిగను (విభువుగను) నుండు ఆత్మను తెలిసికొని ధీరుఁడైనవాఁడు దుఃఖముపొందుట లేదు. అనఁగా ఆనందముగ నున్నాఁడని భావము.

౮. ఆత్మజ్ఞానిని వేదాంత వేత్తలు ధీరుఁడనియును, శూరుఁడనియును జెప్పుదురు. ధీరుఁడు ప్రజ్ఞకలవాఁడు. శూరుఁడు అరి షడ్వర్గములాదిగాఁగల అంత శ్శత్రువులను, లేక ఇంద్రియములాదిగాఁగల బహిశ్శత్రువులను నిగ్రహించినవాఁడు. దీనికిం బ్రమాణము:—"శ్లో. బలేనపర రాష్ట్రాణి గృహ్ణన్ శూరస్తు నోచ్యతే, జితోయే నేంద్రియ గ్రామః సశూరః కథ్యతేబుధైః. అనఁగా బలముచేత (సైన్యముచేత) పరదేశములను స్వాధీనము చేసికొనినవాఁడు శూరుఁడుకాఁడు, ఎవనిచే ఇంద్రియ సమూహము జయింపఁబడునో వాఁడే శూరుఁడు అని పెద్దలచేతఁ జెప్పఁబడుచున్నాఁడు."

౯. మఱియు, ఆత్మజ్ఞానము శాస్త్రములచే నెఱుంగఁబడవనియును, అనుభవముచేతనే యెఱుంగబడుననియును చెప్పుచున్నాఁడు.

## మందాధికారి లక్షణము.

శ్లో. ఇదంజ్ఞానమిదంజ్ఞేయం తత్సర్వంజ్ఞాతుమిచ్ఛతి. ౧౪౭.
అపివర్షసహస్రాయు శ్శాస్త్రాంతం నాధిగచ్ఛతి.

తా. ఇది జ్ఞానమనియును, ఇది జ్ఞేయమనియును (తెలియఁదగిన వస్తువనియును) ఏదికలదో దానినంతయును శాస్త్రములచేఁ దెలిసికొన నిచ్ఛయించువాఁడు, వేయేండ్లు జీవించినవాఁడై సకల శాస్త్రములను జదివినను దానియొక్క అంతము నెఱుంగఁడు.

## మందాధికారి కృత్యము.

శ్లో. విహాయశాస్త్రజాలాని యస్సత్యం తదుపాస్యతామ్.
అనంతకర్మశౌచంచ జపో యజ్ఞస్తథైవచ.
తీర్థయాత్రాభిగమనం యావత్తత్త్వంనవిందతి.౧౪౮.

తా. శాస్త్రసమూహములను త్రోసివేసి సత్యమై యుండునట్టిదానిని (ఆత్మస్వరూపమును) ఉపాసింపఁ దగినది, ఎంతవఱకు ఆత్మతత్త్వ

మెఱుంగఁబడదో అంతవఱకును అనేకకర్మములను, మనశ్శుద్ధిని, దేహశు ద్ధిని, జపమును, యజ్ఞమును, తీర్థయాత్రలను చేయవలయును.

అవ. పైనచెప్పిన వానిచేతనే మోక్షము కలుగదని నిరూపించు చున్నాఁడు.

మనోజయ ప్రయోజనము.

శ్లో. నధనాన్యుపకుర్వన్తి నమిత్రాణి నబాంధవాః,
నకాయక్లేశవైధుర్యం నతీర్థాయతనాశ్రయః. ౧౫౦.
కేవలంతన్మనోమాత్ర జయోనాఽసాద్యతేపదమ్.

తా. ధనము, మిత్రులు, పుత్త్రాదిబంధువులు, శుష్కోపవాసములు, తీర్థములు, దేవాలయములు, అగు వీనిని ఆశ్రయించుటవలన మోక్షము కలుగదు. ఆ పరమాత్మపదమైన మోక్షము కేవలమనోజయముచేతనే పొందఁదగినది.

అవ. స్వామీ! మనోజయం బెట్లుకలుగు ననియడిగిన శిష్యున కాచార్యుం డిట్లని చెప్పుచున్నాఁడు.

మనోజయ క్రమము.

శ్లో. హస్తంహస్తేనసంపీడ్య దంతైర్దంతాన్విచూర్ణయన్.
అంగాన్యంగైస్సమాక్రమ్య జయేదాదౌ స్వకంమనః.

తా. కర్మకాండమును జ్ఞానకాండముచేత బాగుగా పీడించిపట్టి, సంకల్ప వికల్పములనెడి దంతములను జ్ఞానదంతములచేత పొడిచేసి, క్రియాంగములను జ్ఞానాంగములచేత నాక్రమించి, ముందుగా తన మనస్సును జయింప వలయును.

వి. ఈ చెప్పినవియు, బాహ్యసాధనమని యెఱుంగ వలయును.

అవ. మఱియును, దానినే అనువదించుచున్నాఁడు.

## మనోఽభ్యాసప్రయోజనము.

శ్లో. ఉపవిశ్యోపవిశ్యైకం చింతకేన ముహుర్ముహుః.
నశక్యతేమనోజేతుం వినా యుక్తి మనిందితామ్,
అంకుశేనవినామత్తో యథా దుష్టమతంగజః ౧౫౩.

తా. ఆసనశుద్ధిగాఁ గూర్చుండి అభ్యాసముచేత ఏకమైన మనస్సును జయించుటకొఱకు మాటిమాటికి (నిరంతరమును) ప్రయత్నము చేయవలయును. ఎట్లన, మదించిన క్రూరమైన యేనుఁగును జయించుటకు అంకుశము లేక యెట్లు వశము కాదో, అట్లు నిర్దుష్టమైన (జ్ఞానసంబంధమైన) యుక్తిలేక సాధ్యము కాదు.

వి. యుక్తిచేత మనోజయము కలుగునని భావము. ఆసనశుద్ధి మొదలగు వానిని "హఠయోగప్రదీపిక" యందుఁ గనందగును.

అవ. మనోజయముయొక్క నిర్దుష్టమైన యుక్తుల ననువదించుచున్నాఁడు.

## మనోజయోపాయము.

శ్లో. అధ్యాత్మవిద్యాధిగమ స్సాధుసంగతి రేవచ,
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పందనిరోధనమ్. ౧౫౪.
ఏతస్తాయుక్తయఃపుష్టా స్సంతి చిత్తజయేక్రమాత్.

తా. బ్రహ్మవిద్యాభ్యాసము, సాధుసంగము, వాసనాపరిత్యాగము, ప్రాణస్పందనిరోధము, (అను నీ నాలుగుసాధనములు) అను నీ ఉపాయములు (యుక్తులు) మనోజయమందు తగినవై క్రమముగా నున్నవి.

వి. 1 బ్రహ్మ విద్యాభ్యాసము - అనఁగా శాస్త్రములను జదువుట. 2 సాధుసంగము - అనఁగా సద్గురువు నాశ్రయించుట. 3 వాసనపరిత్యాగము - అనఁగా మలినవాసనలను విడిచిపెట్టుట. 4 ప్రాణస్పందనిరోధము - అనఁగా వాయువుయొక్క చలనమును అడ్డగించుట. వాయుచలన నిరో

ధము ప్రాణాయామముచేఁ గల్గును. అనఁగా యోగమును అభ్యసింప వలయునని యిందువలన సూచింపఁబడియె.

అవ. ఆచార్యుఁడు, శిష్యునింజూచి మనోజయమునకు మనస్సే సాధనమని చెప్పుచున్నాఁడు.

## మనోజయసాధనము.

శ్లో. మనస్సైవమనశ్ఛిత్వా పాశం పరమబంధనమ్. ౧౫౫.
భవా దుత్తారయాత్మానం నాసావన్యేన తార్యతే.

తా. మనస్సుచేతనే మిక్కిలి బంధనము (సంకిలి) గానుండు కర్మపాశములతోఁగూడిన మనస్సును ఛేదించి, నిన్ను జననమరణ రూపసంసారము నుండి దాఁటింపుము. ఈ ఆత్మ, తనకంటె అన్యునిచేత తరింపఁజేయ బడదు.

వి. తనయొక్క వివేకముచేతనే ముక్తుఁడు కావలయుననిభావము. భగవద్గీతయందును "ఉద్ధరేదాత్మనాత్మానం" అను నీ మొదలగు వాక్యములచేత నీవిషయమునే ప్రస్తావింపఁ బడియున్నది.

అవ. వివేకియొక్క మనస్సు ఉత్తమ మైనదని నిరూపించుచున్నాఁడు.

## వివేకి మనోలక్షణము.

శ్లో. లాలనాత్ స్నిగ్ధలలనా పాలనా త్పాలకః పితా. ౧౫౬.
సుహృ దుత్తమవిన్యాసాత్ మనీషిణమనోవిదుః.

తా. జ్ఞానియొక్క మనస్సు లాలనము చేయుటవలన ప్రేమగల భార్యగను, పరిపాలించుటవలన పోషించునట్టి తండ్రిగను, శ్రేష్ఠమైన వాని నిచ్చుటవలన మిత్రునిగను (యోగులు) తెలియుదురు.

వి. మనస్సు శాంతించునేని ధర్మపత్నివలె నగును. మనస్సు ఆత్మ సంరక్షణార్థమై ప్రవర్తించునేని తండ్రియగును. మనస్సు ఉత్తమ పదము నొసంగునేని సుహృత్తగును.

శ్లో. భృత్యోఽభిమత కర్తృత్వా న్మంత్రీసర్వార్థకారణాత్
సామంతశ్చేంద్రియాఽక్రాంతే ర్విజ్ఞానీచ మనోవిదుః.

తా. వివేకియొక్క మనస్సు ఇష్టమైన కార్యములను జేయుట వలన సేవకుని వంటిదిగను, సకల ప్రయోజనములకు హేతు వగుటవలన మంత్రినిగను, ఇంద్రియములను స్వాధీనము చేసికొనుటవలన మండలాధీశ్వరునిగను (యోగులు) తెలియుదురు.

వి. వివేకులకు, వారియొక్క మనస్సు స్వాధీనమై యుండుటవలన, అభిమత కార్యములయందే ప్రవర్తించుననియును, అందుచేత మనస్సు పొగడఁబడెననియును భావము.

అవ. మనోజయమువలని ఫలమును నిరూపించుచున్నాఁడు.

మనోజయ ప్రయోజనము.

శ్లో. చిత్తస్యవిజితంతేన హంతీ కర్మశుభాశుభమ్. ౧౫౮.
ప్రసన్నాత్మాత్మని స్థిత్వా సుఖమవ్యయమశ్నుతే.

తా. మనోజయముచేత శుభాశుభ కర్మలను నశింపఁ జేయుచున్నాఁడు. ప్రసన్నమైన (స్వాధీనమైన, లేక వశమైన) చిత్తము కలవాఁడు, స్వస్వరూపమునందే (ఆత్మయందే) వసించి, శాశ్వతమైన మోక్షమును బొందుచున్నాఁడు.

అవ. స్వామీ! మనోజయము సులభసాధ్యం బగునట్లు బోధింపవలయునని యడిగిన శిష్యునింజూచి, శిష్యుఁడా! ప్రపంచమునందలి సకల పదార్థములను పరమాత్మగా భావింపుము. ఇట్టి భావనయే మనోజయం బనంబడు నని చెప్పుచున్నాఁడు.

సర్వాత్మకత్వ నిరూపణము.

శ్లో. ఏకస్సమస్తంయదిహాస్తికించిత్
తదచ్యుతోనాస్తిపరంతతోఽన్యత్,

సోహంసచత్వంసచసర్వమేతత్
ఆత్మస్వరూపం త్యజ భేదవిభ్రమమ్. ౧౫౯.

తా. ఈ ప్రపంచమునం దేదేదియున్నదో అవి యంతయును ఏకరూపియైన పరబ్రహ్మమే. వానికంటె అన్య మేదియును లేదు. వాఁడును నీవును అతఁడే. అతఁడును అతఁడే. ఈ సకల ప్రపంచమును ఆత్మస్వరూపమే. భేదమనెడి విభ్రమమును (మోహమును) విడువుము.

వి. ఇచట అచ్యుతుఁడు, అనఁగా నాశములేని పరబ్రహ్మము. అతఁడే సర్వము ననుటచేత ప్రపంచమునందు అపరమాత్మకంటె అన్యమైన దేదియు లేదనియును, పరమాత్మకంటె అన్యముగాఁ దోఁచుట భేదమాత్రమనియును, అట్టిభేదము మోహమాత్రముచేఁ గల్గినదనియును భావము.

అవ. గురువు, శిష్య బోధార్థమై భ్రమలక్షణమును జెప్పి, దానిని నివృత్తిచేయమనుచున్నాఁడు.

పంచభ్రమనిరూపణము.

శ్లో. భ్రమఃపంచవిధోభాతి తదేవేహ సముచ్యతే,
జీవేశ్వరాభిన్నరూపా వితిప్రాథమికోభవేత్. ౧౬౦.
ఆత్మనిష్ఠంకర్తృగుణం వాస్తవంవాద్వితీయకః,
శరీరత్రయసంయుక్తా జీవస్సంగీతృతీయకః. ౧౬౧.
జగత్కారణరూపస్య వికారిత్వం చతుర్థకః,
కారణాద్భిన్నజగత స్సత్యత్వంపంచమోభ్రమః. ౧౬౨.

తా. భ్రమయనునది యైదువిధములుగా ప్రకాశించుచున్నది. దాని నిచ్చట చెప్పఁబడుచున్నది. జీవస్వరూపము వేఱనియు, ఈశ్వర (పరమాత్మ) స్వరూపము వేఱనియు తలంచుట మొదటిభ్రమ. కర్తృత్వగుణము వాస్తవముగా ఆత్మయందున్నది యనునది రెండవభ్రమ. స్థూలసూక్ష్మ కారణ శరీరములతోఁ గూడియుండు జీవుఁడు ఆ శరీరములతోఁజేరి యు

న్నాఁడనుట మూఁడవభ్రమ. జగత్కారణ స్వరూపునకు (పరమాత్మకు) వికారిత్వము కలదనునది నాలుగవభ్రమ. కారణముకంటెను జగత్తు వేఱ నియును, జగత్తు సత్యమనియును భావించుట అయిదవభ్రమ.

## భ్రమ నివృత్తి.

శ్లో. సమస్తంఖల్విదంబ్రహ్మ సర్వమాత్మేదమాతతమ్,
అహమన్యమిదంచాన్య దితి భ్రాంతింపరిత్యజ. ౧౬౩.

తా. ఈ సకల ప్రపంచమును బ్రహ్మమే. నేను వేఱు, ఈ ప్రపంచము వేఱు, అనెడి భ్రమను నివృత్తి చేయుము.

అవ. ఆచార్యుఁడు, సర్వం బ్రహ్మమని యనువదించుచున్నాఁడు.

శ్లో. బ్రహ్మసర్వమిదంవిశ్వం విశ్వాతీతంచ తత్పదమ్,
వస్తుతస్తుజగన్నాస్తి సర్వం బ్రహ్మైవ కేవలమ్.౧౬౪.

తా. ఈ సకలప్రపంచమును బ్రహ్మమే. ఆ బ్రహ్మపదమే ప్రపంచము నందు శ్రేష్ఠమైనది. వాస్తవమునందు జగత్తులేదు. సర్వమును బ్రహ్మమాత్రముగ నున్నది.

ఓం తత్సత్.

---

రాజయోగరత్నాకరమునందు
ద్వితీయప్రకరణము సాధన ప్రకరణము
సంపూర్ణము.



ఓమ్
పరమాత్మనేనమః.

# రాజయోగరత్నాకరము.

తాత్పర్యసహితము.

## ప్రబోధ ప్రకరణము.

శ్లో. చతుర్ముఖోయస్సృజతేసమగ్రం
రథాఙ్గపాణిః పరిపాలనాయ,
క్షయాయకాలానలసన్నిభోయ
స్తంయజ్ఞమూర్తింప్రణతోఽస్మినిత్యమ్.

అవతారిక.

ఆచార్యుండు సాధనప్రకరణంబునందజ్ఞానాజ్ఞానోత్కర్షంబును, ప్రపంచ స్థితియును, మాయాలక్షణమును, పరమాత్మస్వరూప నిరూపణ మును, మనోలక్షణంబును, పరమాత్మ సత్యత్వంబును, ప్రపంచ మిథ్యా త్వంబు నుపదేశింపఁగావిని, శిష్యుండు—స్వామీ!తద్విధంబును వివరంబుగాఁ దెల్పవలయునని ప్రార్థింప, సంతసించి యిట్లనుచున్నాఁడు.

పరబ్రహ్మ లక్షణము.

శ్లో. అణోరణీ యాన్మహతో మహీయా
నాత్మాస్యజంతో ర్నిహితో గుహాయామ్,



తమః క్రతుః పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్. ౧.

తా. అణువుకంటె అణువుగను, మహత్తుకంటె మహత్తుగను నుండు ఆత్మయైనవాఁడు ఈ దేహియొక్క హృదయగుహాయం దున్నాఁడు. విషయానుభవములయం దిచ్ఛలేని వాఁడుగను, దుఃఖములేని వాఁడుగను నుండువాఁడు, వృద్ధి క్షయములు లేని ఆ యాత్మను, ఈశ్వరానుగ్రహము చేత నెఱుంగు చున్నాఁడు.

వి. ఆత్మ జంతువులయొక్క హృదయకములమధ్యమం దున్నాఁడనియును, వానిని ఈశ్వరానుగ్రహము (ఇది రహస్యము) చేతను, లేక ఆశారహితత్వము చేతను, (ఆ హృదయాంతర్వర్తియగు ఆత్మను) దెలిసికొనవలయునని భావము.

శ్లో. అపాణిపాదో జవనో గృహీతా
పశ్యత్యచక్షు స్సశృణోత్యకర్ణః,
సవేత్తి వేద్యం నచ తస్యాస్తివేత్తా
తమాహురగ్ర్యం పురుషం మహాంతమ్. ౨.

తా. కాళ్లులేక వేగముగా నడుచుచున్నాఁడు. చేతులులేక గ్రహించుచున్నాఁడు. కండ్లులేక చూచుచున్నాఁడు. చెవులులేక వినుచున్నాఁడు. వాఁడు సమస్తము నెఱుంగును. వానిని యెఱుఁగువాఁడు లేఁడు. వానినే ఆది మహాపురుషుఁడని చెప్పచున్నారు.

శ్లో. సర్వస్యధాతార మచింత్యశక్తిం
సర్వాగమాంతార్థ విశేష వేద్యమ్,
పరాత్పరం పరమం వేదితవ్యం
సర్వావసానే సకృద్వేదితవ్యమ్. ౩.



తా. సర్వమును భరించు వాఁడుగను, చింతింప నలవిగాని శక్తి కలవాఁడుగను, సకలోపనిషదర్థ విశేషములచేఁ దెలియఁదగిన వాఁడుగను, ఉత్తములకంటె నుత్తముఁడైన వాఁడుగను, తెలియఁ దగినట్టి ఉత్కృష్ట వస్తువుగను, సకలమునందును మిగిలిన వాఁడుగను (సర్వము నశించిన పుడు మిగిలియుండు వాఁడుగను), ఆ బ్రహ్మమున్నదని తెలియఁగగినది.

శ్లో. కవిం పురాణం పురుషోత్తమోత్తమం
సర్వేశ్వరం సర్వదేవై రుపాస్యమ్,
అనాది మధ్యాంత మనంత మవ్యయం
శివాచ్యుతాంభోరుహగర్భభూరుహమ్. ౪.

తా. సర్వజ్ఞుఁడుగను, అనాదికాలమునుండు వాఁడుగను, ఉత్తములలో నుత్తముఁడుగను, సకలమునకు నాథుఁడుగను, సకల దేవతలచే నుపాసింపఁ దగినవాఁడుగను, మొదలు నడుము తుద లేని వాఁడుగను, అంతములేని వాఁడుగను, నాశరహితుఁడుగను, బ్రహ్మవిష్ణు రుద్రులకు కారణుండుగను, ఆ బ్రహ్మమున్నదని తెలియవలయును.

శ్లో. స్వేనాహృతం సర్వమిదం ప్రపంచం
పంచాత్మకం పంచసు వర్తమానమ్,
పంచీకృతానంత భవ ప్రపంచం
పంచీకృత స్వావయవై రసంవృతమ్. ౫.

తా. సకల ప్రపంచమును తనలో నణఁగించుకొను వాఁడుగను, పంచభూత స్వరూపుఁడుగను, పంచభూతములయం దుండువాఁడుగను, పంచీకృతమై యుండునట్టి అనేక ఉత్పత్తియొక్క విస్తారము కలవాఁడుగను, పంచీకృతమై యుండు తనయొక్క ప్రపంచమనెడి అవయవములచేత చుట్టిగింపఁ బడని వాఁడుగను, నుండునదియే పరబ్రహ్మమని తెలిసికొనుము.

అవ. ఆచార్యుఁడు, మఱియు దానినే విస్తరించి చెప్పుచున్నాఁడు.

బ్రహ్మము అనిర్వాచ్యము.

శ్లో. అనిర్వాచ్యపదంవక్తుం నశక్యంతైస్సురైరపి,
తస్మాత్స్వప్రకాశరూపంతత్ కింశాస్త్రేణ ప్రకాశ్యతే. ౬.

తా. వాక్కునకు (వేదమునకు) అందనిపదమును (పరమాత్మవస్తువును) చెప్పుటకు దేవతలచేతను సాధ్యముకాదు. కనుక స్వప్రకాశ స్వరూపమైన బ్రహ్మము శాస్త్రములచే నెట్లు ప్రకాశితమగును. అనఁగా శాస్త్రములవలన తెలియఁబడదని భావము.

వి. ఆవస్తుతత్త్వము అనుభవముచేతనే తెలియఁదగినదని భావము.

బ్రహ్మము అఖండస్వరూపము.

శ్లో. ఆత్మసంజ్ఞశ్శివశ్శుద్ధ ఏకఏవాఽద్వయస్సదా,
బ్రహ్మరూపతయాబ్రహ్మ కేవలం ప్రతిభాసతే. ౭.

తా. ఆత్మ యను పేరుగల బ్రహ్మము మంగళస్వరూపమైనదిగను, సదా రెండవది లేనియట్టి ఏకస్వరూపమైనదిగను, అఖండస్వరూప మాత్రముచేతనే ప్రకాశించునదిగను నున్నది.

బ్రహ్మముసత్యజ్ఞానానందస్వరూపము.

శ్లో. ప్రతిష్ఠాసర్వభూతానాం ప్రజ్ఞానఘన లక్షణం,
తద్విద్యావిషయంబ్రహ్మ సత్యజ్ఞానసుఖాద్వయమ్. ౮.

తా. ఈ బ్రహ్మము సకల భూతములకును ఆత్మగానున్నది. జ్ఞానముచేతనే తెలిసికొనం దగినది. సత్యము, జ్ఞానము, సుఖము (ఆనందము), అద్వయము, అను నీలక్షణములను స్వయముగాఁ గలిగినదిగా నున్నది.

బ్రహ్మము ఆనందస్వరూపము.

శ్లో. యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ,
తదేవం ప్రథమంప్రోక్తం బ్రహ్మైవ శివసంజ్ఞితమ్. ౯.

తా. వేదములు ఏ బ్రహ్మముయొక్క లక్షణము చెప్పుటకు శక్తిలేక మనస్సుతోఁగూడ మఱలుచున్నవో, అట్టి పరబ్రహ్మము అనాది యనియును, శివ మనెడి పేరుకలది యనియును చెప్పఁబడుచున్నది.



అవ. బ్రహ్మాఽభిన్నం బేదియు లేదని చెప్పుచున్నాఁడు.

శ్లో. పరిపూర్ణమనాద్యంత మప్రమేయ మవిక్రియమ్,
సద్ఘనంచిద్ఘనంనిత్య మానందఘనమవ్యయమ్. ౧౦.
ప్రత్యగేకరసం పూర్ణ మనంతం సర్వతోముఖమ్,
అహేయమనుపాదేయ మనాధేయమనాశ్రయమ్. ౧౧.
నిర్గుణంనిష్క్రియంసూక్ష్మం నిర్వికల్పం నిరంజనమ్,
అనిరూప్యస్వరూపంయ న్మనోవాచామగోచరమ్. ౧౨.
సత్సమృద్ధంస్వతస్సిద్ధం శుద్ధం బుద్ధ మనీదృశమ్,
ఏకమేవాఽద్వయంబ్రహ్మ నేహనానాఽస్తికించన. ౧౩.

తా. అంతట నిండియుండునదియును, మొదలు తుదలేనిదియును, (జన్మమరణములు లేనిదియును), వాఙ్మనో బుద్ధులకు గోచరము కానిదియును, షడ్భావ వికారములు లేనిదియును, సత్తామాత్రమైనదియును, జ్ఞానస్వరూప మైనదియను, శాశ్వత మైనదియును, ఆనంద ఘనస్వరూప మైనదియును, (దుఃఖకారణము లైన కర్మాదులు లేనిదియును), నశించు స్వభావము లేనిదియును, దేశకాల వస్తు పరిచ్ఛేదము లేనిదియును, సర్వత్ర వ్యాపించినదియును, సర్వత్ర తానే ప్రకాశించుచుండు నదియును, గ్రహింపనలవి కానిదియును, కల్పింపఁబడనిదియును, ఆధార రహితమైనదియును, నిర్గుణమైనదియును, క్రియలు లేనిదియును, సూక్ష్మమైనదియును, (ఇంద్రియములకును మనస్సునకును గోచరింపనిదియును), వికల్పము లేనిదియును, ప్రకృతి రహితమైనదియును, శబ్దవృత్తులచేనిరూపింపఁబడనిదియును, నగు బ్రహ్మమెయ్యదికలదో, అది మనస్సునకును వాక్కునకును గోచరింపదు. ఆబ్రహ్మము సత్తామాత్రముచే సంపూర్ణమైనది. స్వతస్సిద్ధ మైనది. ప్రకృతి సంబంధము లేనిది. జ్ఞానస్వరూపమైనది. ఇట్టిదని చెప్పనలవి కానిది. సజాతీయ విజాతీయ స్వగత భేదము లేనిది. పరిపూర్ణ నిరతిశయానంద స్వరూపమైనది. బ్రహ్మమొక్కటే యుండునది. ఆబ్రహ్మము తప్ప వేరేమియును లేదు.

అవ. ఇట్లాచార్యుఁడు బోధింపఁగా విని, శిష్యుఁడు, ఆపరబ్రహ్మము గోచరింపని కారణ మేమనఁగా, ఆచార్యుం డిట్లనుచున్నాఁడు.

## మాయాబ్రహ్మస్వరూప పటము

ప్రకృతి.




బ్రహ్మస్వరూపము.

శ్లో. ప్రకృతిత్వంతతస్సృష్టం సత్త్వాదిగుణసామ్యతః,
సత్త్యైవాభాతిచిచ్ఛాయా దర్పణేప్రతిబింబవత్. ౧౪.
తేనచిత్ప్రతిబింబేన త్రివిధాభాతి సా పునః,
ప్రకృత్యవిచ్ఛిన్నతయా పురుషత్వం పునర్భవేత్. ౧౫.
శుద్ధసత్త్వప్రధానాయాం మాయాయాంబింబితో
సత్త్వప్రధానాప్రకృతి ర్మాయేతిప్రతిపాద్యతే. [హ్యజః,
సామాయా స్వవశోపాధి సర్వజ్ఞస్యేశ్వరస్య హి,
వశ్యమాయాత్వమేకత్వం సర్వజ్ఞత్వంచ తస్యతు. ౧౭.
సాత్త్వికత్వాత్సమష్టిత్వాత్ సాక్షిత్వాజ్జగతామపి,
జగత్కర్తుమకర్తుంవా చాన్యథాకర్తుమీశతే.౧౮.
యస్తుఈశ్వరఇత్యుక్తః సర్వజ్ఞత్వాదిభి ర్గుణైః,
శక్తిద్వయంచ మాయాయా విక్షేపావృతిరూపకమ్.౧౯.
విక్షేపశక్తిర్లింగాది బ్రహ్మాండాంతం జగత్సృజేత్,
అంతర్దృగ్దృశ్యయో ర్భేదం బహిశ్చబ్రహ్మసర్గయోః. ౨౦.
ఆవృణోత్యపరాశక్తి స్సా సంసారస్యకారణమ్.

తా. ఆ బ్రహ్మమునుండి సత్త్వాదిగుణ సామ్యమైన ప్రకృతి తత్త్వము కల్గెను. అద్దమునందు ప్రతిబింబించునట్లు చిచ్ఛక్తియొక్క ప్రతిబింబమైన ఛాయ సత్యమువలె కనఁబడుచున్నది. ఆ చిచ్ఛక్తియొక్క ప్రతిబింబము చేత మాయ గుణల మూఁడువిధములుగా (సత్త్వరజస్తమములుగా) ప్రకాశించుచున్నది. గుణల ప్రకృతి సంబంధముచేత పురుషత్వము కలుగుచున్నది. జన్మములేని పురుషుఁడు శుద్ధసత్త్వ ప్రధానమైన మాయచేత ప్రతిఫలించు చున్నాఁడు. సత్త్వప్రధానమైన ప్రకృతి మాయ యని చెప్పఁబడుచున్నది. ఆ మాయ సర్వజ్ఞుఁడైన ఈశ్వరునికి స్వాధీనమైనదిగను

ఉపాధి యైనదిగను నున్నది. మాయను స్వాధీనముగాఁ జేసికొని యుం డుటయును, ఏకరసముగా నుండుటయును, సర్వము నెఱుంగుస్థితియును ఆ ఈశ్వరునిదై యున్నది. సాత్త్వికముగా నుండుటవలనను, సకలమునుగా నుండుటవలనను, జగమునకు సాక్షిగా నుండుటవలనను, ఆ యీశ్వరుఁడు జగమును సృష్టించుటకును, లేక సృష్టింపకుండుటకును, లేక వేఱు విధముగా చేయుటకును (సంహరించుటకును), శక్తికలవాఁడుగా నున్నాఁడు. ఏవఁ డీశ్వరుఁడని చెప్పఁబడుచున్నాఁడో వాఁడు సర్వజ్ఞత్వాది గుణములతోఁ గూడినవాఁడు. మాయకు విక్షేపమనియును, ఆవరణమనియును, రెండు శక్తులు కలవు. విక్షేపశక్తి, సూక్ష్మము మొదలు బ్రహ్మాండమువఱకుఁ గల జగమును సృష్టిచేయున్నది. ఆవరణశక్తి, దేహములోపలి జ్ఞానము (తెలివి) జ్ఞేయము (తెలియఁబడు వస్తువు) అను వీనియొక్క భేదమును చేయునదియును; బాహ్యమందు బ్రహ్మమునకును ప్రపంచమునకును భేదము కలుగునట్లు మఱఁగించికొని యుండునదియును నై యున్నది. ఈ ఆవరణశక్తియే సంసారమునకు (జననమునకు) కారణ మైయున్నది.

౨. ఈ విషయమును గూర్చి సాధనప్రకరణమునందు మున్ను సంగ్రహముగాఁ జెప్పఁబడియున్నది. ఇపుడు దానినే యిచ్చట విస్తరముగాఁ జెప్పఁబడెను.

అవ. ఆచార్యుండు పరబ్రహ్మమునుండియే జీవేశ్వరులు కలిగి యున్నారని నిరూపించుచున్నాఁడు.

శ్లో. ద్వాసుపర్ణా శరీరేఽస్మిన్ జీవేశాఖ్యౌసహస్థితౌ. ౨౧.
తయోర్జీవఃఫలంభుంక్తే కర్మణో న మహేశ్వరః,
కేవలం సాక్షిరూపేణ వినాభోగం మహేశ్వరః. ౨౨.
ప్రకాశితస్స్వయంభేదః కల్పితోమాయయాతయోః,
ఘటాకాశమఠాకాశౌ యథాకాశ ప్రభేదతః. ౨౩.
కల్పితౌ పరమాజీవ శివరూపేణ కల్పితౌ.



## జీవేశ్వరస్వరూప పటము.

తా. ఈ శరీరమనెడి వృక్షమునందు జీవుఁడనియును, ఈశ్వరుఁ డనియును రెండుపక్షులు చేరియున్నవి. అందు జీవుఁడను పక్షి కర్మఫలమును అనుభవించుచున్నాఁడు. ఈశ్వరుఁడను పక్షి అనుభవింపక సాక్షి

మాత్రమై యున్నది. ఈ జీవేశ్వరులకు భేదము మాయచే కల్పింపఁబడినదై వెలయుచున్నది. ఆకాశమందు ఘటాకాశము మఠాకాశము అనెడి భేద మేలాగు కల్పింపఁబడి యున్నదో అలాగు బ్రహ్మమునందు జీవేశ్వరులు కల్పింపఁబడి యున్నారు.

వి. ఈ విషయమును శ్వేతాశ్వతరోపనిషత్, ముండకోపనిషత్, భగవద్గీత, భాగవతము, మొదలగు అనేక గ్రంథములందు గనందగును.

అవ. మఱియు దానినే దృఢీకరణము చేయుచున్నాఁడు.

శ్లో. మాయావిద్యేవిహాయైవ హ్యుపాధిపరజీవయోః.
అఖండం సచ్చిదానందం పరం బ్రహ్మవిలక్ష్యతే.[ ౨౪.

తా. శ్రేష్ఠమైన ఈశ్వరునకును, జీవునకును ఉపాధిగానుండు మాయయును అవిద్యయును నిగ్రహించి చూచినయెడల, అఖండ సచ్చిదానంద బ్రహ్మమే కానంబడుచున్నది.

వి. "శ్లో. స్వప్నమాయే యథాదృష్టే గంధర్వ నగరంయథా, తథా విశ్వ మిదందృష్టం వేదాంతేషు విచక్షణైః. అనఁగా, స్వప్నము, మాయ, గంధర్వనగరము, ఇవి యెట్లు కనఁబడినను సత్యము కాదో, అట్లు ఈ కనఁబడు ప్రపంచమును సత్యము కాదని ఉపనిషదర్థముల నెఱింగినవారిచే చూడఁబడుచున్నది.'' అనఁగా బ్రహ్మమే సత్యమైనదని భావము.

శ్లో. అవిద్యోపాధికోజీవో నమాయోపాధికః ఖలు. ౨౫.
మాయోపాధికచైతన్యం పరమాత్మహినాపరమ్.

తా. అవిద్యను ఉపాధిగాఁ గలవాఁడు జీవుఁడు. మాయోపాధి చైతన్యము పరమాత్మయేగాని వేఱుకాదు.

వి. అనఁగా మాయను ఉపాధిగాఁ గలవాఁడు ఈశ్వరుఁడని భావము.

అవ. బ్రహ్మము ఈశ్వరుండని బోధించుచున్నాఁడు.

శ్లో. ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవానితి. ౨౬.

తా. ఇట్లు భగవంతుఁడైన ఈశ్వరుఁడే తనయొక్క కలచేత (ప్రతిబింబముచేత) జీవుఁడై ప్రవేశించుచున్నాఁడు.

వి. అనఁగా, జీవేశ్వరు లొక్కరని భావము.

అవ. జగత్సత్యాసత్య ప్రయోజనమును వచించుచున్నాఁడు.

జగత్సత్యాఽసత్య ప్రయోజనము.

శ్లో. సత్యత్వేనజగద్భానం సంసారస్య ప్రవర్తకమ్,
అసత్యత్వేనభానంతు సంసారస్య నివర్తకమ్. ౨౭.

తా. జగత్తు సత్యమని తోఁచుట (జనన మరణమైన) సంసారమునకుఁ గారణమై యున్నది. జగత్తు అసత్యమని తోఁచుట సంసారమును నివర్తిచేయుటకుఁ గారణమైయున్నది.

అవ. జీవేశ్వరప్రపంచము స్వకల్పితమని చెప్పుచున్నాఁడు.

జీవేశ్వర జగత్కల్పిత స్థితి లక్షణము.

శ్లో. కల్పయత్యాత్మనాత్మాన మాత్మాదేవస్వమాయయా,
స ఏవ బుధ్యతేభేదా నితి వేదాంతనిశ్చయః. ౨౮.

తా. దేవుఁడైనట్టి ఆత్మయైనవాఁడు తనయందు (శక్తియైన) తనయొక్క మాయచేత, తన్ను (జీవేశ్వరజగత్తుగా)కల్పించు కొనుచున్నాఁడు. వాఁడే భేదములను తెలియుచున్నాఁడని వేదాంతముయొక్క నిశ్చయము.

అవ. జీవాత్మ పరమాత్మలకు భేదంబు లేదని వచించుచున్నాఁడు.

జీవాత్మపరమాత్మ అభేదము.

శ్లో. ఘటాకాశమహాకాశ విభాగః కల్పితో యథా,
తథైవ కల్పితోభేదో జీవాత్మ పరమాత్మనోః. ౨౯.

తా. ఘటాకాశమునకును మహాకాశమునకును వేఱ్వేఱనుట యెట్లు కల్పితమో, అట్లు జీవాత్మ వేఱనియును, పరమాత్మ వేఱనియును చెప్పుట కల్పితమే.

అవ. బ్రహ్మజ్ఞాని ప్రపంచాదుల నెట్లు భావించు చున్నాఁడనుటను గూర్చి అనువదించుచున్నాఁడు.

## బ్రహ్మజ్ఞాని మనోలక్షణము.

శ్లో. జగజ్జీవాదిరూపేణ పశ్యన్నపి పరాత్మవిత్,
నతత్పశ్యతి చిద్రూపం బ్రహ్మవస్త్వేతి పశ్యతి. ౩౦.

తా. బ్రహ్మజ్ఞాని యైనవాఁడు జగత్తును జీవుఁడు మొదలగు రూపములుగాఁ జూచినను, దానిని చిద్రూపమైన బ్రహ్మవస్తువని చూచుచున్నాఁడే గాని వేఱువిధములుగాఁ జూచుటలేదు.

అవ. ఇట్లు బ్రహ్మజ్ఞాని యైనవాఁడు ప్రపంచమును జూచుటకుఁ గారణము, ప్రపంచము మిథ్యయని నిశ్చయించి చూచుచున్నాఁడని చెప్పుచున్నాఁడు.

## బ్రహ్మజ్ఞాని ప్రపంచ స్థితి.

శ్లో. ప్రపంచోయదివిద్యేత నివర్తేత న సంశయః,
మాయామాత్రమిదంద్వైత మద్వైతంపరమార్థతః.౩౧.

తా. ప్రపంచ ముండునేని అది నివర్తియగు ననుటయందు సందేహము లేదు. భేదబుద్ధి యైన ఈ ద్వైతము (జీవేశ్వర జగద్భేదము) మాయామాత్రమే. రెండవది లేని ఒక్కటే (పరబ్రహ్మమే) సత్యమైనది.

శ్లో. యదిదం దృశ్యతేసర్వం జగత్స్థావరజంగమమ్,
తత్సుషుప్తావివ స్వప్నః కల్పాన్తేప్రవినశ్యతి. ౩౨.

తా. స్థావర జంగమాత్మకములై కనంబడు నీ సకల ప్రపంచమును సుషుప్తియందు స్వప్నమువలె (అనఁగా సుషుప్తికాలమున స్వప్నము నశించునట్లు) కల్పాంతమునందు (మనో సంకల్పాంతమునందు, ఇదిరహస్యము.) నాశమొందుచున్నది.



శ్లో. యథావంధ్యాసుతో నాస్తి యథానాస్తిమరౌజలమ్.
యథానాస్తి నభోవృక్ష స్తథానాస్తిజగత్స్థితిః. 33.

తా. ఏప్రకారము వంధ్యా పుత్రుఁడు, ఎండమావుల జలము, ఆకాశ వృక్షము, అనునివి యెట్లో, అట్లు జగత్తుయొక్క స్థితియును లేదు.

శ్లో. బ్రహ్మవిజ్ఞానసంపన్నః ప్రతీత మఖిలంజగత్,
పశ్యన్నపి సదానైవ పశ్యతి స్వాత్మనః పృథక్. 34.

తా. బ్రహ్మజ్ఞాని యైనవాఁడు కనఁబడు సకల ప్రపంచమును జూచుచున్నను, తనకంటె నన్యముగాఁ జూచుటలేదు.

అవ. అజ్ఞాని బ్రహ్మము నెఱుంగఁడని చెప్పుచున్నాఁడు.

అజ్ఞాని మనోలక్షణము.

శ్లో. అజ్ఞానచక్షుర్నే క్షేత భాస్వంతంభానుమంధవత్. 35.

తా. ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివాఁడు కనుఁగొనని విధమున అజ్ఞాని (బ్రహ్మమును) జూచుటలేదు.

వి. జ్ఞానియే బ్రహ్మము నెఱుంగఁ గలఁడని భావము.

అవ. ఇట్లు ఆచార్యుండు చెప్పఁగా శిష్యుండు విని, స్వామీ! బ్రహ్మము నెఱుంగువానియొక్క స్థితి యెట్టిదని యడుగఁగా నాచార్యుం డిట్లని చెప్పుచున్నాఁడు.

శ్లో. నావిరతో దుశ్చరితా న్నాశాంతో నాసమాహితః,
నాశాంతమానసోవాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్. 36.

తా. దుష్కృత్యములను విడువని వాఁడును, చిత్తశాంతి నొందని వాఁడును, ఇంద్రియములను జయింపనివాఁడును, చిత్తమును స్వాధీనము చేసికొనినవాఁడును, లేక చిత్త చలనము లేనివాఁడయ్యును తత్ఫలములను గోరువాఁడును, మనస్సును ఏకాగ్రముగా నిల్పనివాఁడును, పైన చెప్పఁబడిన లక్షణములుగల, ఆత్మను పొందఁడు.

అవ. శిష్యుఁడు, ఆచార్యునింజూచి, స్వామీ! బ్రహ్మము నెఱుంగఁదగిన వానియొక్క స్థితిని యనువదింపుఁడని ప్రార్థింపఁగా, ఆచార్యుండు, ఆ బ్రహ్మము నెఱుంగఁదగినవాఁడు సప్తమజ్ఞాన భూమికాధిష్ఠితుఁడనియును, ఆ జ్ఞానభూమికలకు ప్రతిబంధకములు అజ్ఞానభూమిక లనియును జెప్ప నుపక్రమించినవాఁడై, ముందుగా అజ్ఞానభూమికాలక్షణమును బోధించుచున్నాఁడు.

అజ్ఞానభూమికా నామములు.

శ్లో. బీజజాగ్రత్తథాజాగ్ర న్మహాజాగ్రత్తథైవచ,
జాగ్రత్స్వప్నస్తథాస్వప్నః స్వప్నజాగ్రత్సుషుప్తికమ్.
ఇతి సప్తవిధో మోహః పునరేవ పరస్పరమ్,
శ్లిష్టోభవత్యనేకాఽగ్ర్యం శ్రుణులక్షణ మస్యతు. ౩౮.

తా. 1 బీజజాగ్రత్తు, 2 జాగ్రత్తు, 3 మహాజాగ్రత్తు, 4 జాగ్రత్స్వప్నము, 5 స్వప్నము, 6 స్వప్నజాగ్రత్తు, 7 సుషుప్తి, అని అజ్ఞానభూమిక లేడు విధములు. ఈ యజ్ఞానము మఱల నొకదానితో నొకటిచేరి అనేకములగుచున్నది. దీనియొక్క (ఈ మోహమనెడి అజ్ఞానముయొక్క) లక్షణమును చెప్పెదను వినుము.

వి. ఈ అజ్ఞానభూమికలు చిద్రూపమునందు లేనివైనను, ఉండునట్లుగా పామరజనమున కగపడుచున్నది. ఎట్లన; స్వప్నకాలంబునందు లబ్ధమైన పదార్థము సత్యంబని యప్పుడు తోఁచినను, ఆ పదార్థము జాగ్రదవస్థయందు లేనట్లుగా, అజ్ఞానకాలమున సత్యముగాఁ దోఁచు నీ ప్రపంచము, జ్ఞానానంతరము బ్రహ్మంబునకంటె నన్యముగాఁ దోఁచుట లేదు. ఇట్లే ఈ అజ్ఞానభూమికలుకూడ జ్ఞానభూమికలు కలిగినవానికి లేకున్నది; యని భావము.

## బీజజాగ్రము.

శ్లో. ప్రథమంచేతనంయత్స్యాదనాఖ్యంనిర్మలంచితః,
భవిష్యచ్చిత్తజీవాది నామశబ్దార్థభాజనమ్. ౩౯.
బీజరూపస్థితం జాగ్రద్బీజజాగ్రత్తదుచ్యతే.

తా. నిర్మలమైనట్టియు, నామరూపరహితమైనట్టియు, చిద్రూపమైన ఆత్మయొక్క మొదటిదైన, యే చేతనశక్తి కలదో, అది ఇఁకముందు రాఁగల చిత్తము, జీవుఁడు, అను నీ మొదలగు నామములకును, శబ్దములకును, అర్థములకును స్థానమైనట్టి జాగ్రదవస్థ, బీజరూపమై యుండుటంబట్టి బీజజాగ్రత్తని చెప్పఁబడుచున్నది.

వి. బీజజాగ్రమను మొదటి అజ్ఞానభూమికయే బ్రహ్మజ్ఞానముయొక్క ప్రథమావస్థ యని భావము.

## జాగ్రము.

శ్లో. నవప్రసూతస్యపరాదయంచాఽహమిదంమమ. ౪౦.
ఇతి యః ప్రత్యయస్స్వస్థస్తజ్జాగ్రత్ప్రాగభావనాత్.

తా. కారణంబైన బీజజాగ్రమువలన, క్రొత్తఁగాఁ గల్గిన, వీఁడు, నేను, నాది, అను నిట్టి యేజ్ఞానము మున్ను లేకపోవుటవలన విశదముగు చున్నదో అది జాగ్రత్తనఁబడును.

వి. బీజజాగ్రమునందు, జీవునికిఁగల్గు అహంకారస్ఫురణము, మొలకతీరుగా నేర్పడునట్టి తెలివి, జాగ్రమనఁబడునని భావము.

## మహాజాగ్రము.

శ్లో. అయంసోఽహమిదంతన్మే ఇతి జన్మాంతరోదితః. ౪౧.
పీవరః ప్రత్యయః ప్రోక్తో మహాజాగ్రదితిస్ఫుటమ్.

తా. వీఁడు, వాఁడు, నేను, ఇది, అది, నాది, అని అనేక జన్మాంతరములనుండి కల్గినట్టి దృఢజ్ఞాన మెదియో,- అది మహాజాగ్రత్తని చెప్పఁబడెను.

వి. బహుజన్మములనుండి బలముగా నాటుకొనియుండు అహంభావము మహాజాగ్రమనఁబడును.

జాగ్రత్స్వప్నము.

శ్లో. అరూఢ మథవారూఢం సర్వథా తన్మయాత్మకమ్. ౪౨.
యజ్జాగ్రతో మనోరాజ్యం తజ్జాగ్రత్స్వప్న ఉచ్యతే.

తా. బలీయము కాకపోయినను, లేక బలముతోఁ గూడికొనినను, ఎట్లయినను విషయాకారముగ నున్నట్టి జాగ్రత్త కలవానియొక్క మనోరాజ్య మెదికలదో, అది జాగ్రత్స్వప్నమని చెప్పఁబడుచున్నది.

వి. అనేకజన్మాంతరములయొక్క వాసనాబలీయముచేత ముందు చూచినవియు, చూడబడనివియు సంకల్పించికొని, దానినే విషయాకారముగా పరిణమింపంజేయు మనోరాజ్యము జాగ్రత్స్వప్న మనఁబడును. [illegible]గా ఇద్దరు చంద్రులు, శుక్తిరజతము, ఎండమావులజలము, అను నీ భేద పరంపరల నభ్యసించుట జాగ్రత్స్వప్నమని భావము.

స్వప్నము.

శ్లో. అల్పకాలం మయాదృష్ట మేతన్నో దేతి యత్రహి.
పరామర్శః ప్రబుద్ధస్య స స్వప్న ఇతి కథ్యతే. ౪౩.

తా. నిద్రలేచినవానికి క్షణకాలము నాచేత జూడఁబడినది వే ఱెచ్చటను లేదనెడి విచారణ యేదికలదో, అదే స్వప్నమని చెప్పఁబడుచున్నది.

వి. నిద్రలేచినపిదప క్షణకాలములో ననేక వింతలను జూచితిని, ఇప్పు డవి కనఁబడలేదని చింతించుటయే స్వప్నమని భావము.

స్వప్నజాగ్రము.

శ్లో. చిరంసందర్శనాభావా దప్రఫుల్లం బృహద్వచః. ౨౪.
చిరకాలానువృత్తిస్తు స్వప్నో జాగ్రదివోదితః,
స్వప్నజాగ్రదితిప్రోక్తం జాగ్రత్యపి పరిస్ఫురత్. ౨౫.

తా. బహుకాలము క్రిందట చూచినందువలన మఱచిపోయిన గొప్పవిషయమును చిరకాలము జ్ఞప్తికి తెచ్చుకొనుటకై చేయు స్వప్నము జాగ్రత్తవలెనే యుదయించినదై మెలకువయందు ప్రకాశించుట స్వప్నజాగ్రత్తని చెప్పంబడెను.

వి. ముందుచూచిన వస్తువులను బహుకాలము కడచిన వెనుక, దానినే మఱల జ్ఞప్తికిఁ దెచ్చికొనుటకై, చిరకాలము చూచు స్వప్నము, జాగ్రద్దశయందువలెఁ దోఁచుటంబట్టి, స్వప్నజాగ్రమని చెప్పఁబడెనని భావము.

సుషుప్తి.

శ్లో. షడవస్థాపరిత్యాగే జడా జీవస్యయాస్థితిః,
భవిష్యద్దుఃఖబోధాఢ్యా సౌషుప్తిస్సోచ్యతేగతిః.
జగత్తస్యామవస్థాయా మంతస్తమసి లీయతే.

తా. ఈ యాఱవస్థలు నశించినమీఁద, జీవునకు ఏ జడమైన యవస్థ కలుగుచున్నదో, అది ముందురాఁగల దుఃఖసంబంధమైన జ్ఞానముతోఁ గూడిన సుషుప్తిభూమిక యని చెప్పఁబడుచున్నది. ఆ సుషుప్త్యవస్థయందు జగము మహాతమస్సులో లయించుచున్నది.

వి. మున్ను చెప్పిన అజ్ఞానభూమిక లాఱును నశించినమీఁద జీవునకు జడత్వస్థితి కల్గుచున్నది. ఈ స్థితియే సుషుప్తి. ఈ సుషుప్తియే ముందురాఁబోవు దుఃఖసంబంధమైన జ్ఞానమునకు కారణమై యున్నది. ఇట్టి స్థితియందు జీవునకు నామరూపాత్మక ప్రపంచమంతయు మహాతమస్సునందు లీనమై

యుండును. అనఁగా ప్రపంచజ్ఞానము కొంచెమైననుండదు. ఈరీతిగా ప్రపంచ జ్ఞానము లేకపోయినందుచేతనే సమాధిస్థితి కుదురదు. ఏలన, ఈ జ్ఞానము ప్రపంచమిథ్యాత్వమును మనస్సునందు స్థిరముగా నెకొల్పదు. అజ్ఞాన భూమిక లనేక విధములని మున్ను చెప్పంబడియున్నను, అవియంతయు పారమార్థికదశకు విరుద్ధమైనదియును, అవిద్యాసహితమైనదియును, ప్రమాదమైనదియును నైన స్థితులేగని వేఱుకాదు. వానిని విస్తరించుట చేత ప్రయోజనము లేదని విరమింపఁబడియె.

అవ. ఇట్లుగా ఆచార్యుండు అజ్ఞానభూమికా లక్షణమును జెప్పి, జ్ఞానభూమికా లక్షణమును బోధింప నుపక్రమించుచున్నాఁడు.

జ్ఞానభూమికా నామములు.

శ్లో. జ్ఞానభూమిశ్శుభేచ్ఛాస్యా త్ప్రథమా సముదీరితా.
విచారణా ద్వితీయాతు తృతీయా తనుమానసీ,
సత్త్వాపత్తి శ్చతుర్థీస్యా త్తతోఽసంసక్తినామికా. ౪౮.
పదార్థభావనా షష్ఠీ సప్తమీ తుర్యగాస్మృతా.

తా. 1 జ్ఞానభూమి, ఇదే శుభేచ్ఛ. 2 విచారణ. 3 తనుమానసి. 4 సత్త్వాపత్తి. 5 అసంసక్తి. 6 పదార్థభావన. 7 తుర్యగా. అనునివి యేడును సప్తభూమిక లని చెప్పఁబడును.

వి. ఈ సప్తభూమికలలోఁ గొన్నిటికి పర్యాయపదములును కలవు. వానిని ముందు గనందగును.

శుభేచ్ఛ.

శ్లో. స్థితఃకింమూఢఏవాస్మి ప్రేక్షేఽహం శాస్త్రసజ్జనైః.
వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతే బుధైః.

తా. నేనేమియుఁ దెలియని మూఢుఁడనై యున్నాఁడను. శాస్త్రములచేతను సజ్జనులచేతను తత్త్వార్థమును తెలియఁగల ననెడి వైరాగ్యపూర్వకమైన యిచ్ఛయే శుభేచ్ఛ (సుభేచ్ఛ) యని జ్ఞానులచేఁ జెప్పఁబడుచున్నది.

విచారణ.

శ్లో. శాస్త్రసజ్జనసంపర్క వైరాగ్యాభ్యాసపూర్వకమ్.
సదాచారప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా.[౫౦.

తా. శాస్త్రములయొక్కయు సత్పురుషులయొక్కయు సాంగత్యమును, వైరాగ్యాభ్యాసపూర్వకముగాఁ గల్గిన సదాచారప్రవృత్తియును, విచారణ యని చెప్పఁబడుచున్నది.

వి. శాస్త్రములనఁగా వేదాంత శాస్త్రములనియును, సజ్జనులనఁగా ఆత్మజ్ఞానము గలవారనియును భావము.

తనుమానసి.

శ్లో. విచారణాశుభేచ్ఛాభ్యా మింద్రియార్థేషు రక్తతా.
యత్ర సా తనుతామేతి ప్రోచ్యతే తనుమానసీ.

తా. శుభేచ్ఛ, విచారణ, అను నీ రెంటిచేత విషయాభిలాష లెప్పుడు తగ్గునో, అప్పుడది తనుమానసి యని చెప్పఁబడుచున్నది.

వి. ఆశలు కొంచెముగ నుండునట్టి స్థితి తనుమానసి యని భావము.

సత్త్వాపత్తి.

శ్లో. భూమికాత్రితయాభ్యాసాచ్చిత్తేర్థవిరతేర్వశాత్. ౫౧.
సత్త్వాత్మనిస్థితే శుద్ధే సత్త్వాపత్తి రుదాహృతా.

తా. మున్ను జెప్పిన మూఁడు భూమికలయొక్క అభ్యాసమువలన విషయములయందు వైరాగ్యముకలిగి, అందువలన చిత్తము శుద్ధమైన సచ్చిదానందస్వరూపమైన ఆత్మయందుండుట సత్త్వాపత్తి యని చెప్పఁబడెను.

అసంసక్తి.

శ్లో. దశాచతుష్టయాభ్యాసా దసంసర్గఫలాతు యా.
రూఢసత్త్వ చమత్కారా ప్రోక్తాఽసంసక్తినామికా.

తా. ఇదివఱకుఁ జెప్పిన నాలుగు భూమికలయొక్క అభ్యాసము చేత, ఫలాపేక్ష లేని, రూఢమైన (బలముగా నాటుకొనిన) సత్త్వగుణ ప్రకాశము అసంసక్తి యను పేరుకలదని చెప్పఁబడుచున్నది.

పదార్థభావన.

శ్లో. భూమికాపంచకాభ్యాసాత్ స్వాత్మారామతయా భృశమ్.
ఆభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానా మభావనాత్,
పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావబోధనమ్. ౫౫.
పదార్థభావనా నామ షష్ఠీభవతి భూమికా.

తా. మున్ను జెప్పిన అయిదు భూమికలయొక్క అభ్యాసముచేత ఆత్మయందు మిగుల రమించువాఁడై (ఆత్మారాముఁడై) అంతర్బహిః పదార్థములయొక్క భావన (గోచరము) లేనట్టియును, ఇతరులచే బోధింపఁబడినపుడు మాత్రము కార్యములయందు ప్రవర్తించుటయు నగునట్టి స్థితియే, పదార్థభావన యనెడి ఆఱవభూమిక యగుచున్నది.

తుర్యగా.

శ్లో. షడ్భూమికాచిరాభ్యాసా ద్భేదస్యానుపలంభనాత్.
యత్స్వభావైకనిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః.

తా. ఈ షడ్భూమికలను బహుకాలము అభ్యసించుటవలన ప్రపంచాది భేదములు నశించి ఆత్మభావనయందే నెలకొని యుండునట్టి స్థితి యెదియో, అదే తుర్యగా యనెడి సప్తమభూమిక యని తెలియఁదగినది.

జ్ఞానభూమి మహిమ.

శ్లో. భూమికాసప్తకంచైతత్ ధీమతామేవగోచరమ్.
ప్రాప్యజ్ఞానదశామేతాం పశుమ్లేచ్ఛాऽదయోऽపి యే,
సదేహావాऽప్యదేహావా తే ముక్తా నాऽత్రసంశయః. ౫౮.



తా. ఈ సప్తజ్ఞానభూమిక లేడును జ్ఞానులకే తెలియును. ఈ మోక్ష సాక్షాత్కారమైన జ్ఞానదశను పొంది, పశుప్రాయులుగా నుండు (మూఢులుగానుండు) నీచవర్ణముల వారైనను దేహముతోఁగూడియున్నను, దేహముతోఁ గూడకున్నను ముక్తులు. దీనికి సంశయము లేదు.

వి. జ్ఞానభూమికలను బొందినవారే జాతివారైనను ముక్తులగుదురని భావము.

శ్లో. ఏతాసాంభూమికానాంతు గమ్యంబ్రహ్మాఽభిధంపదమ్,
త్వత్తాఽహంతాఽత్మతాయత్ర పరతానాఽస్తికాచన.
న క్వచిద్భావకలనా న భావాఽభావగోచరా .[౫౯.

తా. ఈ (సప్తజ్ఞాన) భూమికలవలన బ్రహ్మపదము పొందబడును. ఆ బ్రహ్మపదమునందు నీవు, నేను, నాది, అన్యునిది, అను నీ ధర్మమేదియు లేదు. ఎచ్చోటను (ఆ బ్రహ్మపదము) భావరూపమైనది కాదు. భావమైన వాక్కునకును అభావమైన మనస్సునకును విషయమైనది కాదు.

వి. బ్రహ్మపదము భావాతీతమైనదనియును, వాఙ్మనాతీతమైనదనియును భావము.

అవ. ఆచార్యుండు సప్తజ్ఞానభూమికలయొక్క లక్షణము నను వదించి, యిఁక ఆ భూమికలయొక్క అనుభవమును జెప్పుచున్నాఁడు.

ప్రథమ ద్వితీయ తృతీయభూమికాస్థితి (ముముక్షులక్షణము).

శ్లో. శుభేచ్ఛా త్రితయంభూమి భేదాభేదయుతంస్మృతమ్.
యథావద్వేద బుద్ధ్యేదం జగజ్జాగ్రతి దృశ్యతే.

తా. శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, అనెడి మూఁడుభూమికలును భేద భేదముతోఁ గూడినవి యని చెప్పఁబడుచున్నవి. ఏలన, జాగ్రదవస్థయందు ఏజగత్తును జూచుచున్నాఁడో ఆ జగత్తును సత్యమని బుద్ధిచేఁ దలిసికొను చున్నాఁడు.

వి. 1. శుభేచ్ఛయనఁగా, సంసారబంధ మనెడి అశుభేచ్ఛలనుండి వదలినమీఁద భావించు స్థితి. ఇది సుభేచ్ఛయనియును, జ్ఞానభూమి యనియును జెప్పఁబడును. పరమార్థజ్ఞానమే శుభము, లేక సుఖ మనఁబడును.

2. విచారణయనఁగా, బంధమెది? మోక్షమెది? యని విచారించునట్టి స్థితి.

3. తనుమానసి యను భూమికకు అసంగ మనియును పేరుకలదు. అసంగము సామాన్యాసంగమనియు, విశేషాసంగమనియు రెండువిధములు. సామాన్యాసంగమనఁగా సర్వమును దైవాధీనంబు, లేక కాలాధీనంబనియును; నేను కర్తయును బాధ్యుఁడును బాధకుఁడును గాను, అనియును; భావించియుండునట్టి స్థితి. విశేషాసంగమనఁగా నిరంతరాభ్యాసంబుచే పరతత్వంబు దర్శనం బగుచుండఁగా మౌనంబుగా నుండునట్టి పరమశాంత స్థితి.

చతుర్థభూమికా స్థితి. (బ్రహ్మవేత్త లక్షణము.)

శ్లో. అద్వైతేస్థైర్యమాయాతే ద్వైతేచ ప్రశమంగతే.
పశ్యంతి స్వప్నవల్లోకం తుర్యభూమిసు యోగతః,
విచ్ఛిన్నశరదభ్రాంశ విలయం ప్రవిలీయతే. ఉ.ని.

తా. అద్వైతమందు స్థిరబుద్ధికలవాఁడై, ద్వైతభావన అణఁగినపుడు చతుర్థభూమికా సంబంధముచేత నీ ప్రపంచమును స్వప్నమువలెఁ జూచుచున్నాఁడు. అనఁగా చెదరిపోవునట్టి శరత్కాల మేఘమెట్లు నాశమొందునో యట్లు జగత్తు నశించుచున్నది.

వి జగత్తు నశించినయెడల పరబ్రహ్మమే సత్యమనెడి నిశ్చయ జ్ఞానము కల్గును. నాలుగవదైన సత్త్వాపత్తి యను భూమికకు తుర్య మనియును పేరుకలదు.

పంచమభూమికాస్థితి. (బ్రహ్మవిద్వర లక్షణము.)

శ్లో. పంచభూమింసమారుహ్య సుషుప్తిపద నామికామ్,
శాంతాశేషవిశేషాంశ స్తిష్ఠత్యద్వైతమాత్రకే. ౬౩.

తా. సుషుప్తిపద మను పేరుగల అయిదవభూమిక నెక్కినవాఁడు సకలమైన విశేషాంశములను నిగ్రహించినవాఁడై అద్వైతమాత్రముగనే యున్నాఁడు.

వి. ఈదశయందు సమాధియొక్క అభ్యాసమువలన స్వయముగా వ్యుత్థానము కలుగును. ఈదశకు సుషుప్త్యవస్థ యనియును, అసంసక్తి యనియును పేర్లుకలవు.

షష్ఠభూమికాస్థితి. (బ్రహ్మవిద్వరీయ లక్షణము.)

శ్లో. అంతర్ముఖతయా నిత్యం బహిర్వృత్తిపరోపి సన్,
పరిశ్రాంతతయానిత్యం నిద్రాళురివ లక్ష్యతే. ౬౪.
కుర్వన్నభ్యాసమేతస్యాం భూమ్యాంసమ్యగ్వివాసనః.

తా. ఎల్లప్పుడును బాహ్య వ్యాపారములయం దుండినను, సదా అంతరదృష్టిచేత నీ యాఱవభూమికయందు అభ్యాసము చేయువాఁడు (చక్కఁగా విషయ వాసనలను పోఁగొట్టుకొన్నవాఁడై) పరిశ్రమనొంది నిద్రపోవువానివలె కనఁబడుచున్నాఁడు.

వి. ఈ భూమికయం దుండువారు సమాధియందు ఇతరుల బలాత్కారముచేత వ్యుత్థానమును పొందుదురేగాని, స్వయముగా నెంతకాలమునకైనను పొందరు.

సప్తమభూమికాస్థితి. (బ్రహ్మవిద్వరిష్ఠలక్షణము.)

శ్లో. సప్తమీగాఢసుప్తాఖ్యా క్రమప్రాప్తా పురాతనీ. ౬౫.
యత్రనాసన్నసద్రూపో నాహం నాప్యనహంకృతిః,
కేవలం క్షీణమనన ఆస్తేద్వైతేతి నిర్భయః. ౬౬.

తా. పురాతనమైన గాఢసుషుప్తి యను పేరుగల సప్తమభూమిక క్రమముగా (ఆఱుభూమికలకు తర్వాత) నిర్ధించుచున్నది. ఎచ్చట సత్తు అసత్తు అనెడి రూపము లేదో, అహంకారము అనహంకారమును లేదో, అట్టి సప్తమభూమికయందుండువాఁడు కేవలము క్షీణమనస్సుకలవాఁడు గను, భయము లేనివాఁడుగను, రెండవది లేని (అద్వైత) స్థితియందుండు వాఁడుగను నుండును.

తుర్యాతీతస్థితి (జీవన్ముక్తి, విదేహముక్తిలక్షణము.)

శ్లో. ఏషా హి జీవన్ముక్తేషు తుర్యావస్థేతి విద్యతే,
విదేహముక్తివిషయం తుర్యాతీత మతఃపరమ్. ౬౭.

తా. ఈ సప్తమ భూమికయొక్క స్థితియే జీవన్ముక్తులయందు తుర్యావస్థయని తెలియఁబడుచున్నది. జీవన్ముక్తుని స్థితికంటె వేఱైన తురీయాతీతదశయే విదేహముక్తి యనఁబడును.

వి. ఈసప్తమభూమిక తుర్యగాఅనియును, తురీయగాయనియును, తురీయగతియనియును, తుర్యావస్థయనియును, తురీయావస్థయనియును, ప్రణవస్వరూపమనియును పేరొందును. తురీయావస్థను బొందినవాఁడే జీవన్ముక్తుఁడు. దీనికి అతీతమైనవాఁడు విదేహముక్తుఁడు.

కొందఱు, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థభావన, అను భూమికలను పొందినవారికి జీవన్ముక్తియును; తుర్యమను భూమికను పొందినవారికి విదేహముక్తియును కల్గుననెదరు.

మఱికొందఱు, వైరాగ్యోపరతులు లేక, బోధమాత్ర మున్నయెడల విదేహముక్తి కల్గునని చెప్పెదరు. విదేహముక్తి యనఁగా, దేహముండియు ఆవ్యాపారములయందు సాక్షిత్వము లేకుండునట్టి దశ. ఈదశ జీవన్ముక్తి దశకంటె శ్రేష్ఠమైనది. అసంగత్వ స్వప్రకాశ స్వరూపుఁడైనట్టి అద్వైత స్థితి కలవానికి, వైరాగ్యోపరతులు ఆవశ్యకము లేదని కొందఱి మతము.

ఇంకను గొందఱు, స్థూల సూక్ష్మ కారణోపాధులను నిర్మూలముచేసి పరబ్రహ్మమునం దేకీభవించియుండువారికి కైవల్యముక్తి సిద్ధించుననెదరు.

మరియు, జీవన్ముక్తులు నాలుగు తెఱంగుల వారగుదురు. ఎట్లన, ప్రణవ స్వరూపభూమికయనునది అకారము, ఉకారము, మకారము, అర్ధమాత్ర, అను నాల్గువిధములు. అకార ఉకార మకారములు స్థూల, సూక్ష్మ, బీజ (కారణ), సాక్షి (కూటస్థ), భేదములచేత నాలుగు తెఱంగులు. వానియొక్క అవస్థలు జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయము లని నాలుగు విధములు.

1 స్థూలశరీర విషయమును ౪౮వ పుటయందు చూడుము.

2 సూక్ష్మశరీరవిషయమును ౪౯వ పుటయందు చూడుము.

3 బీజశరీర విషయమును ౪౯ వ పుటయందు చూడుము.

4 సాక్షి శరీరమనఁగా, తమోగుణ ప్రధానమైన అహంకార తత్త్వమనెడి కారణశరీరము నశించిన పిదప, శుద్ధసత్త్వగుణ ప్రధానమైన ప్రత్యగాత్మ. దీనికి మహాకారణశరీరమనియును, చిత్తనియును, చైతన్యమనియును, బోధమనియును, కూటస్థుఁడనియును, జ్ఞానమనియును, దృక్కనియును, దృశ్యానువిద్ధమనియును, బ్రహ్మాకారవృత్తియనియును, అఖండాకారవృత్తియనియును,ఆనందవృత్తియనియును, అసంప్రజ్ఞాతసమాధియనియును, శబ్దానువిద్ధమనియును, ఓంకారమనియును, ప్రణవమనియును, బోధాంకురమనియును, గ్రాహకశక్తియనియును, చిచ్ఛక్తియనియును, ప్రథమాభ్యాసమనియును, అసంగమనియును, సచ్చిదానందమనియును, స్వప్రకాశమనియును, నిత్యమనియును, శుద్ధమనియును, బుద్ధమనియును, నిర్మలమనియును, నిరాకామనియును, నిరుపద్రవమనియును, నిస్సంగమనియును, నిర్వికారమనియును, నిర్వికల్పమనియును, నిరాలంబమనియును, అఖండానందమనియును, పరిపూర్ణానందమనియును, నిత్యానందమనియును, నిర్విశేషానందమనియును, స్వరూపభావమనియును, అనేక నామములు కలవు.

1. ౧ అకార స్థూలాంశమునందు జాగ్రత్తయై యుండువాఁడు విశ్వుఁడు.

   ౨ అకార సూక్ష్మాంశమునందు జాగ్రత్తయై యుండువాఁడు తైజసుఁడు

   ౩ అకార బీజాంశమునందు జాగ్రత్తయై యుండువాఁడు ప్రాజ్ఞుఁడు.

   ౪ అకార సాక్ష్యాంశమునందు జాగ్రత్తయై యుండువాఁడు తురీయుఁడు.

2. ౧ ఉకార స్థూలాంశమునందు స్వప్నావస్థయై యుండువాఁడు విశ్వుఁడు.

   ౨ ఉకార సూక్ష్మాంశమునందు స్వప్నావస్థయై యుండువాఁడు తైజసుఁడు.

   ౩ ఉకార బీజాంశమునందు స్వప్నావస్థయై యుండువాఁడు ప్రాజ్ఞుఁడు.

   ౪ ఉకార సాక్ష్యాంశమునందు స్వప్నావస్థయై యుండువాఁడు తురీయుఁడు.

3. ౧ మకార స్థూలాంశమునందు సుషుప్త్యవస్థయం దుండువాఁడు విశ్వుఁడు.

   ౨ మకార సూక్ష్మాంశమునందు సుషుప్త్యవస్థయం దుండువాఁడు తైజసుఁడు.

   ౩ మకార బీజాంశమునందు సుషుప్త్యవస్థయం దుండువాఁడు ప్రాజ్ఞుఁడు.

   ౪ మకార సాక్ష్యాంశమునందు సుషుప్త్యవస్థయం దుండువాఁడు తురీయుఁడు.

4. ౧ అర్ధమాత్రా స్థూలాంశమునందు తురీయుఁడై యుండువాఁడు విశ్వుఁడు.



౨ అర్ధమాత్రా సూక్ష్మాంశమునందు తురీయుఁడై యుండువాఁడు తైజసుఁడు.

3 అర్ధమాత్రా బీజాంశమునందు తురీయుఁడై యుండువాఁడు ప్రాజ్ఞుఁడు.

౪ అర్ధమాత్రా సాక్ష్యంశమునందు తురీయుఁడై యుండువాఁడు తురీయ తురీయుఁడు.

అకారముయొక్క తురీయాంశము శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, అను మూఁడుభూమికలు.

ఉకారముయొక్క తురీయాంశము సత్త్వాపత్తి, అను నొకభూమిక.

మకారముయొక్క తురీయాంశము అసంసక్తి, అను నొకభూమిక.

అర్ధమాత్రయొక్క తురీయాంశము పదార్థభావన, అనునొకభూమిక.

ఈ షడ్భూమికల నతిక్రమించినదే తుర్యగా, అను సప్తమభూమిక.

మొదటి మూఁడుభూమికలయందు సంచరించువాఁడు ముముక్షు వగుచున్నాఁడు.

నాలుగవ భూమికయందు సంచరించువాఁడు బ్రహ్మవిదుఁ డగుచున్నాఁడు.

అయిదవ భూమికయందు సంచరించువాఁడు బ్రహ్మవిద్వరుఁ డగుచున్నాఁడు.

ఆఱవ భూమికయందు సంచరించువాఁడు బ్రహ్మవిద్వరీయుఁ డగుచున్నాఁడు.

ఏడవ భూమికయందు సంచరించువాఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁ డగుచున్నాఁడు.

అవ. స్వామీ! సప్తజ్ఞాన భూమికాఽవధియే, జీవన్ముక్తియనియును, దాని నతిక్రమించిన స్థితియే విదేహముక్తియనియు నుపదేశించితిరి. తల్లక్షణము నెఱింగింపుఁడని ప్రార్థింప, ఆచార్యుండు శిష్యునకు సుబోధముగుటకొఱకు జీవన్ముక్తిలక్షణము ననువదించుచున్నాఁడు.

## జీవన్ముక్తిలక్షణము.

శ్లో. అధ్యాత్మరతిరాసీనః పూర్ణః పావనమాననః,
ప్రాప్తానుత్తమవిశ్రాంతి నకించిదిహ వాంఛతి,
యోజీవతి గతస్నేహ స్సజీవన్ముక్తఉచ్యతే. ౬౮.

తా. ఎవ్వఁడు అధ్యాత్మయందు రమించువాఁడును, స్థిరుఁడును, పూర్ణమైనవాఁడును, (సాధనసామగ్రిచే కొఱఁతలేనివాఁడును), చిత్తశుద్ధి కలవాఁడును, పరబ్రహ్మానందమునందు విశ్రమించినవాఁడును, సంసార మందిచ్ఛలేనివాఁడును, భార్య పుత్త్రులు ధనము భూమి మొదలగువానిని వర్జించినవాఁడును నైయుండునో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడు చున్నాఁడు.

శ్లో. సంవేద్యేన హృదాకాశే మనాగపి నలిప్యతే,
యస్యాఽసావజడాసంవి త్సజీవన్ముక్తఉచ్యతే. ౬౯.

తా. ఎవఁడు మనస్సునందు సాంసారిక జ్ఞానమునందు చేరఁడో, ఎవనియొక్క జ్ఞానము మందముగాక ప్రకాశించునో, వాఁడు జీవన్ముక్తుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

వి. సంసారతాపత్రయములకు లోఁబడక శుద్ధజ్ఞాన స్వరూపముతో ప్రకాశించువాఁడు జీవన్ముక్తుఁడని భావము.

శ్లో. ఇదంజగదహంసోయం దృశ్యజాతమవాస్తవమ్,
యస్య చిత్తేన స్ఫురతి సజీవన్ముక్తఉచ్యతే. ౭౦.

తా. ఎవనియొక్క చిత్తమునందు ఇది జగత్తు, నేను, వాఁడు, వీఁడు, వాస్తవములేని కనఁబడు వస్తువులు, ఉదయమగుటలేదో (తోఁచు టలేదో), వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. తపఃప్రభృతినాయస్మై హేతునైవవినా పునః,
భోగా ఇహ న రోచంతే సజీవన్ముక్తఉచ్యతే. ౭౧.



తా. చిత్తైకాగ్ర్యము మొదలగునవి లేక, ఎవనికి నిర్హేతుకముగా ఈ సంసార భోగములు మరల రుచింపవో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. ఆపతత్సుయథాకాలం సుఖదుఃఖేష్వనారతః,
నహృష్యతి గ్లాయతియ స్సజీవన్ముక్తఉచ్యతే. ౭౨.

తా. ఆ యా కాలములయందు సంప్రాప్తించు సుఖదుఃఖముల యందు సంతోషమును దుఃఖమును బొందఁడో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. నోదేతినాస్తమాయాతి సుఖదుఃఖే మనఃప్రభా,
యథాప్రాప్తస్థితిర్యస్య స జీవన్ముక్తఉచ్యతే. ౭౩.

తా. ఎవనియొక్క మనఃప్రకాశము సుఖదుఃఖములయందు ఉదయమును అస్తమయమును బొందుటలేదో, చెందినదానిని అతిక్రమించుట లేదో, (అట్టిమనస్సు కలవాఁడు) జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

వి. సుఖము కల్గినపుడు ఉప్పొంగుట ఉదయము. దుఃఖము కల్గినపుడు ఖిన్నుఁడగుట అస్తమయము. సుఖముకల్గినపుడు దానిని వృద్ధి చేయుటకై పాటుపడుటయును, దుఃఖముకల్గినపుడు దానిని నివృత్తిచేసి కొనుటకు ప్రయత్నించుటయును అతిక్రమ మనఁబడును. అనఁగా ప్రాప్తించిన శుభాఽశుభములనుగూర్చి చింతింపక యుండవలయునని భావము.

శ్లో. హర్షామర్షభయక్రోధ కామకార్పణ్యదృష్టిభిః,
నపరామృశ్యతేయోంత స్సజీవన్ముక్తఉచ్యతే. ౭౪.

తా. ఎవఁడు సంతోషము, అసూయ, భయము, కోపము, కామము, కార్పణ్యము అను వీనిచేఁ గూడిన దృష్టిచేత, మనస్సునందు పరామర్శింపఁబడఁడో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

వి. బ్రహ్మజ్ఞానికి కామాదిదుర్గుణ వృత్తులు మనస్సునం దుండవు. అనఁగా వాని మనస్సునందు అజ్ఞానజన్యములైన కామాదివృత్తులు చేరవని భావము.

శ్లో. రాగద్వేషభయాదీనా మనురూపం చరన్నపి,
యోంతర్వ్యోమవదత్యచ్ఛ స్సజీవన్ముక్తఉచ్యతే. ౭౫.

తా. ఆశ, ద్వేషము, భయము మొదలగువానికి అనుగుణముగా వర్తించినను, ఎవనియొక్క మనస్సు ఆకాశమువలె నిర్మలమైయుండునో వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. యస్యనాహంకృతో భావో బుద్ధిర్యస్యనలిప్యతే,
కుర్వతో౽కుర్వతో వాపి సజీవన్ముక్తఉచ్యతే. ౭౬.

తా. ఏకార్యమునైన చేసినను, చేయకపోయినను, ఎవనికి తాను కర్తయనెడి భావము లేదో, ఎవనియొక్క బుద్ధి; విషయములయందు ప్రవేశించుటలేదో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. యస్మాన్నోద్విజతేలోకో లోకాన్నోద్విజతేచ యః,
హర్షామర్షభయోన్ముక్త స్సజీవన్ముక్తఉచ్యతే. ౭౭.

తా. ఎవనియందుండి జనులు భయమొందుటలేదో, జనులయందుండి యెవఁడు భయమొందుటలేదో, ఎవఁడు సంతోషము, కోపము, భయము అను వీనిని విడిచియుండువాఁడో, అట్టివాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. యస్సమస్తార్థజాలేషు వ్యవహార్యపి శీతలః,
పరార్థేష్వివపూర్ణాత్మా సజీవన్ముక్తఉచ్యతే. ౭౮.

తా. సకలమైన విషయములయందు వ్యవహరించుచు నుండినను, పరులదానివలె (ఇతరుల వస్తువులయందు తనకు సంబంధములేని యట్లు) శాంతుఁడుగను, పూర్ణాత్ముఁడుగను (ఏకొఱఁతయు లేనివాఁడుగను), ఉండువాఁడెవఁడో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. చైత్యవర్జితచిన్మాత్రే పదే పరమపావనే,
అక్షుబ్ధచిత్తో విశ్రాంత స్సజీవన్ముక్తఉచ్యతే. ౭౯.

తా. చిత్తముయొక్క సకలవ్యాపారములు లేని చిన్మాత్రమైన పరమపావన పదమందు (పరిశుద్ధమైన స్థానమునందు) ఎవఁడు నిశ్చల మనస్కుఁడై శాంతినొందియుండునో (సంకల్పరహితుఁడై యుండునో), వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. యోజాగర్తిసుషుప్తిస్థో యస్య జాగ్ర న్నవిద్యతే,
యస్య నిర్వాసనోబోధ స్సజీవన్ముక్తఉచ్యతే. ౮౦.

తా. ఎవఁడు సుషుప్తియందుండువాఁడైయుండియు మేల్కాంచినవాఁడుగా నుండునో, ఎవనికి మేల్కాంచి యుండుట యనునది లేదో, ఎవనియొక్క జ్ఞానము (విషయ) వాసనారహితమై యుండునో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. ఈప్సితానీప్సితేనస్తో యస్యాంతర్వృత్తి దృష్టిషు,
సుషుప్తివద్యశ్చరతి సజీవన్ముక్తఉచ్యతే. ౮౧.

తా. ఎవ్వఁడు, అంతరమైన మనోవృత్తి లక్ష్యములందు ప్రియాప్రియములు లేక, నిద్రయందున్నవానివలె సంచరించునో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. అహంకారమయీంత్యక్త్వా వాసనాం లీలయైవ యః,
తిష్ఠతి ధ్యేయ సంత్యాగీ సజీవన్ముక్తఉచ్యతే. ౮౨.

తా. ఎవఁడు విలాసముచేతనే అహంకారరూపమైన మలిన వాసనలను, ఉపాసనలను, లెస్సగా విడిచి, స్వస్వరూపమైన సహజామనస్కదశయందుండునో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. రాగద్వేషౌసుఖందుఃఖం ధర్మాధర్మఫలాఫలే,
యః కరోత్యనపేక్షైవ సజీవన్ముక్తఉచ్యతే. ౮౩.

తా. ఎవఁడు కామక్రోధములను, సుఖదుఃఖములను, పుణ్యాపాపములను, ఫలాఫలములను (లాభనష్టములను) కోరనివాఁడై, ప్రాప్తమైనదానినే చేయుచుండునో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

వి. శరీరము ప్రారబ్ధకర్మాధీనము గావున, ప్రాప్తించిన కర్మలుచేసినను, వానికి ఆకర్మలయొక్క ఫలమునందు అపేక్షలేకపోవుటవలన వాఁడు జీవన్ముక్తుఁడే యగుచున్నాఁడని భావము. అనఁగా ఫలసహిత కర్మము కూడదని అభిప్రాయము.

శ్లో. మౌనవాన్నిరహంభావో నిర్మానోముక్తమత్సరః,
యః కరోతిగతోద్వేగ స్సజీవన్ముక్తఉచ్యతే. ౮౨.

తా. ఎవఁడు మౌనవంతుఁడును (నియమింపఁబడినవాక్కు కలవాఁడును), నే ననెడి యభిమానము లేనివాఁడును, తన్ను ఇతరులు సత్కరింపవలయునని కోరనివాఁడును, మత్సరము లేనివాఁడును, సుఖదుఃఖాది సంతాపము లేనివాఁడును, సర్వకార్యములను ప్రారబ్ధానుసారముగ తత్ఫలమును గోరక చేయువాఁడును, జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. సర్వత్రవిగతస్నేహో యస్సాక్షివ దవస్థితః,
నిరిచ్ఛోవర్తతేకార్యే సజీవన్ముక్తఉచ్యతే. ౮౩.

తా. ఎవఁడు సర్వత్ర స్నేహమును విడిచిపెట్టఁబడినవాఁడును (దారా పుత్త్ర గృహ విత్తాదులయం దాశ లేనివాఁడును), సర్వకార్యములను సాక్షిగా చూచువాఁడును, దేహయాత్రార్థమైన స్నానభిక్షాది కర్మలయందు పరేచ్ఛానుసారముగ వర్తించువాఁడును (తనకు ఇచ్ఛలేక పోయినను ప్రారబ్ధప్రకారము పరులచేఁ గల్గినదానిని గ్రహించువాఁడును) నై యుండునో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. యేన ధర్మమధర్మంచ మనోమనన మీహితమ్,
సర్వమంతఃపరిత్యక్తం సజీవన్ముక్తఉచ్యతే. ౮౪.

తా. ఎవనిచేత వేదశాస్త్రములందు చెప్పఁబడిన నిత్యనైమిత్తికములైన విహితకర్మానుష్ఠానమును, అశాస్త్రీయమైన అహితకర్మత్యాజ్యమును,

(తద్విషయమై) మనస్సునందు తలంపును, తత్ వాంఛయును, విడిచిపెట్టఁబడెనో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

వి. జీవన్ముక్తునకు శాస్త్రవిహితమైనట్టియు, శాస్త్రనిషిద్ధమైనట్టియు కర్మలును, వానియొక్క తలంపును, వానియం దభిలాషయు నుండదని భావము.

శ్లో. యావతీ దృశ్యకలనా సకలేఽయం విలోక్యతే,
సా యేన సుష్ఠు సంత్యక్తా సజీవన్ముక్త ఉచ్యతే. ౮౭.

తా. ఎవ్వనిచేత ఈ కనఁబడునట్టి సకలమైన ప్రపంచకల్పనము ఎంత సత్తకలదిగా చూడఁబడుచున్నదో, ఆ మాయామయ ప్రపంచకల్పనముయొక్క మిథ్యాత్వాది దోషములను చూచి లెస్సగా విడిచిపెట్టఁబడినదో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

వి. జ్ఞాని, ఈ ప్రపంచమును గంధర్వనగరమును స్వప్నప్రపంచమునువలె పరిశీలించి మిథ్యామాత్రముగను, అనిత్యముగను, భావించి త్యజించునని భావము.

శ్లో. కట్వామ్లలవణంతిక్త మమృష్టం మృష్టమేవచ,
సమమేవచ యో భుంక్తే సజీవన్ముక్త ఉచ్యతే. ౮౮.

తా. ఎవఁడు కారము, పులుసు, ఉప్పు, చేదు, షడ్రసోపేతము గాని అన్నము, షడ్రసోపేతమైన అన్నము, వీనిని సమానముగాఁ జూచి యనుభవించునో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

వి. జీవన్ముక్తుఁడు దేహయాత్రకై ఎప్పుడేవిధమైన యన్నము దొరకినను రుచిచూడక గ్రహించును. ఈ యర్థము శ్రీశంకరాచార్య విరచిత అద్వైతోపదేశ పంచరత్నమునందు "క్షుద్వ్యాధిశ్చ" అను శ్లోకమునందు, స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది.

శ్లో. ధర్మాఽధర్మౌసుఖందుఃఖం తథా మరణ జన్మనీ,
ధియా యేన సుసంత్యక్తం సజీవన్ముక్త ఉచ్యతే. ౮౯.

తా. ఎవనిచేత నిత్యానిత్యవివేకజ్ఞానముచే (ప్రపంచము మిథ్య యనియును బ్రహ్మము సత్యమనియును కల్గినవివేకముచే) విహితకర్మ నిషిద్ధ కర్మములను, సుఖదుఃఖములను, జననమరణములను, చక్కఁగాఁదెలిసి విడిచిపెట్టఁబడినవో, వాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. క్రియానాశాద్భవేచ్చింతా నాశోఽస్మాద్వాసనాక్షయః,
వాసనాప్రక్షయో మోక్షః స్సజీవన్ముక్తిరిష్యతే. ౯౦.

తా. కర్మనాశమువలన దుఃఖ (చింతా) నివృత్తియును, చింతలు నశించుటవలన వాసనా (మలినవాసనా) నాశమును, వాసనలు నిశ్శేషముగా నశించుటవలన మోక్షమును కల్గుచున్నది. ఇదే జీవన్ముక్తియని యంగీకరింపఁబడుచున్నది.

అవ. జీవన్ముక్తులు ఏకార్యమును జేయరా? యని ప్రశ్నించిన శిష్యునకు ఆచార్యుం డిట్లు బోధించుచున్నాఁడు.

శ్లో. జీవన్ముక్తా నజీవంతి సుఖదుఃఖరసస్థితే,
ప్రకృతేనాఽథకార్యేణ కించిత్కుర్వంతివానవా. ౯౧.

తా. జీవన్ముక్తులు సుఖదుఃఖములయొక్క అనుభవము నందుండరు. అయినను ప్రకృతిసంబంధమైన కార్యములు కొంచెము చేయుచున్నారు. కొంచెము చేయరు.

వి. జీవన్ముక్తులు, ఇష్టానిష్టములనుగూర్చి సంతోషమును దుఃఖమును బొందరనియును, ప్రపంచసంబంధమైన కార్యములు కొన్నిటిని చేయుదురనియును, కొన్నిటిని చేయరనియును భావము.

శ్లో. పార్శ్వస్థబోధితాస్సంతః పూర్వాచారక్రమాఽగతమ్,
ఆచారమాచరంతేవ సప్తబుద్ధవ దుత్థితాః. ౯౨.

తా. (జీవన్ముక్తులు) సమీపమున నుండువారిచేత తెలుపఁబడినవారై పూర్వాచారములయొక్క క్రమముచే వచ్చినట్టి జాత్యుచితధర్మమును నిద్రనుండి మేల్కాంచిన వారివలె లేచి చేయుచునే యుందురు.

వి. ఇట్లుచేయుట లోకహితార్థంబని యెఱుంగవలయును.

శ్లో. సద్బ్రహ్మణిస్థిరే స్ఫారే పూర్ణే విషయవర్జితే,
ఆచార్యశాస్త్రమార్గేణ ప్రవిశ్యాశు స్థిరోభవ. ౬౩.

తా. స్థిరముగను, మహత్తుగను, పూర్ణముగను, విషయరహితము గను నుండునట్టి సత్తైన బ్రహ్మమునందు ఆచార్యుఁడు, శాస్త్రము, (ఆచార్యోపదేశప్రకారమును, శాస్త్రసిద్ధమును) అగు నీమార్గముగా శీఘ్రమున ప్రవేశించి దానియందు స్థిరముగా నుండుము.

అవ. ఇట్లు ఆచార్యుఁడు జీవన్ముక్తిలక్షణంబును బోధింపఁగావిని, శిష్యుఁడు, ఆచార్యునింజూచి, స్వామీ! విదేహముక్తిలక్షణంబును ఉపదేశింపుఁడని వేఁడఁగా, ఆచార్యుం డిట్లనుచున్నాఁడు.

విదేహముక్తి లక్షణము.

శ్లో. జీవన్ముక్తపదం త్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే,
విశత్య దేహముక్తత్వం పవనోఽస్పందతామివ. ౬౪.

తా. జీవన్ముక్తుఁడు తన శరీరమును (ప్రారబ్ధప్రతిభాస శరీరమును) కాలాధీనముచేసి, చలనస్వభావముగల వాయువును స్తంభించి, మైత్ర్యాది గుణసహితంబైన సత్త్వోపాధిని విడిచి, విదేహముక్తిని బొందును.

వి. సత్త్వోపాధికలవాఁడు జీవన్ముక్తుఁడు. సత్త్వోపాధి (సత్త్వశేషము) లేనివాఁడు విదేహముక్తుఁడు. విదేహుఁడనఁగా, దేహములేనివాఁడు. దేహములేనివాఁడనఁగా, జననమరణములు లేనివాఁడని భావము. చలనస్వభావముగల వాయువును స్తంభించునట్లుచేయుట యోగముచేతనే యని తెలియఁదగినది.

శ్లో. విదేహముక్తోనోదేతి నాఽస్తమేతి నశామ్యతి,
నసన్నాఽసన్నదూరస్థో నచాఽహం నచనేతరః. ౬౫.

తా. విదేహముక్తుఁడు ఉదయింపఁడు (పుట్టఁడు). అస్తమింపఁడు (మరణము నొందఁడు). ఎల్లప్పుడు వెలుఁగుచుండును. సత్తుకాఁడు.

అసత్తుకాఁడు. దూరమునందుండు వాఁడుకాఁడు. నీవు, నేను, వాఁడు, అనెడి వ్యవహారములు లేనివాఁడు.

వి. విదేహముక్తునకు శరీరోపాధులు లేవు కనుక, నీవు నేను వాఁడు అనెడి వ్యవహారములు లేవు. అని భావము. ఇదే తురీయాతీతదశ యని యెఱుఁగునది.

అవ. శిష్యుఁడు ఆచార్యునింజూచి, స్వామీ! ఇట్టి స్థితి యెట్లు కల్గునని యడుగఁగా, ఆచార్యుఁడు మహావాక్యవిచారముచేఁ గల్గునని చెప్పఁగా, శిష్యుఁడు తద్విషయము నుపదేశింపుఁడని ప్రార్థింపఁగా, ఆచార్యుం డిట్లనువదించుచున్నాఁడు.

## మహావాక్య మహిమ.

శ్లో. వేదాంతానాం మహావాక్య శ్రవణేన తథైవచ,
మననేన తథా దేవ ధ్యానేన పరమాత్మనః ౯౬.
ప్రత్యక్ బ్రహ్మైక్యతాజ్ఞానం లబ్ధ్వాయాతి పరంపదమ్.

తా. వేదాంతములయొక్క మహావాక్యమును వినుటవలనను, మననము చేయుటవలనను, ప్రకాశ స్వరూపియైన పరమాత్మయొక్క ధ్యానమువలనను, జీవబ్రహ్మైక్యము నొంది ఉత్తమమైన పరమపదమును (మోక్షమును) బొందుచున్నాఁడు.

శ్లో. మహావాక్యప్రకరణం సాక్షాచ్ఛివమయం పరమ్,
ముముక్షూణాంచవక్తవ్యం నాన్యేషాంచకథంచన. ౯౭.

తా. శ్రేష్ఠమైనదియును సాక్షాత్ శివరూపమైనదియు నగు మహావాక్య ప్రకరణమును ముముక్షువులకు (మోక్షాపేక్ష కలవారికి) చెప్పఁదగినది. ఇతరులకు ఎప్పుడును చెప్పఁగూడదు.

## మహావాక్యచతుష్టయము.

శ్లో ప్రజ్ఞానంబ్రహ్మచేత్యాది మహావాక్యచతుష్టయమ్,
మహావాక్యచతుర్వాక్యం ఋగ్యజుస్సామసంభవమ్. ౯౮.



తా. "ప్రజ్ఞానంబ్రహ్మ" అను నీ మొదలగు నాలుగువాక్యములు మహావాక్యము లనఁబడును. ఈ నాలుగు మహావాక్యములు ఋక్, యజుస్, సామము, అను వేదములయందుండి పుట్టినది.

వి. ఋగ్వేదముతోఁజేరిన ఐతరేయోపనిషత్తునందు "ప్రజ్ఞానం బ్రహ్మ" అనియును; యజుర్వేదముతోఁ జేరిన బృహదారణ్యకోపనిషత్తునందు "అహం బ్రహ్మాస్మి" అనియును; సామ వేదముతోఁజేరిన ఛాందోగ్యోపనిషత్తునందు "తత్త్వమసి" అనియును; అథర్వణ వేదముతోఁజేరిన మాండూక్యోపనిషత్తునందు "అయమాత్మాబ్రహ్మ" అనియును; చెప్పంబడియున్నది.

పై శ్లోకమునందు అథర్వణవేదము పఠింపఁబడలేదు. ఈ వేదము పై మూడింటియందలి మంత్రభాగముగాన వేఱుగాఁ జెప్పలేదని తెలియనది.

1. ప్రజ్ఞానంబ్రహ్మ. అనఁగా, శ్రేష్ఠమైన జ్ఞానమే బ్రహ్మము. ఇది బ్రహ్మలక్షణమును జెప్పునట్టి వాక్యము.

2. అహంబ్రహ్మాస్మి. అనఁగా, నేను బ్రహ్మముగా నున్నాను. ఇది గురూపదేశ మొందిన శిష్యుఁడు, ఉపదేశింపఁబడిన విషయములను తానై చక్కఁగా నాలోచించి అందుచేఁ గల్గిన యనుభవముచే, 'నేనేబ్రహ్మము' అనెడి జ్ఞానమును బొందినాఁడను; అని భావించునట్టి వాక్యము.

3. తత్త్వమసి. అనఁగా, అది నీవై యున్నావు. ఇట్లు గురువు శిష్యునకు నీవు బ్రహ్మముగ నున్నావు. అని తెలియఁజేయునట్టి వాక్యము.

4. అయమాత్మాబ్రహ్మ. అనఁగా, ఈ ఆత్మ బ్రహ్మము. అని గురువు శిష్యునకు దేహమందుండు నీ యొక్క ఆత్మయే బ్రహ్మము; అని గుఱ్ఱించి తెలియఁజేసినట్టి వాక్యము.

ఈ విషయము బహ్వృచోపనిషత్, హయగ్రీవోపనిషత్, పైంగలోపనిషత్, మొదలగు వానియందును చెప్పంబడియున్నది.

అవ. శిష్యుఁ డాచార్యునింగాంచి, స్వామీ! మహావాక్య బోధము వలన "బ్రహ్మము నేను" అని తెలియ నయ్యెను. అయినను తన్నిర్దేశ్యము నాకెప్పుడు కల్గును? అని యడుగఁగా ఆచార్యుం డిట్లనుచున్నాఁడు.

## బ్రహ్మము అనిర్దేశ్యము.

శ్లో. నిత్యాభ్యాసనశీలస్య సుసంవేద్యం హి తద్భవేత్,
తత్సూక్ష్మత్వా దనిర్దేశ్యం పరంబ్రహ్మసనాతనమ్. ౯౯.

తా. ఆ బ్రహ్మము ప్రతినిత్యమును అభ్యసించు స్వభావముగలవానికి చక్కఁగాఁ దెలియును. ఆ సనాతనమైన (అనాదియైన) పరబ్రహ్మము సూక్ష్మముగా నుండుటవలన ఇట్టిదని చెప్పుటకు సాధ్యము కాదు.

## బ్రహ్మము అనుభవైకవేద్యము.

శ్లో. స్వసంవేద్యంహితద్బ్రహ్మ కుమారీమైథునంయథా,
అయోగీనైవజానాతి జాత్యంధోహి యథాఘటమ్.౧౦౦.

తా. పుత్త్రికా సంయోగమువలెనే ఆబ్రహ్మమును స్వయముగాఁ దెలియఁదగినది. గ్రుడ్డివాఁడు కుండను తెలిసికొనని యట్లే యోగికాని వాఁడు బ్రహ్మము నెఱుంగఁడు.

వి. పుత్త్రికా సంయోగ మనఁగా,ఒకానొకగృహంబునందు ఒక కుమార్తెయును దాని తలిదండ్రులును వసించియుండిరి. ఈకుమార్తె పిన్న వయస్సుకలదిగా నుండినందున తల్లినింజూచి, అమ్మా! నీవు నాయన ప్రక్కన పరుండెదవేల? యని మాటిమాటికి అడుగుచుండెను. దానితల్లి, మాఱుపల్కకుండెను. కొన్నిదినములకు ఈకన్యకకు వివాహంబై యుక్త కాలంబున గర్భాధానంబయ్యెను. ఆ దినము మొదలు ఈ ప్రస్తావమును మానుకొనెను. అట్లె స్వానుభవంబుచేతను యోగంబుచేతను బ్రహ్మం బెఱుకపడవలయునేగాని, చెప్పుటకు సాధ్యముకాదని భావము.

ఓం తత్సత్

రాజయోగరత్నాకరమునందు
తృతీయప్రకరణము ప్రబోధప్రకరణము
సంపూర్ణము.

ఓమ్.
శ్రీనివాస పరబ్రహ్మణేనమః.

# రాజయోగరత్నాకరము.

తాత్పర్యసహితము.

## యోగప్రకరణము.

### అవతారిక.

ఆచార్యుఁడు, యోగముచేతనే పరబ్రహ్మంబు నెఱుంగఁదగినదియని బోధించినందున, శిష్యుఁడు తల్లక్షణంబు నుపదేశింపుఁడని ప్రార్థింపఁగా, ఆచార్యుం డిట్లనుచున్నాఁడు.

### యోగసిద్ధిక్రమము.

శ్లో. అభియోగాత్తదభ్యాసా త్తస్మిన్నేవచ నిశ్చయాత్,
పునఃపునశ్చనిర్వేదా ద్యోగస్సిద్ధ్యతినాఽన్యథా. ౧.

తా. ఆసక్తివలనను, దానియొక్క (యోగముయొక్క) అభ్యాసమువలనను, యోగమందలి నిశ్చయమువలనను, మాటిమాటికి అనుతాపమొందుటవలనను, యోగము సిద్ధించుచున్నది. వేఱువిధముగా సిద్ధింపదు.

వి. అనుతాపమనఁగా, సంసారబంధమునుండి విముక్తి నొందవలయు ననెడిబుద్ధి యని భావము.

శ్లో. ఆత్మచింతావినోదేన శౌచక్రీడన కేన చ,
సర్వభూతసమత్వేన యోగస్సిద్ధ్యతినాఽన్యథా. ౨.

తా. ఆత్మచింతయనెడి వినోదముచేతను, శౌచమనెడిక్రీడచేతను, సమస్తప్రాణులను సమముగాఁ జూచుటచేతను, యోగము సిద్ధించుచున్నది. వేఱువిధముగా సిద్ధింపదు.

వి. కొందఱు శౌచాదులనావశ్యకము లని యంద్రుడు. బాహ్యాంతర శౌచములు రెండును యోగసిద్ధి ప్రదాయకములై యున్నవి యని గ్రహింపవలయును. “శ్లో. ధ్యానం శౌచం తథా భిక్షా నిత్యమేకాంత శీలతా, భిక్షోశ్చత్వారి కర్మాణి పంచమో నోపపద్యతే. అనఁగా పరమాత్మధ్యానమును, బాహ్యాంతర శౌచమును, సదా ఏకాంతవాసమును, భిక్షయు అను నీ నాలుగును సన్న్యాసియొక్క కర్మములు, అయిదవది గలుగనేరదు. అని చెప్పఁబడియున్నది. భిక్షమనఁగా, “శ్లో. అద్వైతభావనా భైక్ష్యమభక్ష్యం ద్వైతభావనమ్,” అనఁగా, అద్వైతభావనయే భిక్షము. (దీనినే భుజింపవలయును). ద్వైతభావనము భక్షింపఁదగినది కాదు. అని భావము.

శ్లో. యశ్చాత్మనిరతోనిత్య మాత్మక్రీడ స్తథైవచ,
ఆత్మానందస్య సతతం ఆత్మన్యేవ స్వభావతః. ౩.
రతశ్చైవ స్వయంతుష్టః సంతుష్టోనాన్యమానసః,
ఆత్మన్యేవసుతృప్తోఽసౌ యోగ స్తస్యప్రసిద్ధ్యతి. ౪.

తా. ఆత్మనిష్ఠునకును, ఆత్మయందభిరుచికలవానికిని, సదా ఆత్మానందము కలవానికిని, ఆత్మయందే స్వభావముగా క్రీడించువానికిని, సంతోషచిత్తము కలవానికిని, సంతృప్తినొందియుండువానికిని, విషయాదులయందు మనస్సును పోనీయకుండువానికిని, ఆత్మయందే తృప్తికలవానికిని, ఈ యోగము సిద్ధించుచున్నది.

అవ. ఇట్లుపదేశించి యోగమును అందఱియొద్ద తెలిసికొనరాదని బోధించుచున్నాఁడు.



## యోగవంచక లక్షణము.

శ్లో. విషయేంద్రియసంయోగం కేచిద్యోగం వదంతి హి,
అధర్మో ధర్మరూపేణ గృహీతస్తైరపండితైః. ౫.

తా. కొందఱు శబ్ద స్పర్శ రూప రస గంధములనెడి విషయముల తోడి శ్రోత్ర త్వక్చక్షు ర్జిహ్వా ఘ్రాణములనెడి యింద్రియములయొక్క సంయోగమును యోగమని చెప్పుచున్నారు. ఇట్లు అధర్మము ధర్మముగా తెలివిలేనివారిచే గ్రహింపఁబడి యున్నది.

వి. అనఁగా విషయములకు ఇంద్రియములతోడి సంబంధమే యోగమని మూఢులచేత చెప్పఁబడుచున్నదని భావము.

శ్లో. మనసశ్చేంద్రియస్యైవ సంయోగంచ తథా పరే,
ఉక్తానామధికాహ్యేతే కేవలం యోగవంచకాః. ౬.

తా. ముందుచెప్పినవారివలె మఱికొందఱు, మనస్సుతోడి ఇంద్రియములయొక్క సంయోగమునే యోగమని చెప్పుచున్నారు. ఇట్లు చెప్పనట్టివారు యోగవంచకులలో శ్రేష్ఠులు.

అవ. యోగమిట్టిదని నిర్వచించుచున్నాఁడు.

## యోగ నిరూపణము.

శ్లో. వృత్తిహీనం మనఃకృత్వా క్షేత్రజ్ఞం పరమాత్మని,
ఏకీకృత్య విముచ్యేత యోగోయంముఖ్యఉచ్యతే. ౭.

తా. మనస్సును వృత్తిరహితముగాఁ జేసికొని పరమాత్మతో జీవాత్మను ఐక్యముచేసి ముక్తుఁడగుచున్నాఁడు. ఈ యోగమే శ్రేష్ఠమైనదిగాఁ జెప్పఁబడుచున్నది.

వి. జీవాత్మపరమాత్మల ఐక్యమే యోగమనిభావము.

అవ. శిష్యుఁడు, ఈ యోగము నెచ్చటనుండి యెట్లు అభ్యసింపవలయు నని యడుగఁగా, ఆచార్యుం డుపదేశించుచున్నాఁడు.

శ్లో. నారణ్యసేవనాద్యోగో నానేకగ్రంథచింతనామ్,
వ్రతైర్యజ్ఞైస్తపోభిశ్చ నయోగః కస్యచిద్భవేత్. ౮.

తా. అడవియం దుండుట వలనను, అనేకములైన గ్రంథములను జదువుటవలనను, వ్రతముల ననుష్ఠించుటవలనను, యాగములు చేయుట వలనను, ఎవనికిని యోగసిద్ధి కలుగదు.

వి. అనఁగా పైనచెప్పిన వానివలన యోగము కలుగదనియును, సదాభ్యాసముచేయుటవలననే యోగము కలుగుననియును భావము.

శ్లో. బహిర్ముఖానిసర్వాణి కృత్వాచాభిముఖాని వై,
సర్వం చేవేంద్రియగ్రామంమనశ్చాత్మనియోజయేత్.

తా. బహిర్ముఖ వ్యాపారములు గలిగిన సకలేంద్రియములను అంతర్ముఖ వ్యాపారములు గలవానినిగాఁ జేసికొని, సమస్తేంద్రియ సమూహమును, మనస్సును, ఆత్మయందు చేర్పవలయును.

వి. ఆత్మావలోకనమునందె ఇంద్రియములను మనస్సును నుంపవలయునని భావము.

అవ. పైనజెప్పిన విధముగా మనస్సు నుంచనివారికి మోక్షము సిద్ధింపదని తెలియఁజేయుచున్నాఁడు.

శ్లో. విషయాసక్తచిత్తోహి యాతిమోక్షం నవిందతి,
యత్నేన విషయాసక్తిం తస్మాద్యోగీవివర్జయేత్. ౧౦.

తా. విషయాదులయందు మనస్సును పోనిచ్చువాఁడు ముక్తిని జెందఁడు. కావున యోగాభ్యాసి ప్రయత్నముచేత విషయానురాగమును విసర్జింపవలయును.

వి. విషయాదులయందు మనస్సును పోనిచ్చువాఁడు నరకమును బొందునని భావము.

అవ. మనస్సును విషయాదులనుండి మఱల్చుట మిగుల ప్రయాసమని బోధించుచున్నాఁడు.



## ఇంద్రియ బలము.

శ్లో. సత్త్వోద్రిక్తాసురాశ్చాపి విషయేణ వశీకృతాః,
ప్రమాదిభిస్తమస్సత్త్వైర్మానుష్యైరత్ర కాకథా. ౧౧.

తా. సత్త్వగుణాధిక్యముగల దేవతలుకూడ విషయములయందుండి ఇంద్రియములను స్వాధీనపఱుచుకొనక పోయిరి. ప్రమాదముగల తమోగుణ ప్రధానులైన మనుష్యులనుగూర్చి చెప్పవలసిన దేమున్నది?

వి. దేవతలకే విషయవాంఛలు విడువవనియును, మనుష్యులమాట యిఁక చెప్ప నేమున్నది? యనియును భావము. సత్త్వగుణముయొక్క మధ్యమగతి దేవతాజన్మమనియును, తమోగుణముయొక్క ఉత్తమగతి మనుష్య జన్మమనియును మనుస్మృతి ద్వాదశాధ్యాయంబునఁ జెప్పఁబడి యున్నది. దేవతలకు విషయవాంఛలు మానలేదనుటకు బృహస్పతి, చంద్రుఁడు, ఇంద్రుఁడు, కుబేరుఁడు, మొదలగువారి చరిత్రములే తార్కాణగా నున్నవి.

శ్లో. ఇంద్రియాణాంతుసర్వేషాం యద్యేకంక్షరతీంద్రియమ్,
తేనాస్యక్షరతిప్రజ్ఞా దృతేః పాదాదివోదకమ్. ౧౨.

తా. ఇంద్రియములలో నేదేని యొక యింద్రియమైనను స్వాధీనముకాక విషయములయందు సంచరించుచుండు నెడల, జ్ఞానము ఓటికుండలోని నీరువలె కొంచెము కొంచెముగా తరిగి పోవును.

అవ. ఆచార్యుఁడు ఇట్లుపదేశించి, యోగియొక్క చిత్తవృత్తి లక్షణమునుగూర్చి వివరించుచున్నాఁడు.

### యోగి షడ్గులక్షణము.

శ్లో. అజిహ్వష్షండకఃపంగు రంధో బధిర ఏవ చ,
ముగ్ధశ్చముచ్యతేయోగీ షడ్భిరేతైర్నసంశయః. ౧౩.



తా. యోగియైనవాఁడు మూఁగవాఁడును, నపుంసకుఁడును, కుంటివాఁడును, గ్రుడ్డివాఁడును, చెవిటివాఁడును, జడుడును అను నీయాఱు గుణములతోఁ గూడినవాఁడై యందునెడల నిస్సంశయముగా (బంధము నుండి) విడివడును. అనఁగా, మోక్షము నొందును.

## అజిహ్వ లక్షణము.

శ్లో. ఇదం మృష్ట మిదం నేతి యోశ్నన్నపి న సజ్జతి,
హితంసత్యంమితంవక్తి త మజిహ్వం ప్రచక్షతే. ౧౪.

తా. భోజనము చేయునప్పుడు ఇది రుచికలదిగా నున్నదనియును, ఇది అరుచిగా నున్నదనియును, తలంపనివాఁడును; హితముగను, సత్యముగను, మితముగను, భాషించువాఁడును; నైయుండువానిని అజిహ్వుఁడు (మూగవాఁడు) అని చెప్పెదరు.

## షండ లక్షణము.

శ్లో. అద్యజాతాం యథానారీం తథా షోడశవార్షికీమ్,
శతవర్షాంచ యోదృష్ట్వా నిర్వికారస్సషండకః. ౧౫.

తా. ఇపుడు జన్మించిన స్త్రీని, నూఱుసంవత్సరముల వయస్సుగల స్త్రీని, జూచి యెట్లు వికారము జెందుటలేదో; అట్లు పదునాఱు సంవత్సరముల వయస్సుగల స్త్రీనిజూచినను వికారము నొందని చిత్తముగల వాఁ డెవఁడో వాఁడే నపుంసకుఁడు.

## పంగు లక్షణము.

శ్లో. భిక్షార్థమటనంయస్య విణ్మూత్రకరణాయచ,
యోజనాన్నపరంయాతి సర్వథా పంగురేవ సః. ౧౬.

తా. భిక్షకొఱకును, జల మల విసర్జనముకొఱకును, ఎవని యొక్క సంచారము ఒక్కయోజనము దూరమునకంటె అధికముగుటలేదో, వాఁడే సర్వవిధములచేతను పంగు (కుంటివాఁడు). (అనఁబడును).



## అంధక లక్షణము.

శ్లో. తిష్ఠతో వ్రజతో వాపి యస్య చక్షుర్న దూరగమ్,
చతుర్యుగాంభువంముక్త్వా మహాత్మాసోంధఉచ్యతే. ౧౭.

తా. నిలిచినను, నడిచినను, ఎవనియొక్క దృష్టి నాలుగుమూరల (కాడిమ్రాఁకుల) దూరమునకంటె నధికముగాఁ బోవుటలేదో, అట్టి మహాత్ముఁడు అంధకుఁడు (గ్రుడ్డివాఁడు); అని చెప్పఁబడుచున్నాఁడు.

## బధిర లక్షణము.

శ్లో. హితాహితంమనోరామం వచశ్శోకావహంతుయత్,
శ్రుత్వాపి నశ్శృణోతీవ బధిర స్సప్రకీర్తితః. ౧౮.

తా. హితము, అహితము, సంతోషము, వ్యసనము, అను వీనిని కలుగఁజేయు వార్తలను వినినను, విననివానివలె నుండువాఁడు, బధిరుఁడు (చెవిటివాఁడు), అని చెప్పఁబడుచున్నాఁడు.

## జడ లక్షణము.

శ్లో. సాన్నిధ్యేవిషయాణాంయః సమర్థో వికలేంద్రియః,
సుప్తవద్వర్తతే నిత్యం సయోగీ ముగ్ధఉచ్యతే. ౧౯.

తా. విషయములు సమీపమునందుండినను వానియందు చలింపని యింద్రియములు కలవాఁడుగను (ఇంద్రియములను విషయములందు పోనీయనివాఁడును), నిద్రపోవువానివలె నెప్పుడు నుండువాఁడును, అగు యోగి జడుడని చెప్పఁబడుచున్నాఁడు.

అవ. ఇవ్విధముగా నుపదేశించి, యోగసిద్ధి కలుగుటకు పరంపరా కారణం బిదియని నిరూపించుచున్నాఁడు.

శ్లో. నిర్మమత్వంవిరాగాయ వైరాగ్యాద్యోగసంగతిః,
యోగాశ్చజాయతే జ్ఞానం జ్ఞానాన్ముక్తిఃప్రజాయతే. ౨౦.

తా. నిర్మోహమువలన వైరాగ్యమును, వైరాగ్యమువలన యోగ మును, యోగమువలన జ్ఞానమును, జ్ఞానమువలన ముక్తియును కల్గును.

వి. "యోగోపిజ్ఞానహీనస్తు నక్షమో మోక్షకర్మణి, తస్మాత్ జ్ఞానంచ యోగంచ ముముక్షు ర్దృఢమభ్యసేత్" అని యోగతత్త్వోప నిషత్తునందు చెప్పంబడియున్నది.

## యోగ భేదములు.

శ్లో. మంత్రయోగోలయశ్చైవ రాజయోగో హఠస్తదా,
యోగ శ్చతుర్విధః ప్రోక్తో యోగిభి స్తత్త్వదర్శిభిః. ౨౧.

తా. అపరోక్షజ్ఞానముగల యోగులచేత మంత్రయోగము, లయ యోగము, రాజయోగము, హఠయోగము, అని నాలుగువిధములుగాఁ జెప్పఁబడియున్నది.

వి. మంత్రయోగమనఁగా, మాతృకలతోఁ గూడినట్టి (ఏకాక్షరీ, పంచాక్షరీ, అష్టాక్షరీ) మంత్రములను పండ్రెండు సంవత్సరములు జపించి అణిమాదిసిద్ధులతోఁగూడిన జ్ఞానము నొందుట.

లయయోగమనఁగా, సర్వకాల సర్వావస్థలయందును చిత్తమును పరమాత్మయం దుంచుట.

రాజయోగమనఁగా, మనస్సును వాయువును నిరోధించి, ప్రాణ వాయువును మూలాధారమునుండి లేపి, సుషుమ్నా మార్గముగా సహస్రార మునందు ప్రవేశింపఁజేసినచో, నాదబిందువులు లయమగును. అపుడు కల్గు నట్టి ఆనందమును సదా అనుభవించుచు, దానినే అభ్యసించుచు నుండుట. కొందఱు పంచజ్ఞానేంద్రియములను, వాగింద్రియమును, అగు నీ యా ఱింద్రియములను అండాండ పిండాండములుగాను, ఆజ్ఞేయసహస్రార చక్ర ములను బ్రహ్మాండముగాను జేసికొని, ఈ రెంటికిని ఐక్యము కలుగఁజేసి ఉపాసించుట రాజయోగ మని చెప్పెదరు. మఱిఁ గొందఱు నేత్రగోళ మును అండాండముగాను, కనుపాపను పిండాండముగాను, అందలి కళను

బ్రహ్మండముగాను జేసికొని, ఈ మూటిని ఐక్యముచేసి ఉపాసించుట రాజయోగమని చెప్పెదరు. దీనినే శుద్ధరాజయోగ మనియుం జెప్పుదురు.

హఠయోగ మనఁగా, జీవనాధారములైన ప్రాణాపాన వాయువులను (సూర్యచంద్ర నాడులను) ప్రాణాయామాది సాధనములవలన స్వాధీనము చేసికొనుట. కొందఱు, పృథ్వియనఁబడు అండాండమును, ఎనుబది నాల్గులక్షల జీవరాసు లనఁబడు పిండాండమును, ఆకాశమనెడు బ్రహ్మండమును అగు నీమూటిని ఐక్యముచేసి ఉపాసించుట హఠయోగమని చెప్పెదరు. ఈ విషయమును హఠయోగప్రదీపిక యందు గనందగును.

అవ. స్వామీ! ఈ యోగంబును, ఏజాతివారును, ఏవయస్సుకలవారును అభ్యసింపవలయునో దానిని తెలియ చేయుఁడని యడిగిన శిష్యునకు ఆచార్యుం డిట్లనుచున్నాఁడు.

## యోగాభ్యాసార్హులు.

శ్లో. బ్రాహ్మణక్షత్రియవిశాం స్త్రీశూద్రాణాంచపావనమ్,
శాంతయే కర్మణామన్య ద్యోగాన్నాస్తి విముక్తయే. ౨౨.

తా. బ్రాహ్మణులకును, క్షత్రియులకును, వైశ్యులకును, స్త్రీలకును, శూద్రులకును, సకలకర్మశాంతిమైనట్టి (అనఁగా సర్వకర్మ నివృత్తియైనట్టి) మోక్షము, పరిశుద్ధమైన యోగమునకంటె వేఱులేదు.

వి. అనఁగా సకలవర్ణస్థులకును యోగమే ముక్తి నొసంగునది యని భావము.

## యోగభ్యాస వయోనిర్ణయము.

శ్లో. యువావృద్ధోఽతివృద్ధోవా వ్యాధితో దుర్బలోఽపివా,
అభ్యాసా త్సిద్ధిమాప్నోతి సర్వయోగే ష్వతంద్రితః. ౨౩.

తా. యౌవనవంతుఁడైనను, వృద్ధుఁడైనను, అతివృద్ధుఁడైనను, సర్వయోగములందును (మంత్ర లయ హఠ రాజయోగములనుగాని, లేక

యోగాంగములను గాని) సోమరితనము లేక అభ్యాసము చేయుటవలన సిద్ధిని (యోగసిద్ధిని, లేకముక్తిని, లేక సమాధిని) బొందును.

అవ. ఆచార్యుఁడు యోగియొక్క కృత్యమును నిర్వచించుచున్నాఁడు.

## యోగి కృత్యము.

శ్లో. నధ్యాతవ్యం నవక్తవ్యం నకర్తవ్యం కదాచన,
ఏతైస్సర్వైస్సుసంపన్నో యోగీ భవతి నేతరః. ౨౮.

తా. యోగియైనవాఁడు విషయచింతనము చేయఁగూడదు. విషయముల నుచ్చరింపఁగూడదు. ఒకానొకప్పుడైనను విషయోపభోగములను చేయఁగూడదు. ఇట్టివాఁడే యోగి యనఁబడును. వీని నతిక్రమించి వర్తించువాఁడు యోగి కాఁడు.

వి. అనఁగా, యోగియైనవాఁడు విషయచింతనమునువదలి తత్త్వార్థచింతనమును జేయవలయునని భావము.

అవ. తత్త్వార్థచింతనముయొక్క ప్రయోజనమునుగూర్చి అనువదించుచున్నాఁడు.

శ్లో. తత్త్వార్థజ్ఞానాద్విజ్ఞానం విజ్ఞానాత్ప్రత్యయం తథా,
ప్రత్యయాద్భావశుద్ధిస్స్యాత్ భావనాత్పరమంపదమ్. ౨౫.

తా. తత్త్వార్థజ్ఞానమువలన (ఇది వస్తువు, ఇది సత్యము, అనునట్టి వివేకస్థితివలన) విజ్ఞానము (ఉత్తమజ్ఞానము) కల్గును. విజ్ఞానమువలన వస్తుతత్త్వమునందు) నమ్మిక కలుగును. నమ్మికవలన చిత్తశుద్ధి కల్గును. చిత్తశుద్ధివలన ఉత్తమపదము (మోక్షము) కల్గును.

అవ. ఇట్టి ఉత్తమస్థితి యోగముచేత క్రమముగాఁ గలుగునని నిర్వచించి, యిప్పుడు తదంగములను బోధించుచున్నాఁడు.

## యోగాంగ నిరూపణము.

శ్లో. లయమంత్రహఠాయోగా యోగోహ్యష్టాంగసంయుతః,
యమశ్చ నియమశ్చైవ తథా చాసన మేవచ. ౨౬.

శ్లో. ప్రాణాయామ స్తథాపశ్చాత్ ప్రత్యాహార స్తథాపరమ్,
ధారణాచ తథా ధ్యానం సమాధి శ్చాష్టమోభవేత్. ౨౭.

తా. లయ, మంత్ర, హఠము లను నీత్రివిధయోగములును అష్టాంగ ములతోఁగూడినది. 1 యమము, 2 నియమము, 3 ఆసనము, 4 ప్రాణా యామము, 5 ప్రత్యాహారము, 6 ధారణము, 7 ధ్యానము, 8 సమాధి, అను నీ యెనిమిదియును యోగాంగము లగును.

వి. దేహేంద్రియముల వలనఁ గలుగువైరాగ్యము యమము. పరత త్త్వమునందు ఎడతెగక కలుగునట్టి అభిలాష నియమము. సర్వవస్తువుల యందును ఉదాసీనముగానుంచుట ఉత్తమమైన ఆసనము. ఈ సకల జగ మును మిథ్యగాఁదోఁచుట ప్రాణాయామము. చిత్తముయొక్క అంతర్ము ఖత్వము ప్రత్యాహారము. చిత్తముయొక్క నిశ్చయస్థితి ధారణము. అంతః భిన్నమాత్రమే నేనని చింతించుట ధ్యానము. ధ్యానమును చక్కఁగా మఱచుట సమాధి. అని రాజయోగులు చెప్పెదరు.

## యోగ షడంగము.

శ్లో. ప్రాణాయామ స్తథాధ్యానం ప్రత్యాహారస్తుధారణా,
తర్కశ్చైవ సమాధిశ్చ షడంగో యోగ ఉచ్యతే. ౨౮.

తా. ప్రాణాయామము, ధ్యానము, ప్రత్యాహారము, ధారణ, తర్కము, సమాధి, అనునివి యాఱును యోగషడంగ మని చెప్పఁబడు చున్నది.

వి. వ్యాహృతి ప్రణవాదులతోఁజేరిన గాయత్రిని ఓంకారముతో ముమ్మాఱు పఠించువఱకు ప్రాణవాయువును కుంభకమందునిల్పుట ప్రాణా యామ మనఁబడును. ఇట్లు ఒక్కదినము కుంభకమునందు వాయువును నిల్పుట ధ్యాన మనఁబడును. పండ్రెండు ప్రాణాయామములు చేయుట ప్రత్యాహార మనఁబడును. పండ్రెండు ప్రత్యాహారములు చేయుట ధారణ

యనఁబడును. సవికల్పక నిర్వికల్పక ధ్యానము తర్కు మనఁబడును. పంద్రెండు దినములు వాయువును కుంభించుట సమాధి యనఁబడును. ఇది సిద్ధసంప్రదాయము.

## యమ లక్షణము.

శ్లో. అహింసా సత్య మస్తేయం బ్రహ్మచర్యం దయార్జవమ్,
క్షమా ధృతి ర్మితాహార శ్శౌచం చేతి యమాదశ. ౨౯.

తా. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, దయ, ఆర్జవము, క్షమ, ధృతి, మితాహారము, శౌచము, అను నీపదియును యమ మనఁబడును.

వి. (1) వేదోక్తప్రకారముగాక అన్యవిధముగా మనోవాక్కాయములచే హింసచేయకుండుట అహింస.

(2) నేత్రాది ఇంద్రియములవలన చూచినవియు వినినవియు మొదలగువానిని దాఁచక చెప్పుట సత్యము.

(3) అన్యులయొక్క చెత్త రత్నము బంగారు ఇనుము మొదలగు వివస్తువును గ్రహింపఁ దలఁపకుండుట అస్తేయము.

(4) ఋతుకాలములయందు తనపత్నితోఁగలియుచు అన్యస్త్రీలను మాతృసమానముగా తలంచుట బ్రహ్మచర్యము. దీనిని అష్టవిధ మైథునరాహిత్య మని చెప్పుదురు.

అష్టవిధమైథునములనఁగా:— "శ్లో. స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్, సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిష్పత్తిరేవ చ, ఏత న్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః." అనఁగా, స్త్రీని తలంచుట, పొగడుట, క్రీడించుట, చూచుట, రహస్యముగా మాటలాడుట, ఉద్దేశించుట, నిశ్చయించుట, సంగమించుట, అను నీయెనిమిదియును మైథునము యొక్క అష్టాంగమని పెద్దలు చెప్పుచున్నారు. కనుక ఈ యెనిమిది విధములయం దేకృత్యముచేసినను దోషమే యని తెలియవలయును. కావుననే, "శ్లో. బ్రహ్మచర్యం సదారక్షే దష్టధా మైథునం త్యజేత్." అనఁగా, బ్రహ్మ

చర్యమును సదా కాపాడవలయును. అష్టవిధములైన మైథునములను విడువవలయును. అని చెప్పఁబడియున్నది. ఇయ్యది కేవలము బ్రహ్మచర్యవ్రతముగలవానికిని, బ్రహ్మచర్యాశ్రమమునుండియే సన్న్యాసమును స్వీకరించినవానికినిమాత్రమే యని యెఱుంగునది. గృహస్థుఁడు ఆత్మావలోకనాపేక్షచే యోగమును చేయనొప్పును. అట్టివాఁడు సమాధిసాధన కాలమునందు బ్రహ్మచర్యవ్రతము నవలంబించి వర్తింపవలయును. కేవలము గృహస్థుఁడగు యోగిమాత్రము ఋతుకాలముల యందు ధర్మపత్నీ సంగమము చేయనొప్పును. ఇట్లు చేయుట గృహస్థబ్రహ్మచర్యవ్రత మనఁబడును. సన్న్యాసిమాత్రము సర్వదా బ్రహ్మచర్యవ్రతస్థుఁడుగనే యుండవలయును.

(5) శత్రువులు మొదలగువారివలన తనకు దుఃఖముకలిగినప్పుడు మనస్సు చలింపకుండుట క్షమ.

(6) వేదములచేతనే సంసారనివృత్తియగుననియును, ఇతరముచే నివృత్తి కానేరదనియును కలిగిన తెలివి ధృతి (స్థిరత్వము).

(7) సకలజీవరాసులను తనవలెనే యని చూచుట దయ.

(8) పుత్త్రమిత్రకళత్రాదులయందును శత్రువులయందును తనయందును సదా సమభావన కలిగియుండుట ఆర్జవము.

(9) యోగమున కనుకూలమైన భోజనము అరకడుపును, జలము కాలుకడుపునుగాఁ గైకొనుట మితాహారము. "శ్లో॥ అనారోగ్యమనాయుష్య మస్వర్గ్యంచాతిభోజనమ్, అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్." అనఁగా, అధికమైనభోజనము వ్యాధిని, ఆయుఃక్షీణమును, స్వర్గభోగనాశమును, పుణ్యలోపమును, లోకదూషణమును కలుగఁజేయును. అని మనుస్మృతియందుఁ జెప్పఁబడి యున్నది. కాఁబట్టి, అతిభోజనమును వర్జించి మితాహారమును గైకొనవలయును.

(10) తనశరీరమునందలి మలమును మృత్తికాదులవలనను నీటితోను కడుగుట శౌచము. ఈ విషయము 72-వ పుటయందుఁ గనంబడును.



### శుద్ధరాజయోగ యమలక్షణము.

వి. (1) ఆత్మ అన్నిటియందును గలదనియును, ఛేదింపఁబడనిది అనియును, గ్రహింపఁదగినది యనియును, అనుబుద్ధి శ్రేష్ఠమైన అహింస యనఁబడును.

(2) సర్వజ్ఞుఁడైన బ్రహ్మమే సత్యము, తక్కినవి యన్నియును అసత్యములనెడి బుద్ధి సత్య మనఁబడును.

(3) ఆత్మయందు అనాత్మస్థితిగా వ్యవహరింపకుండుట అస్తేయ మనఁబడును.

(4) బ్రహ్మభావనయందు మనస్సు ప్రవేశించుట బ్రహ్మచర్య మనఁబడును.

(5) అరిషడ్వర్గములయందు మనస్సును పోనీయక అడ్డగించుట క్షమ యనఁబడును.

(6) నేను ఆత్మ, అన్యము కాదనెడి దార్ఢ్యబుద్ధి ధృతి యనఁబడును.

(7) సకలజీవులును తనవలెనే ఆత్మజ్ఞానపరులు కావలయు ననెడి యభిలాష దయ యనఁబడును.

(8) గురువులయందును శిష్యులయందును సమబుద్ధి గలిగియుండుట ఆర్జవ మనఁబడును.

(9) కాలదేశము ననుసరించి లభించిన దానిని స్వీకరించుట మితాహార మనఁబడును.

(10) నేను పరిశుద్ధుఁడ ననియెడి జ్ఞానము శౌచ మనఁబడును.

### నియమ లక్షణము.

శ్లో. తపస్సంతోషమాస్తిక్యం దానమీశ్వరపూజనమ్,
వేదాన్తశ్రవణం చైవ హ్రీర్మతిశ్చజపోవ్రతమ్. ౩౦.
ఏతే హి నియమాః ప్రోక్తా దశధైవ మహామతే.

తా. తపము, సంతోషము, ఆస్తిక్యము, దానము, ఈశ్వరపూజనము, వేదాన్తశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము, అను నీపదియును నియమ మనఁబడును.

౨. (1) వేదోక్త కృఛ్ఛ్రాదులచే శరీరశోషణముచేయుట తపము.

(2) లభించినదానితో తృప్తినొందుట సంతోషము.

(3) శ్రుతిస్మృతులయందు చెప్పఁబడిన వానిని విశ్వసించుట ఆస్తిక్యము.

(4) న్యాయమార్గముగా సంపాదించిన ధనమును భక్తుల కొసంగుట దానము.

(5) శక్త్యానుసారముగ బ్రహ్మాదిదేవతల నారాధించుట ఈశ్వర పూజనము.

(6) సత్యము జ్ఞానము అనంతము బ్రహ్మానందము మొదలగు లక్షణము గలది ప్రత్యక్కు (అంతరాత్మ) అని తెలియుట వేదాంతశ్రవణము.

(7) వైదిక లౌకికమార్గములకు విరుద్ధమైన కర్మలయందు ప్రవర్తించుటకు సంకోచించుట లజ్జ.

(8) సకల వైదిక కర్మలయందు ప్రవర్తించుట మతి.

(9) వేదమునందు చెప్పిన ప్రకారము మంత్రమును పఠించుట జపము. ఈ విషయమును 92 వ పుటయందు గనఁదగును.

(10) వేదోక్త ప్రకారముగా అనుష్ఠించు నిత్యకర్మము వ్రతము. దీనినే మఖ మనియుం జెప్పుదురు.

### శుద్ధరాజయోగ నియమ లక్షణము

౨. (1) మోక్షమును గూర్చియు బంధమునుగూర్చియు సంసారమును గూర్చియు విచారముచేయుట తప మనఁబడును.

(2) బ్రహ్మలోక పర్యంతము కలుగు ఆశలను నిగ్రహించి ఆత్మజ్ఞానమునే కోరియుండుట సంతోష మనఁబడును.

(3) గురువాక్యమునందు నమ్మిక గలిగి యుండుట ఆస్తిక్య మనఁబడును.

(4) తాను తెలిసికొన్న పరమవస్తుతత్త్వమును శిష్యులకు తెలియ చేయుట దాన మనఁబడును.

(5) రాగాదిగుణరహితుఁడై సత్యముగఁ బల్కువాఁడై, హింసాదులు లేని కర్మచేయువాఁడై యుండఁ గోరుటయే ఈశ్వరపూజనమనఁ బడును.

(6) గురువువలన పరమవస్తువుతో నైక్యమగుటను తెలిసికొనుట వేదాన్తశ్రవణ మనఁబడును.

(7) అనధికారులతో సంభాషించుటకు ప్రయత్నపడకుండుట లజ్జ యనఁబడును.

(8) బ్రహ్మజ్ఞానసంపన్నుఁడు కావలయు ననెడి బుద్ధి మతి యనఁబడును.

(9) అజపామంత్ర పఠనమే జప మనఁబడును. ఈ అజపామంత్రమును ప్రాణాయామలక్షణమునందు గనందగును.

(10) గురువాక్య ప్రకారము నడుచుకొనుట వ్రత మనఁబడును.

ఈ దశవిధ యమ నియమ లక్షణములయందు మొదట చెప్పినవి అభ్యాసకుల కనియును; రెండవమారు చెప్పఁబడిన శుద్ధరాజయోగ యమనియమ లక్షణములు జ్ఞానులకనియును; తెలియఁదగినది. ఈ యమ నియమలక్షణములు త్రిశిఖోపనిషత్తు, దర్శనోపనిషత్తు, శాండిల్యోపనిషత్తు, వరాహోపనిషత్, మొదలగువానియందును చెప్పఁబడియున్నది.

## ఆసనము

శ్లో. యోనిస్థానకమంఘ్రిమూలఘటితం కృత్వా దృఢంవిన్యసే
న్మేఢ్రేపాదమథైకమేవహృదయేకృత్వాహనుంసుస్థిరమ్,
స్థాణుఃసమ్యమితేంద్రియోచలదృశా పశ్యేద్భ్రువోరంతరం
హ్యేతన్మోక్షకవాటభేదజనకం సిద్ధాసనం ప్రోచ్యతే. ౩౧.

తా. గుదమునకును ఉపస్థమునకును మధ్యదేశమగు యోనిస్థానమును ఎడమకాలిమడిమచే హత్తించి, కుడిపాదమును ఉపస్థమునకు పైభాగమున (లింగముమీద) చక్కఁగా హత్తించవలయును. హృదయమునందు గడ్డమును చక్కఁగానుంచి (గడ్డమునకును హృదయమునకును నాలుగంగుళముల స్థలము ఉండునట్లు చేయవలయుననుట రహస్యము. ఇదే జాలంధర బంధము.) ఇంద్రియములను విషయములయందుండి అడ్డగించి చలనము లేని

చూపుతో భ్రూమధ్యమును వీక్షింపవలయును. (ఇదే ఖేచరీముద్ర.) ప్రసిద్ధమైన యిది మోక్షకవాటము (ప్రతిబంధము)యొక్క ఛేదమును (నాశమును) కలుగఁజేయు యోగాసన మని చెప్పఁబడుచున్నది.

వి. ఈ ఆసనమును అవలంబించువారికి జాలంధరబంధము వేఱుగా నక్కఱలేదు. అనఁగా, ఇట్టి స్థితియే జాలంధరబంధమగును. ఈ ఆసనము రాజయోగు లవలంబింప వలయునని రాజయోగ మెఱింగినవా రనెదరు అయినను ప్రథమాభ్యాసకులుమాత్రము, "శుచౌదేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః, నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్." స్వభావముగానైనను సంస్కారముచే నైనను, పరిశుద్ధమైన స్థలమునందు కుశము, జింకతోలు, వస్త్రము, అనఁబడువానిని క్రమముగా నొకదానిమీఁద నొకదానినియుంచి మిగుల పొడుగును మిగుల పొట్టియును లేనిచోట తనకు సుఖమైన స్థిరాసనమును స్థాపించి కొనవలయును. కనుకనే "సుఖాసనస్థః శుచిః సమగ్రీవః శిరశ్శరీరః" సుఖాసనమున నుండువాఁడై శుచియై సమమైన కంఠమును శిరస్సును శరీరమును గలవాఁడై; (పరమాత్మచింతనము చేయవలయుననియును) "త్రిరున్నతః స్థాప్యసమశ్శరీరః హృదీంద్రియాణిమనసాసన్నివేశ్య బ్రహ్మోడుపేన ప్రతరేతవిద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని." శిరస్సు కంఠము శరీరము అను మూఁటిని చక్కఁగా నిల్పి సమశరీరుఁడై హృదయమునందు మనస్సులో ఇంద్రియములను ప్రవేశింపఁజేసి, బ్రహ్మమనెడి తెప్పచేత విద్వాంసుఁడు సకలనదులను (ఇంద్రియమార్గములను) చక్కఁగా దాఁటుచున్నాఁడు. అనియును చెప్పఁబడియున్నది.

మఱియు యోగాభ్యాసకులకుమాత్రమే ఆసనములు, ముద్రలు, మొదలగునవి కావలయును. అభ్యాసకాలమునందు శాంభవి, షణ్ముఖి మొదలగు ముద్రలకంటె ఖేచరీముద్ర శ్రేష్ఠమైయున్నది. దీనిచేతనే ఉన్మన్యవస్థ కలుగుచున్నది. ఈ ఖేచరీముద్రా భేదంబు లనేకవిధంబులుగా 'హఠయోగప్రదీపిక' యందుఁ జెప్పఁబడియున్నది. "భ్రువో రంతర్గతా దృష్టిః ముద్రాభవతి ఖేచరీ" అనునట్లు, దృష్టిని భ్రూమధ్యమునందుంచుట

ఖేచరి యగుచున్నది. ఇట్లు భ్రూమధ్యము (ఆకాశసముదాయము, లేక మహాశూన్యము, లేక రాజయోగపదము, లేక పరమాత్మస్థానము)నందు దృష్టిని యుంచినయెడల చిత్తలయము కల్గును. చిత్తలయానంతరము పొందదగిన తుర్యమనెడి స్థానము నిదేయగును. ఈ ఖేచరీముద్ర ఎంతకాలము అభ్యసింపవలయుననగా, "అభ్యసేత్ఖేచరీం తావ ద్యావత్స్యాద్యోగనిద్రతః" అనునట్లు యోగనిద్ర (నిర్వికల్పసమాధి) కలుగునంతవఱకు అభ్యసింపవలయును. ఈ ఖేచరీముద్రను పద్మాసనమునుండియు అభ్యసింపవచ్చును.

## ప్రాణాయామము.

అవ. ఆచార్యుఁడు ప్రాణాయామలక్షణంబును జెప్పుట కుపక్రమించి తన్మహిమనుగూర్చి బోధించుచున్నాఁడు.

శ్లో. దహ్యంతేధ్మాయమానానాం ధాతూనాంహియథామలాః,
తథేంద్రియాణాందహ్యంతేదోషాఃప్రాణస్యనిగ్రహాత్. 32

తా. ఎట్లు స్వర్ణము మొదలగు ధాతువులయొక్క మలినము అగ్నియందు కాఁచినంతనే పోవుచున్నదో, అట్లు దేహముతోఁజేరిన యింద్రియదోషంబులన్నియు ప్రాణాయామముచేత నశించును.

వి. ప్రాణాయామమున కిట్టి ప్రభావంబు కలిగియుండుటంబట్టియే సకలాశ్రమములయం దుండువారును అవలంబించుచున్నారు.

## ప్రాణాయామ నిర్వచనము.

శ్లో. ప్రాణఃస్వదేహస్థావాయు రాయామ స్తన్నిరోధనమ్,

తా. ప్రాణ మనునది తనయొక్క శరీరమునందు జీవించి యుండునట్టివాయువు, ఆయామ మనఁగా దానిని అడ్డగించుట. (అనఁగా తన శరీరముందుండు వాయువును తన స్వాధీనముచేసికొనుట యని భావము).

## ప్రాణాయామ భేదములు.

శ్లో. ప్రాణాయామస్త్రిధాప్రోక్తో రేచపూరక కుంభకైః. 33.
సహితః కేవలశ్చేతి కుంభకో ద్వివిధో మతః,

తా. ప్రాణాయామము మూఁడువిధములుగాఁ జెప్పంబడియున్నవి. 1 రేచకము, 2 పూరకము, 3 కుంభకము. కుంభకము సహితకుంభక మని యును, కేవలకుంభక మనియును రెండు విధములు.

వి. కేవలకుంభకమునకు శూన్యమనియును పేరుకలదు.

అవ. ప్రాణాయామము నెంత కాలమువఱకు చేయవలయు ననుటనుగూర్చి యనువదించుచున్నాఁడు.

శ్లో. కుర్యాత్సుషుమ్నానాడీస్థా మలాఃశుద్ధిం ప్రయాన్తి చ ౩౪.

తా. సుషుమ్నానాడియందుండు మలములు శుద్ధియగువఱకును (ప్రాణాయామమును) చేయవలయును.

అవ. సుషుమ్నానాడియందలి మలములు శుద్ధియగుటవలని ప్రయోజనంబు నుపదేశించుట కుపక్రమించి, తన్నాడీలక్షణంబును ప్రథమంబున నుపదేశించుచున్నాఁడు.

శ్లో. ఇడాతిష్ఠతి వామేన పింగళా దక్షిణేన తు,
తయోర్మధ్యే పరంస్థానం సుషుమ్నా సూక్ష్మరూపిణీ.౩౫.

తా. (నాసికముయొక్క) ఎడమప్రక్క ఇడానాడియు, కుడిప్రక్క పింగళానాడియు, ఈ రెంటికి మధ్య శ్రేష్ఠమైన స్థానమునందు సూక్ష్మ రూపమైన సుషుమ్నానాడియు నున్నది.

వి. ఇడానాడియనఁగా చంద్రనాడి, పింగళానాడియనఁగా సూర్యనాడి. సుషుమ్నానాడియనఁగా బ్రహ్మనాడి.

శ్లో. దేహస్యపశ్చిమేభాగే వీణాదండస్వరూపభృత్,
దీర్ఘాస్థిమూర్ధ్నిపర్యన్తం బ్రహ్మదండీతికథ్యతే. ౩౬.
తస్యాంతే సుషిరంసూక్ష్మం బ్రహ్మనాడీతిసూరిభిః.

తా. దేహముయొక్క వెనుకభాగమునందు వీణాదండమువంటి యాకారముగల బ్రహ్మదండి యను పేరుగల వెన్నెముక (గుదము మొదలు)

శిరస్సువఱకు నున్నది. ఆ బ్రహ్మదండియొక్క అంతమునందు (లోపల) సూక్ష్మమైనట్టి రంధ్రమునందు బ్రహ్మనాడియనెడి సుషుమ్నానాడి యున్న దని యోగశాస్త్రవేత్తలచేత చెప్పఁబడుచున్నది.

వి. “శ్లో. సుషుమ్నాంతర్గతే వాయౌ మనఃస్థైర్యం ప్రజాయతే” అనఁగా, సుషుమ్నానాడీద్వారమునందు ప్రాణవాయువు ప్రవేశించునేని మనస్సునకు స్థిరత్వము కలుగును. ఈ స్థైర్యమే (ఉన్మన్యవస్థయే) అసంప్రజ్ఞాతఅవస్థ యనఁబడును.

శ్లో. మారుతో మధ్యసంచారే మనఃస్థైర్యం ప్రజాయతే,
యో మనః సుస్థిరీభావః సైవావస్థా మనోన్మనీ. 32.

తా. ప్రాణవాయువు సుషుమ్నా మధ్యయందు శిరస్సు పర్యంతము చక్కఁగా ప్రవేశించునేని, అప్పుడు మనోస్థిరత్వము (ధ్యేయస్వరూపమైన వృత్తిప్రవాహము) కలుగుచున్నది. మనస్సుయొక్క స్థిరత్వ మెది యో, అదియే మనోన్మని (ఉన్మని) అవస్థ యనఁబడును.

రేచక పూరక కుంభక లక్షణము.

శ్లో. ప్రాణంసూర్యేణచాకృష్య పూరయేదుదరంశనైః
విధివత్కుంభకంకృత్వా పునశ్చంద్రేణ రేచయేత్. 33.

తా. సూర్యనాడియను పింగళానాడిచేత ప్రాణమును మెల్లమెల్లఁగా లోపల పూరింపించి, విధిప్రకారము కుంభకముచేసి, మఱల చంద్రనాడియైన ఇడానాడిచేత రేచింప వలయును.

వి. కడుపునందుండు వాయువును బయట విడుచుట రేచకము. బయటనుండు వాయువును కడుపునందు నింపుట పూరకము. పూరకముచే లోపలఁగొన్న వాయువును అట్లే నిల్పుట కంభకము. నాసికయందు వాయువును క్రమముగా చలనములేక నిల్పుటయు కుంభకమనఁబడును. తక్కినవిషయములు ‘హఠయోగప్రదీపిక’యందుఁ గనఁదగును.

శ్లో. యేనత్యజే త్తేనపీత్వా ధారయే దతినిరోధతః,
రేచయేచ్చ తతోఽన్యేన శనై రేవ నవేగతః. ౩౯.

తా. చంద్రుఁడు, లేక సూర్యుఁడు అనెడి ఏనాడిచేత రేచించుచున్నాఁడో, ఆనాడిచేతనే పూరించి, అతిరోధమువలన కుంభించి, దానికి అన్యమైన నాడిచేత వేగములేక మెల్లఁగా రేచింప వలయును.

వి. పూరకమును వేగముగా చేసినను దోషము లేదు. మెల్లఁగను చేయవచ్చును. రేచకమును వేగముగా చేసినయెడల బలహీనము కలుగును. మఱియు, వాయువుయొక్క రేచక పూరక కుంభకములవలన సకలనాడులును శుద్ధియగుకాలమునందు, లోపల సర్వకాలమును అనేకవిధములైన అనాహతమనెడి నాదము ప్రవర్తించును. ఈ నాదధ్వని, ప్రాణవాయువు బ్రహ్మరంధ్రమునందు స్థిరమగునపుడే కలుగును. అపుడు కుండలినీశక్తియు తనంతట మేలుకొనును. కుండలినీశక్తియొక్క మేలుకొలుపు ఎదియో అదే హఠయోగులు జీవన్ముక్తి యని చెప్పుదురు. ఈ స్థితి సవికల్పకసమాధియే గాని నిర్వికల్పకసమాధి కానందున రాజయోగులు దీనిని పరిగణించుట లేదు. రాజయోగాభ్యాసకులకును ప్రథమమున నాదధ్వని వినంబడుచుండును. అయినను రాజయోగులు నాదలయమునే శ్రేష్ఠ మనెదరు.

అవ. రాజయోగికి ఆరంభదశయందు అనాహతధ్వని (కొట్టక వినఁబడుశబ్దము) కలిగినను, కొందఱు ప్రయత్నపూర్వకముగా శబ్దగ్రహణము చేయుచున్నా రని చెప్పుట కుపక్రమించి తల్లక్షణమును బోధించుచున్నాఁడు.

## అనాహతధ్వనిసాధన లక్షణము.

శ్లో. అంగుష్ఠాభ్యా ముభౌకర్ణౌ తర్జనీభ్యాంచ చక్షుషీ,
నాసాపుటౌ తథా నాభ్యాం ప్రచ్ఛాద్య కరణానిచ. ౪౦.

తా. పెద్దవ్రేళ్లతో రెండుచెవులను, మూపుడువ్రేళ్లతో రెండు నాసికాద్వారములను, తక్కినవ్రేళ్లతో నోటిని మూసికొనవలయును.

వి. దీనిని ప్రాఙ్ముఖీముద్ర యనియును, షణ్ముఖీముద్ర యనియును జెప్పుదురు.

### అనాహతధ్వని లక్షణము.

శ్లో. ఆదౌమత్తాలిమాలాజనితరవసమస్తారసంస్కారకారీ
నాదోఽసౌవాంశికస్యాఽనిలభరితలసద్వంశనిఃస్వానతుల్యః
ఘంటానాదానుకారీ తదనుచజలధిధ్వానధీరోగభీరో
గర్జన్పర్జన్యఘోషఃపరఇహకుహరేవర్తతేబ్రహ్మనాడ్యాః. ౮౧.

తా. ఈనాదము మొదట తేనెను గ్రోలినతుమ్మెదల సమూహములచేఁ గలుగుశబ్దమునకు సమాన శబ్దసంస్కారమును జేయునదిగను, ఆతర్వాత వెదుళ్ళసమూహములు గాలిచే నిండినదై నప్పుడు కలుగు వెదుళ్లయొక్క శబ్దమునకు సమానమైనదిగను, ఘంటానాదముయొక్క మారుమ్రోఁతవలెను, సముద్రఘోషమువంటి శబ్దమువలెను, గంభీరముగా గర్జించునట్టి ఉఱుమువంటిశబ్దమువలెను, బ్రహ్మనాడియొక్క శ్రేష్ఠమైన రంధ్రమునం దున్నది.

వి. ఈ నాదధ్వని యనేకవిధములుగా వినంబడునని నాదబిందూపనిషత్తు మొదలగు గ్రంథములయందుఁ జెప్పఁబడి యున్నది. నాదధ్వని యొక్క ముఖ్యరహస్యమేమనఁగా, వారివారి శరీరస్థితియును, భావమును అనుసరించి, నాదధ్వని వినంబడుచుండును. కనుక విస్తరింపలేదు.

శ్లో. మహతిశ్రూయమాణోఽపి మేఘభేర్యాదికే ధ్వనౌ,
తత్ర సూక్ష్మాత్సూక్ష్మతరం నాదమేవపరామృశేత్. ౮౨.

తా. మేఘము, భేరి మొదలగువాని యందుండికలుగు శబ్దమువంటి గొప్ప ధ్వనులు వినఁబడినను, వానిలో సూక్ష్మముకంటెను సూక్ష్మమైన నాదమునే చింతింపవలయును.

వి. నాదముయొక్క సూక్ష్మమును (అనఁగా సూక్ష్మమైన నాదము) చింతించుట (భావించుట, లేక వినుట) వలన తనంతట చిత్తలయము కల్గునని భావము.



## శుద్ధరాజయోగ ప్రాణాయామము.

శ్లో. బాహ్యస్థవిషయంసర్వం రేచక స్సముదాహృతః,
పూరకం శాస్త్రవిజ్ఞానం కుంభకం స్వగతం స్మృతమ్.
ఏవ మభ్యాసచిత్తశ్చే త్సముక్తోనాఽత్రసంశయః, ౪౩.

తా. బాహ్యవిషయములన్నియు రేచకమనియును, శాస్త్రవిజ్ఞానము పూరకమనియును, శాస్త్రవిజ్ఞానమునంతయు తనలోనే యణఁగించి కొనుట కుంభకమనియును చెప్పఁబడుచున్నది. ఇట్లు అభ్యాసముచేయు చిత్తముగలవాఁడాయెనేని వాఁడు ముక్తుఁడే యగును. సందేహము లేదు.

వి. ఇట్లుగాఁ జెప్పఁబడినను శుద్ధరాజయోగులును, సన్న్యాసులును, పరమహంసలును రేచక పూరకములు చేయునపుడు అజపా గాయత్రిని యనుసంధించెదరు. ఎట్లనఁగా, శ్వాసము బయవెడలునపుడు స (సో) అను దానిని, శ్వాసము లోపలప్రవేశించునపుడు హ (హం) అను దానిని జపింపవలయును. ఇదే 'సోహం' 'హంసః' అనఁబడును. ఇదే అజపాగాయత్రియును, ప్రణవమును అగును. తక్కినవిషయములు 'హఠయోగప్రదీపిక'యందుఁ గనందగును.

అవ. ఆచార్యుఁడు ప్రాణాయామలక్షణంబు నుపదేశించి, ఇపుడు ప్రత్యాహారలక్షణంబు ననువదించుచున్నాఁడు.

## ప్రత్యాహారము.

శ్లో. చరతాంచక్షురాదీనాం విషయేషు యథాక్రమమ్,
యత్ప్రత్యాహరణంతేషాం ప్రత్యాహారః ప్రకీర్తితః. ౪౪.

తా. విషయములయందు సంచరించు నేత్రాదులను క్రమప్రకారము మరల్చుట ప్రత్యాహార మనఁబడును.

వి. ఇంద్రియజయమే ప్రత్యాహార మనఁబడును. ఇయ్యది అనేక విధములుగాఁ గ్రంథాదులందు గనంబడుచున్నవి. కొన్నిటినిమాత్ర ముదహరింపఁబడును.



1. దేనిని చూచుచున్నాఁడో దానినంతయు బ్రహ్మముని చూచుట ప్రత్యాహారము.
2. సకల విషయములయందును పరాఙ్ముఖుఁడై యుండుట ప్రత్యాహారము.
3. విద్వాంసుఁడు తనయొక్క బుద్ధిని గ్రహించి సమచిత్తముగల వాఁడై నిర్ద్వంద్వమును నిర్వికల్పమును నైనఆత్మయందు నిల్పుట సాక్షాత్ వేదాన్తము నెఱింగినవారిచేత ప్రత్యాహార మనఁబడును.
4. నిత్యకర్మముల ఫలములను కోరకుండుట ప్రత్యాహారము.
5. మరణపర్యంతము తానుచేయు శుద్ధాశుద్ధములన్నియును బ్రహ్మము నందుచేయుట ప్రత్యాహారము.
6. నిత్యకర్మములను కామ్యకర్మములను బ్రహ్మారాధనబుద్ధిగా చేయుట ప్రత్యాహారము.

అవ. ఆచార్యుఁడు ప్రత్యాహార లక్షణం బుపదేశించి ధారణాలక్షణంబు ననువదించుచున్నాఁడు.

## ధారణ.

శ్లో. ప్రాణాయామేనపవనం ప్రత్యాహారేణచేంద్రియమ్,
వశీకృత్య తతఃకుర్యాత్ చిత్తస్థైర్యంశుభాశ్రయే ౪౫

తా. ప్రాణాయామముచేత వాయువును, ప్రత్యాహారముచేత ఇంద్రియములను వశపఱిచి, తర్వాత శుభాశ్రయమునందు చిత్తమును స్థిరము (ధారణ) చేయవలయును.

వి. చిత్తస్థైర్యమునే ధారణ యనియు, భావనాయోగమనియుఁ జెప్పుదురు.

అవ. ధారణానుసంబంధియైన పంచభూతభావనాయోగమును జెప్పుట కుపక్రమించి, తన్మహిమను ప్రథమమున బోధించుచున్నాఁడు.

## పంచభూతభావనాయోగ ప్రభావము.

శ్లో. పృథివ్యాంధారయే చ్చిత్తం పాతాళగమనం భవేత్,
సలిలే ధారయే చ్చిత్తం నాంభసా పరిభూయతే. ౪౬.
అగ్నౌసంధారయే చ్చిత్తం అగ్నినా దహ్యతే న నః,
వాయౌ మనోలయంకుర్యా దాకాశగమనం భవేత్.౪౭.
ఆకాశే ధారయే చ్చిత్తం అణిమాదిక మాప్నుయాత్.

తా. పృథ్వీభావనాయోగముచేత పాతాళగమనమును, జలభావనాయోగముచేత నదీగమనమును, అగ్నిభావనాయోగముచేత అగ్నిప్రవేశమును, వాయుభావనాయోగముచేత ఆకాశగమనమును, ఆకాశభావనాయోగముచేత అణిమాది సిద్ధులును కలుగును.

వి. ఈ విషయమును విస్తరముగా పాతంజలయోగశాస్త్రము తృతీయపాదంబునందుఁ గనందగును.

అవ. ఆచార్యుఁడు పంచభూతభావనాయోగప్రకృష్టంబు నుపదేశించి తత్త దధిదేవతలను జెప్పుచున్నాఁడు.

## పంచభూతాధిదేవతలు.

శ్లో. పృథివ్యాదికభూతానా మధిదేవాః ప్రకీర్తితః. ౪౮.
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః,

తా. పృథ్వీభూతమునకు బ్రహ్మయును, జలభూతమునకు విష్ణువును, తేజోభూతమునకు రుద్రుఁడును, వాయుభూతమునకు ఈశ్వరుఁడును, ఆకాశభూతమునకు సదాశివుఁడును అధిదేవతలు.

వి. “ఆకాశమండలం వృత్తం పరవస్త్వధిదేవతా” అని కొందఱి మతము. పరవస్తు వనఁగా భగవంతుఁడని కొందఱును, పరాశక్తి యని కొందఱును, చెప్పెదరు.

## పృథివీ ధారణ.

శ్లో. పాదాదిజానుపర్యంతం పృథివీస్థాన ముచ్యతే. ౪౯.
పృథివీచతురశ్రంచ హేమవర్ణం ల వర్ణకమ్,
పార్థివే వాయుమారోప్య ల కారేణ సమన్వితమ్. ౫౦.
ధ్యాయం శ్చతుర్ముఖాకారం చతుర్వక్త్రం హిరణ్మయమ్,
ధారయేత్పంచఘటికాః పృథివీజయ మాప్నుయాత్. ౫౧.
పృథివీయోగతో మృత్యు ర్నభవే దస్యయోగినః.




తా. పాదము మొదలు మోకాళ్లవఱకును పృథ్వీస్థానము. చతురశ్రముగను స్వర్ణమువంటి కాంతిగను నుండును. పృథివీస్థానంబునందు వాయువును కుంభించి పృథ్వీబీజమైన ల అను వర్ణముతో స్వర్ణవర్ణముయమైన చతుర్ముఖబ్రహ్మను అయిదుగడియలు ధారణ చేసినయెడల పృథ్వీజయము కలుగును. ఈ యోగికి పృథ్వివలన మరణము కలుగదు.

వి. "శ్లో. పార్థివం చతురశ్రంతు హేమాభం వజ్రలాంఛితమ్, లంబీజం బ్రహ్మదైవత్య మజాతహృదయాత్మకమ్, నివృత్త్యాఖ్యకలోపేతం ప్లామిత్యుద్ఘాత పంచమమ్" అనఁగా, ఈ పృథ్వీతత్త్వము వజ్రముతో గుర్తింపఁబడినదియు, సద్యోజాతమంత్ర హృదయమంత్ర స్వరూపమైనదియు, నివృత్తికలతోఁ గూడినదియు, ప్లాం మొదలగు అయిదు ఉద్ఘాతములతోఁగూడినదియునైయున్నది. ఉద్ఘాతము 12 మాత్రలకాలము. ఇది ఒక ప్రాణాయామము మనఁబడును.

## అప్పు ధారణ.

శ్లో. ఆజానుకటిపర్యంత మపాంస్థానం ప్రకీర్తితమ్. ౫౨.
ఆపోర్ధచంద్రశ్శుక్లంచ వం బీజం పరికీర్తితమ్,
వారుణే వాయుమారోప్య వకారేణ సమన్వితమ్ ౫౩.
స్మరన్నారాయణందేవం చతుర్బాహుం కిరీటినమ్,
శుద్ధస్ఫటికసంకాశం పీతవాసస మచ్యుతమ్. ౫౪.
ధారయే త్పంచఘటికా స్సర్వపాపైః ప్రముచ్యతే,
తతో జలాద్భయం నాస్తి జలేమృత్యుర్నవిద్యతే ౫౫.




తా. మోకాళ్లు మొదలుకటిస్థానపర్యంతము జలస్థానము. అర్ధచంద్రాకృతిగను తెల్లగను నుండును. జలస్థానంబునందు కుంభకముచే వాయువును పూరించి తద్బీజమైన వకారయుక్తముగ చతుర్భుజుండును కిరీటధారియు శుద్ధస్ఫటిక కాంతిగలవాఁడును పీతాంబరధరుండు నగు నారాయణుని ఐదు గడియలు ధారణచేసినట్టియోగి సకలపాపములనుండి విడువంబడుచున్నాఁడు. జలమువలన భయము లేదు. జలమునందు మరణమును కలుగదు.

వి. “శ్లో. ఆప్య మిందు నిభాబ్జాంకం విష్ణుదైవం వ బీజకమ్, వామశీర్ష సమాయుక్తం ప్రతిష్ఠాకలయాన్వితమ్, యుక్తం చతుర్భి రుద్ఘాతైః హ్లీమిత్యుచ్చారపూర్వకమ్” అనఁగా ఈ జలతత్త్వము వామదేవమంత్ర శిరోమంత్రములతోఁ గూడినదియును, ప్రతిష్ఠాకలతోఁ గూడినదియును, హ్లీం మొదలగు ఉచ్చారణక్రమముతో నుండు నాల్గు ఉద్ఘాతములతోఁ గూడినదియును నైయున్నది.

## అగ్ని ధారణ.

శ్లో. ఆపాయోర్హృదయాంతంచ వహ్నిస్థానం ప్రకీర్తితమ్,
వహ్ని త్రికోణం రక్తంచ రేఫాక్షర సముద్భవమ్. ౫౬.
వహ్నౌ చానిలమారోప్య రేఫాక్షర సముజ్జ్వలమ్,
త్ర్యక్షంతు వరదం రుద్రం తరుణాదిత్యసన్నిభమ్. ౫౭.
భస్మోద్ధూళితసర్వాంగం సుప్రసన్న మనుస్మరన్,
ధారయేత్పంచఘటికా వహ్నినాఽసౌ న దహ్యతే. ౫౮.
న దహ్యతే శరీరంచ ప్రవిష్టస్యాగ్నికుండకే.




తా. కటి ప్రదేశము మొదలు హృదయమువఱకును అగ్నిస్థానము. త్రికోణాకృతియును రక్తకాంతియును గలది. అగ్నిస్థానంబునందు వాయువును కుంభించి రేఫాక్షరసహితముగా త్రిలోచనుండును సర్వాభీష్టదాయకుండును బాలార్క తేజుండును భస్మోద్ధూళితాంగుండును సుప్రసన్నుండును అగు రుద్రమూర్తిని అయిదు గడియలు ధారణచేసి స్మరించినయోగి అగ్నిచేతను అగ్నికుండమునందుండినను కాల్పఁబడఁడు.

వి. "శ్లో. అగ్నిస్త్ర్యశ్రం సప్తశిఖం రక్తాభం రుద్రదైవతమ్, రాజ్ఞాఘోరశిఖాయుక్తం విద్యాఖ్యకలయాన్వితమ్, యుక్తం త త్రిభిరుద్ఘాతైః హ్లూమిత్యుచ్చారసంయుతమ్". అనఁగా, అగ్నితత్త్వము సప్తశిఖలతోఁ గూడినదియును, అఘోరమంత్ర శిఖామంత్రములతోఁ గూడినదియును, విద్యాకలతోఁ గూడినదియును, హ్లూం మొదలగు ఉచ్చారణతోను మూఁడు ఉద్ఘాతములతోను గూడినదియును, నైయున్నది.

## వాయుధారణ.

శ్లో. ఆహృదాయాద్భ్రువోర్మధ్యం వాయుస్థానం ప్రకీర్తితమ్॥౫౯
వాయుషట్కోణకం కృష్ణం యకారాక్షర భాసురమ్,
మారుతం మరుతాం స్థానే ప్రాణే ప్రాణం సమాహితః.౬౦.
ధారయే త్తత్ర సర్వజ్ఞ మీశ్వరం విశ్వతోముఖమ్,
ధారయేత్పంచఘటికా వాయువద్వ్యోమగో భవేత్.౬౧.
మరణం న తు వాయోస్తు భయం భవతి యోగినః.




తా. హృదయము మొదలు భ్రూమధ్యము వఱకును వాయుస్థానము. షట్కోణాకృతి గలదై నీలవర్ణముగ నుండును. వాయుస్థానంబు నందు

వాయువును పూరించి, సర్వజ్ఞుఁడును విభువును అగు ఈశ్వరుని, అయిదు గడియలు వాయుబీజమైన య కారముతోఁ జేర్చి ధారణ చేసినయోగికి ఆకాశగమనశక్తియును, వాయుభయనాశమును కలుగును. వాయువలని మరణభయమును నివర్తియగును.

వి. "శ్లో. వాయవ్యం రసకోణంతు బిందుషట్క ముఖానితమ్, ఈశాధిపత్యం యార్ణం తత్పురుషకవచైర్యుతమ్, శాంత్యాయుక్తంద్విరుద్ఘాతైః హ్లైమిత్యుచ్చారపూర్వకమ్." అనఁగా, వాయుతత్త్వము షడ్బిందువులతోఁ గూడినదియును, తత్పురుషమంత్ర కవచమంత్రములతోఁ గూడినదియును, శాంతికలతోఁ గూడినదియును, హ్లైం మొదలగు ఉచ్చారణపూర్వకమైన రెండు ఉద్ఘాతములతోఁ గూడినదియును నైయున్నది.

ఆకాశధారణ.

శ్లో. ఆభ్రూమధ్యాత్తుమూర్ధాంత మాకాశస్థాన ముచ్యతే. ౬౨.
వ్యోమ వృత్తంచ ధూమ్రంచ హకారాక్షర భాసురమ్,
ఆకాశే వాయుమారోప్య హకారోపరి శంకరమ్. ౬౩.
బిందురూపం మహాదేవం వ్యోమాకారం సదాశివమ్,
శుద్ధస్ఫటికసంకాశం ధృతబాలేందుశేఖరమ్. ౬౪.
పంచవక్త్రయుతం సౌమ్యం దశబాహుం త్రిలోచనమ్,
ఉమార్ధదేహం వరదం సర్వకారణకారణమ్. ౬౫.
ఆకాశధారణా త్తస్య ఖేచరత్వం భవే ద్ధ్రువమ్,
యత్ర కుత్ర స్థితోవాపి సుఖ మత్యంత మశ్నుతే. ౬౬.
ఏవంచ ధారణాః పంచ కుర్యా ద్యోగీ విచక్షణః,
తతో దృఢశరీరస్యా న్మృత్యు స్తస్య నవిద్యతే. ౬౭.






తా. భ్రూమధ్యము మొదలు కపాలము పర్యంతము ఆకాశస్థానము. వృత్తాకారమై ధూమ్రవర్ణముతోఁ గూడియుండును. ఆకాశస్థానంబునందు వాయువును కుంభకముచే పూరించి తద్బీజమైన హ కారముతో మంగళకరుండును బిందుస్వరూపుండును మహాదేవుండును గగనాకారుండును సదాశివుఁడును శుద్ధస్ఫటికకాంతియుతుండును బాలేందుశేఖరుండును పంచముఖుండును శాంతుండును దశభుజములుకలవాఁడును త్రినేత్రుండును ఊర్ధ్వదేహుండును వరదుండును సకలకారణుండును అగు సదాశివుని అయిదుగడియలు ధారణాయోగముచే ధ్యానించినయోగికి ఖేచరత్వమును (ఆకాశగమనశక్తియును) సర్వత్ర సర్వసౌఖ్యమును గలుగును. శరీరము దృఢమగును. ఎచ్చోటను మరణభయము కలుగదు.

వి ‘‘శ్లో. ఆకాశం వర్తులం త్యక్తలాంఛనం ధూమ్రవర్ణకమ్, సదేశోధిష్ఠితా హార్ణ మీశాస్త్రీతిత సంతయుతమ్, ఏకోద్ఘాతేన ప్లౌముక్త్వా యథాస్థానం ప్రయోజయేత్.’’ అనఁగా ఆకాశతత్త్వము త్యజింపఁబడిన లాంఛితముతోఁ గూడినదియును, ఈ శౌనమంత్రముతోను అస్త్రమంత్రము

తోను శాంత్యాతీతకళలతోను గూడినదియును, హ్లాం అని చెప్పంబడెడి యొక్క ఉద్ఘాతములోఁ గూడినదియును నైయున్నది.

అవ. ఆచార్యుఁడు ఇవ్విధముగా పంచభూతధారణాయోగప్రకారంబు నుపదేశించి కొందఱు తదధిదేవతలను ఈ చెప్పఁబోవు ప్రకారము గను అనుసంధించి ధారణముచేయుచున్నారని యనువదించుచున్నాఁడు.

మతాంతర పంచభూతాధిదేవతలు.

శ్లో. పృథివ్యంశేతు దేహస్య చతుర్బాహుం కిరీటినమ్,
అనిరుద్ధం హరింయోగీ యతేత భవముక్తయే. ౧౮.
ఆబంశే పూరయే ద్యోగీ నారాయణ ముదగ్రధీః,
ప్రద్యుమ్న మగ్నౌ వాయ్వంశే సంకర్షణమతఃపరమ్. ౧౯.
వ్యోమాంశే పరమాత్మానం వాసుదేవం స దాస్మరేత్,
అచిరాదేవ తత్ప్రాప్తి ర్యుంజానస్య న సంశయః. ౨౦.

తా. (ఇదివఱకుం జెప్పినట్టి ఆయాభూతస్థానంబులందు) దేహము యొక్క పృథివీస్థానంబునందు చతుర్భుజుండును కిరీటధారియు సర్వదోషనివారకుండును అగు అనిరుద్ధమూర్తిని; జలస్థానంబునందు సర్వజీవులకాధారభూతుండైన నారాయణమూర్తిని; అగ్నిస్థానంబునందు ప్రద్యుమ్నమూర్తిని; వాయుస్థానంబునందు సంకర్షణమూర్తిని; ఆకాశస్థానంబునందు పరమాత్మయైన వాసుదేవుని; ధ్యానింపవలయును. ఇట్లు ధ్యానముచేయువారికి శీఘ్రకాలముననె ఆయాదేవతలతో నైక్యము కలుగును.

వి. పృథ్వికి 5, జలమునకు 10, అగ్నికి 15, వాయువునకు 20, ఆకాశములకు 25, గడియలచొప్పున వాయువును కుంభించి తత్తదధిదేవతలను ధ్యానింప వలయునని కొందఱిమతము.

అవ. మఱికొందఱు పంచభూతస్థానము లాదిగాఁగలవానిని వేఱువిధముగాఁ జెప్పుచున్నారని బోధించుచున్నాఁడు.



## మతాంతర పంచభూతస్థాన వివరణము.

శ్లో. పార్థివం హృదయస్థాన మాప్యం కంఠగతం భవేత్,
వహ్నౌఽయం తాలుమూలేతు భ్రూమధ్యే వాయుసంభవమ్.
బ్రహ్మగ్రంధియుతం వ్యోమ స్థానం యద్వాఽన్యథామతమ్,
ఆజానుపృథివీ జ్ఞేయా నాభేరాప్యం నిగద్యతే. ౭౨.
అనలం కంఠదేశాత్తు వాయు రాముఖమండలాత్,
తదూర్ధ్వం గగనస్థానం ధారణార్థం ప్రకీర్తితమ్. ౭౩.

తా. పృథ్వీతత్త్వమునకు హృదయమును, జలతత్త్వమునకు కంఠమును, తేజస్తత్త్వమునకు తాలుమూలమును (రెండుచెక్కిళ్లకు దిగువను), వాయుతత్త్వమునకు భ్రూమధ్యమును, ఆకాశతత్త్వమునకు బ్రహ్మరంధ్రమును, స్థానములగును. వేఱొకమతము నందు; భూమితత్త్వము మోకాళ్ల వఱకును, జలతత్త్వము నాభివఱకును, అగ్నితత్త్వము కంఠప్రదేశమువఱకును, వాయుతత్త్వము ముఖమండలమువఱకును, ఆకాశతత్త్వము ముఖమండలమునకు మీఁదుగను, స్థానములు. ఇట్లు ధారణార్థమై చెప్పంబడినది.

## మఱియొక విధము.

శ్లో. పాదయోః పృథివీతత్త్వం తోయతత్త్వంచ గుహ్యకే,
తేజస్తత్త్వంనాభిదేశే వాయుతత్త్వం హృదంబుజే. ౭౪.
ఆస్యే గగనతత్త్వంచ చక్షుషో రూపతత్త్వకమ్,
ఘ్రాణయో ర్గంధతత్త్వంచ శబ్దతత్త్వం శ్రుతిద్వయే. ౭౫.
జిహ్వాయాం రసతత్త్వంచ స్పర్శతత్త్వం త్వచిన్యసేత్,
మనస్తత్త్వం భ్రువోర్మధ్యే సహస్రదళపంకజే. ౭౬.
శివతత్త్వం జ్ఞానతత్త్వం పరతత్త్వం తదూపరి,
జీవప్రకృతితత్త్వేచ విన్యసే త్స్వాధకాగ్రణీః. ౭౭.
మహత్తత్త్వమహంకార తత్త్వం సర్వాంగకే క్రమాత్,

తా. పృథివీతత్త్వమును పాదములయందును, జలతత్త్వమును గుహ్యమందును, అగ్నితత్త్వమును నాభియందును, వాయుతత్త్వమును హృదయమునందును, ఆకాశతత్త్వమును ముఖమందును, రూపతత్త్వమును నేత్రములయందును, గంధతత్త్వమును నాసికయందును, శబ్దతత్త్వమును చెవులయందును, రసతత్త్వమును నాలుకయందును, స్పర్శతత్త్వమును త్వక్కునందును, మనస్తత్త్వమును భ్రూమధ్యమునందును, మంగళప్రదమైన జ్ఞానతత్త్వమును సహస్రారమందును, జీవతత్త్వమును ప్రకృతితత్త్వమును సహస్రారమునకు మీఁదుగను, మహత్తత్త్వమును అహంకారతత్త్వమును సర్వాంగములయందును యోగసాధకము చేయువారు న్యసింప (ధారణ) వలయును.

శుద్ధరాజయోగ ధారణ.

శ్లో. సర్వత్ర సర్వతః స్సర్వ బ్రహ్మమాత్రావలోకనమ్,
సద్భావభావనాదార్ఢ్యా ధారణా పరికీర్తితమ్. ౭౮.

తా. సకలస్థలములందును (ప్రపంచమందంతటను) సర్వవిధముల చేతను సర్వమును పరమాత్మగాఁ జూచుటయనెడి సద్భావ భావితము యొక్క దార్ఢ్యమే ధారణ యని చెప్పఁబడుచున్నది.

వి. పురుషుఁడు బోధానందస్వరూపమైన శివమును, సకలపాపములు నివర్తియగు నిమిత్తము నిత్యమును ధారణ చేయవలయు ననియును; సకలకార్యములను ఆయా కారణములయందు లీనముచేసి, సర్వకారణమైన అవ్యక్తమును గోచరింపఁ జేయునట్టి చేతనమును ప్రణవమైన సంపూర్ణసాక్షిత్ ఆత్మయందు ధారణచేయవలయు ననియును; ఆత్మయందు ఇంద్రియములను మనస్సును చేర్చుటయే ధారణ యనియును; దేహశుద్ధికొఱకు ధారణ చేయవలయుననియును; గ్రంథాదులందు గానంబడుచున్నవి. ఈ ధారణను ఎందఱెన్నివిధములుగాఁ జెప్పినను, ఇది చిత్తమును స్థిరీకరణము చేయునట్టి యోగాంగమనియును, ధారణచేతనే ధ్యానింపఁబడు వస్తువునందు దార్ఢ్యము (చిత్తవిక్షేపములేని యవస్థ) కలుగుననియును తెలియఁ దగినది.

## పంచభూతస్థానాధిదేవతానిరూపణ పథకము.

| సంఖ్య | పంచభూతములు. | పంచభూతస్థానములు. | మండలము. | కాంతి. | బీజాక్షరము. | అధిదేవత. | మతాంతరము. | సమాధికాలము. | మతాంతరము. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | పృథ్వి. | పాదము మొదలు మోకాలివఱకు. | చతుష్కోణము. | స్వర్ణము. | లం. | బ్రహ్మ. | అనిరుద్ధుండు. | 5 గడియలు. | 5 గడియలు. |
| 2 | అప్పు. | మోకాళ్లమొదలు కటివఱకు. | అర్థవర్తులము. | తెలుపు. | వం. | విష్ణువు. | నారాయణుండు. | 5 గడియలు | 10 గడియలు. |
| 3 | తేజస్సు. | కటిస్థానము మొదలు నాభివఱకు. | త్రికోణము. | ఎఱుపు. | రం. | రుద్రుండు. | ప్రద్యుమ్నుండు. | 5 గడియలు | 15 గడియలు. |
| 4 | వాయువు. | నాభిమొదలు నాసికాగ్రమువఱకు. | షట్కోణము. | నలుపు. | యం. | ఈశ్వరుండు. | సంకర్షణుండు. | 5 గడియలు. | 20 గడియలు. |
| 5 | ఆకాశము. | నాసికాగ్రము మొదలు మూర్ధ్నివఱకు. | వృత్తము. | ధూమ్రము. | హం. | సదాశివుండు. | వాసుదేవుండు. | 5 గడియలు. | 25 గడియలు. |

అవ. ఇవ్విధముగా గురువు ధారణాలక్షణంబు నుపదేశించి, తదుపరి ధ్యానలక్షణంబును బోధింపఁదొడంగి, ప్రథమంబున తన్మహిమను కీర్తించుచున్నాఁడు.

### ధ్యానము.

శ్లో. తపేద్వర్షసహస్రాణి ఏకపాదస్థితో నరః,
ఏతస్య ధ్యానయోగస్య కలాం నార్హంతి షోడశీమ్.౭౯.

తా. మనుష్యుఁడు ఒక్క కాలితో నిలిచికొని వేయిసంవత్సరములు తపస్సుచేసినను, అది ధ్యానయోగము యొక్క పదునాఱింట నొకభాగమునకు సమానముకాదు.

వి. ధ్యానమనఁగా ఉపాసన యని భావము.

అవ. ఇట్లుపదేశించి ధ్యానంబునకు విషయంబైన ధ్యేయవస్తువునందు లక్ష్యంబు నుంచుటకై తత్స్థానంబును తెలియఁజేయుచున్నాఁడు.

### పరమాత్మధ్యాన స్థానము.

శ్లో. అంగుష్ఠమాత్రమాత్మాన మధూమ జ్యోతిరూపకమ్,
ప్రకాశయంత మంతస్థం ధ్యాయేత్కూటస్థ మవ్యయమ్.

తా. అంగుష్ఠ ప్రమాణముగలవాఁడును, పొగలేని జ్యోతిస్వరూపముగలవాఁడును, హృదయమునందుండి (సర్వమును) ప్రకాశింపఁజేయువాఁడును, నాశములేనివాఁడును, అగు ఆత్మయైన కూటస్థుని ధ్యానము చేయవలయును.

వి. పరమాత్మను హృదయకమలంబునందు భావింపవలయును. ఇదే పరమాత్మకు స్థానము. ఇట్లనియే శాండిల్యవిద్యయందును, దహరవిద్యయందును చెప్పంబడియున్నది. అయినను, చాక్షుష్మతీవిద్యాభ్యాసులైనవారు పరమాత్మను నేత్రస్థానంబునందు ధ్యానించెదరు. ఇట్లే ఉపకోసలవిద్యయందు పరమాత్మకుస్థానము నేత్రమని చెప్పంబడియున్నది. ఈ విషయ

మును ఛాందోగ్యము, తైత్తిరీయము మొదలగువానియందుఁ గనందగును. కూటస్థుఁడనఁగా, నిర్వికారస్వరూపుఁడు, అసంగుఁడు, అని తెలియునది. కూటమనఁగా కమ్మరవాని దాకలి. అనఁగా దాకలివలె పరమాత్మ వికారమును బొందనివాఁడని భావము. ఈ విషయమును 'విచారసాగరము చతుర్థతరంగము' నందుఁ గనందగును. ఇచ్చట పరమాత్మను అంగుష్ఠప్రమాణంబని చెప్పఁబడియున్నది. జీవాత్మ ప్రమాణం బెంతయనఁగా, "వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్యచ, భాగోజీవ స్సవిజ్ఞేయ స్సచానంతాయ కల్ప్యతే" అనఁగా, కేశముయొక్క నూటింట నొక్కభాగములో నూఱవభాగ మెంత సూక్ష్మమో, అంత సూక్ష్మముగా జీవుఁడున్నాఁడు. ఆజీవుఁడు లెక్కింప నలవికానివాఁడు. ఈ జీవుఁడు హృదయమునందుండు అంగుష్ఠమాత్రుండైన పరమాత్మ సమీపంబున అణుమాత్రముగానున్నాఁడు. జీవుఁడు జాగ్రత్స్వప్న సుషుప్తుల యందుండునట్టి స్థానమును 41-పుటయందలి 'అవస్థాత్రయనిరూపణపథకము'ను జూచిన బోధమగును.

అవ. పరమాత్మధ్యానమును ఏకాంతముగ నాచరింపవలయు నని బోధించుచున్నాఁడు.

## ఏకాంతవాసము.

శ్లో. ఏకాకీ చింతయే న్నిత్యం వివిక్తే హితమాత్మనః,
ఏకాకీ చింతయానో హి పరం శ్రేయోఽధిగచ్ఛతి. ౮౧.

తా. ఎల్లపుడును రహస్యప్రదేశమునందు (ఏకాంతముగా) వసియించి, ఆత్మహితమునుగూర్చి చింతింప (ధ్యానింప) వలయును. ఇట్లు ఏకాకియై (ఒంటరియై) ధ్యానము చేయు పురుషుండు శ్రేష్ఠమైన మోక్షసుఖమును బొందుచున్నాఁడు.

అవ. అభ్యాసయోగులకు సంగము కూడదనియును, నిస్సంగమే ముక్తిప్రదం బనియును బోధించుచున్నాఁడు.

సంగరహిత ప్రయోజనము.

శ్లో. నిస్సంగతా ముక్తిపదం యతీనాం
సంగా దశేషాః ప్రభవన్తి దోషాః,
ఆరూఢయోగోఽపి నిపాత్యతేఽధః
సంగేన యోగీ కిముతాఽల్పసిద్ధిః. ౮౨.

తా. ప్రయత్నముగల పురుషులకు సంగముయొక్క అభావము (ఏకాంతము)తోఁగూడిన రాగద్వేషాది రహితస్థితియే మోక్షపదము. సంగముచే సకలదోషములును కల్గుచున్నవి. యోగారూఢపురుషుఁడుకూడ సంగముచేత భ్రష్టుఁ డగుచున్నాఁడనఁగా, అల్పసిద్ధిగలయోగి భ్రష్టుఁడగు ననుటయందు చెప్పవలసిన దేమున్నది? (అనఁగా సంగముచే ఆరూఢులే భ్రష్టులగునపుడు అభ్యాసయోగులు భ్రష్టులగుటయందు సందేహము లేదని భావము).

వి. అంతశ్శత్రువులైన కామ క్రోధా ద్యరిషడ్వర్గములే సంగమని రాజయోగుల యభిప్రాయము.

అవ. ఆచార్యుఁ డిట్లుపదేశింపఁగా, శిష్యుఁడు—స్వామీ! ఏకాంతముగనుండి హృదయంబునందు పరమాత్మను ధ్యానము చేయవలయునని బోధించితిరి. ఆపరమాత్మ సాధనప్రకరణంబునందు సగుణ నిర్గుణములుగను, ప్రబోధప్రకరణంబునందు కేవలము నిర్గుణముగ నున్న ట్లుపదేశించితిరి. ఇపుడు ఈ రెంటియందు దేనిని ధ్యానింప వలయునని యడుగఁగా, ఆచార్యుం డిట్లనుచున్నాఁడు.

సగుణధ్యాన ప్రయోజనము

శ్లో. సర్వచింతాంపరిత్యజ్య సావధానేన చేతసా,
నారాయణానుసంధేయో యోగసామ్రాజ్యమిచ్ఛతి. ౮౩.

తా. యోగసామ్రాజ్యమును గోరినవాఁడు సమస్తమైన చింతలను విడిచి సావధానమనస్కుఁడై నారాయణశబ్దవాచ్యుఁడైన పరమాత్మను ('నారాయణ' అని) అనుసంధానము (ధ్యానము) చేయవలయును.

వి. "తతో నారాయణస్సాక్షాత్ హృదయే సుప్రతిష్ఠితః" అనఁగా, సాక్షాత్ నారాయణమూర్తియే హృదయమునందు సుప్రతిష్ఠితమై (దృఢముగా) ఉన్నాఁడు. అని పైంగలోపనిషత్తునందును చెప్పంబడియున్నది. మఱియును, "ధ్యానేన విష్ణు హరయో ర్వారణీయా హి యోగినా" అనఁగా, విష్ణుమూర్తిని శివుని ధ్యానించుటచేత యోగవిఘ్నములు తొలఁగింపఁ దగినవి. అనియును జెప్పంబడి యుండుటం బట్టియు, భగవంతుఁడు నిర్గుణుండయ్యును "యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్" అనఁగా ఎవఁ డెవఁ డెట్లెట్లు నన్నుధ్యానించి శరీరమును విసర్జించినను అట్లట్లు వాని వానికి సాక్షాత్కారమై ముక్తినొసంగెదనని యానతిచ్చి యుండుటంబట్టియు, భగవద్భక్తు లనేకులు సగుణోపాసనముచేత అర్చిరాది మార్గము (దేవయానమార్గము, లేక ఉత్తరాయనమార్గము)గా శాశ్వతపదవి నొందియుండుటంబట్టియు, సగుణోపాసనముచేతను ముక్తిలభించును. ఈ విషయమును 'విచారసాగరము'నందుఁ గనందగును. ఇదియునుంగాక, అభ్యాసికి నిరాలంబనమునందు దార్ఢ్యంబు ప్రథమంబునం గల్గుట దుర్లభంబగుటంబట్టి, సగుణధ్యానమునుచేయుటవలనను ముక్తికి ప్రతిబంధకము లేదు. ఈ విషయమును మున్ను సంగ్రహముగాఁ జెప్పఁబడియున్నను, తద్దార్ఢ్యంబు కొఱకు ఇచ్చటఁ జెప్పఁబడినదని యెఱుంగవలయును.

అ. ఆచార్యుఁడిట్లుపదేశించి, మఱియును నిర్గుణధ్యానదార్ఢ్యంబు కలుగునంతవఱకును, సర్వత్ర బ్రహ్మాఽభిన్న భావంబు కలిగి సకలకర్మల నాచరించినవానికిని ముక్తి కల్గునని బోధించుచున్నాఁడు.

## స్వారాజ్యప్రాప్తి.

శ్లో. సర్వభూతేషుచాత్మానం సర్వభూతాని చాత్మని,
సమం పశ్య న్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి. ౨౮.

తా. ఎవఁడు జ్ఞానముచేత జంగమస్థావర రూపంబైన సకలభూతములందును పరమాత్మ వసించుచున్నాఁడనియును, ఆపరమాత్మయందు సకల ప్రపంచము నున్నదనియును ఎఱింగి, తాఁ జేయు నిత్యకర్మలను, జ్యోతిష్టోమాది యాగకర్మలను, ఫలాపేక్ష లేక బ్రహ్మార్పణము చేయుచున్నాఁడో వాఁడు స్వయంప్రకాశుఁడై స్వారాజ్యమును (మోక్షమును) పొందుచున్నాఁడు.

వి. " శ్లో. సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని, యదా పశ్యంతి భూతాత్మా బ్రహ్మసంపద్యతే తదా." అనఁగా, ఈ జీవుఁడు, తన్ను సకల భూతములయందును, సకల భూతములను తనయందును ఎప్పుడు చూచునో అప్పుడు బ్రహ్మ మగుచున్నాఁడు. అని భగవద్గీతయందును చెప్పఁబడి యున్నది.

అవ. ఆచార్యుం డి ట్లుపదేశింపఁగా, శిష్యుఁడు—స్వామీ! పరమాత్మ నిర్గుణుం డని విశేషముగా ననువదించితిరికదా? యట్టి నిర్గుణ ధ్యానం బెప్పుడు సిద్ధించు నని యడుగఁగా నిట్లనుచున్నాఁడు.

## ద్వైతలక్షణము.

శ్లో. ప్రత్యక్బ్రహ్మైక్యతాజ్ఞానాత్ ద్వైతవసుసముద్గతమ్. ౮౫.

తా. జీవుఁడును బ్రహ్మమును నొక్కటేయని తెలిసికొనని అజ్ఞానముచేత ద్వైతజ్ఞానము కల్గెను.

[ఇచ్చట రహస్యమేమనఁగా, శిష్యునకు ఇంకను అద్వైతజ్ఞానము కలుగలేదనియును, అది కలిగినచో నిట్టిసంశయము కలుగదనియును బోధింపఁదొడంగినాఁ డని తెలియునది].

## పరమాద్వైత లక్షణము.

శ్లో. సర్వాకారతయా సామ్యం పరమాద్వైత లక్షణమ్,
ఉపైతినాత్ర సందేహః కర్తవ్యంచ ముముక్షుభిః. ౮౬.

తా. సకలవిధములయందును సామ్యము (సమముగా నుండునట్టి స్థితి) ఎదియో, అదే పరమాద్వైత లక్షణమగును. ఈ విషయమునందు ముముక్షువులు ఎంతమాత్రమును సందేహింపఁ గూడదు.

వి. సామ్యమనఁగా జీవుఁడును బ్రహ్మము నొక్కటే యనుట. ఇట్టి స్థితి యెట్లుకల్గుననఁగా, జ్ఞానముచే అవిద్య నశించినయెడల జీవుఁడు చిన్మాత్రస్వరూపుఁడగును. అపుడు జీవబ్రహ్మలకైక్యము (సామ్యము) కలుగునని భావము.

శ్లో. చైతన్యస్యైకరూపత్వాత్ భేదోయుక్తో న కర్హిచిత్,
జీవత్వం చ తథా జ్ఞేయం రజ్జ్వాంసర్పగ్రహో యథా.

తా. చైతన్యము ఒకేరూపము కలదికావున, ఎప్పుడును భేదమైనదికాదు. దారమునందు పాము అనెడి భ్రాంతివలె జీవునిస్థితిని యెఱుంగవలయును.

శ్లో. యద్వన్మృదిఘటభ్రాన్తిః శుక్తౌ హి రజత స్థితిః,
తద్వద్బ్రహ్మణిజీవత్వం వీక్షమాణో వినశ్యతి. ౮౮.
యదా మృది ఘటోనామ కనకే కుండలాభిధా,
శుక్తౌ హి రజతఖ్యాతిః జీవశబ్ద స్తథా పరే. ౮౯.

తా. మృత్తికయందు కుండయనెడి భ్రాంతియును, ముత్తెపుచిప్పయందు వెండియనెడి భ్రాంతియును ఎట్లో, అట్లు బ్రహ్మమునందు జీవునిస్థితి యని తెలియ వలయును దానిని తెలిసికొనినయెడల, (జీవునిస్థితి) నశించి పోవుచున్నది. మృత్తికయందు కుండ యనెడి నామమును, స్వర్ణమునందు కుండలమనెడి నామమును, శుక్తియందు వెండియనెడి ఖ్యాతియును ఎట్లో, అట్లు బ్రహ్మమునందు జీవుఁడనెడి శబ్దమును కలిగియున్నది.

శ్లో. సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమ వివర్జితమ్,
బ్రహ్మరూపతయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయమ్.

తా. సర్వసాక్షిగను, వర్ణాశ్రమ రహితమైనదిగను నుండు (తన యొక్క) ఆత్మస్వరూపమును బ్రహ్మస్వరూపముగాఁ జూచువాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడు.

శ్లో. త్రిధామసాక్షిణం సత్య జ్ఞానానందాది లక్షణమ్,
త్వమహం శబ్దలక్ష్యార్థం మసక్తం సర్వదోషతః. ౯౧.
సర్వగం సచ్చిదానందం యోగదృష్టి ర్నిరీక్షతే.

తా. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకు సాక్షిగను, సత్యజ్ఞానానంద లక్షణములు గలదిగను, నీవు నేను అనెడి పదములకు లక్ష్యార్థమైనదిగను, ఏదోషములతోడను సంబంధపడనిదిగను, సర్వత్రవ్యాపించినదిగను, సచ్చిదానందమైనదిగను, నుండు బ్రహ్మమును యోగదృష్టికలవాఁడు చూచుచున్నాఁడు.

అవ. పరమాత్మను ధ్యానముచేయునట్టి యోగులు తచ్ఛబ్దవాచకమైన ప్రణవమును (ఓంకారమును) (గురూపదేశమొంది) ధ్యానముచేయుచున్నారని బోధించుచున్నాఁడు.

ప్రణవ ధ్యానము.

శ్లో. ప్రణవో హి పరబ్రహ్మ ప్రణవః పరమంపదమ్, ౯౨.
ప్రణవం సర్వవేదాగ్ర్యం సర్వదేవమయం విదుః.
సర్వేషాం చైవ మన్త్రాణాం ప్రణవః ప్రాణ ఉచ్యతే.

తా. ప్రణవమే పరబ్రహ్మము, ప్రణవమే మోక్షపదము, ప్రణవమే సకలవేదములకును మూలము, ప్రణవమే సకలదేవతలు, అని తెలియవలయును. ప్రణవమే సకలమంత్రములకును జీవముగానున్నదని చెప్పఁబడుచున్నది.

శ్లో. ఓంకారప్రభవా వేదాః ఓంకారప్రభవా స్స్వరాః,
ఓంకారప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమ్.

తా. ఓంకారమునందుండియే నాలుగువేదములును కలిగెను. ఓంకారమునుండియే ఉదాత్తాది సకలస్వరములును (నాదమును) కలిగెను. ఓంకారమువలననే సర్వమును కలిగెను. ఓంకారమువలననె త్రిలోకములును సకల చరాచరములును కలిగెను.

వి. ప్రణవోపాసనమును 'అహంగ్రహధ్యాన' మనియును జెప్పఁబడును. ఈ విషయమును 'విచారసాగరమునందుఁ గనందగును. మూఁడున్నర మాత్రగల (అ - ఉ - మ - అర్ధమాత్ర) ప్రణవమును జపించిన యెడల యోగసిద్ధి కల్గును. మఱియు, ఈశ్వరునికి ఓంకారము వాచకమనియును, ఓంకారమునకు ఈశ్వరుఁడు వాచ్యమనియును, ఇట్లు నిత్యసంబంధ ముండుటవలన ప్రణవజపము యోగికి ఆవశ్యకమని తెలియునది. ఈ ఓంకారమునకే నాదమనియు, శబ్దగుణమనియు, పరా - పశ్యంతి - మధ్యమా - వైఖరీ - అను చతుర్విధవాక్కనియు, జెప్పంబడును. ఈనాదము బిందువు, కలా, అను రెంటితోఁగూడియుండును. బిందు వనఁగా, ఓంకారముయొక్క అలక్ష్యార్థరూపమైన తురీయపదము. కలా అనఁగా, ఓంకారముయొక్క అకారాది మాత్రయైన పరావాగ్రూపమగు శబ్దావయవము. ఎట్లనఁగా, "శ్లో. పరాప్రాణమయీప్రోక్తాపశ్యన్తీచమనోమయీ, మధ్యమా ఇంద్రియా జ్ఞేయాః వైఖరీవా గితిస్మృతాః. అనఁగా, పరావాక్కు ప్రాణమయమనియును, పశ్యంతీవాక్కు మనోమయమనియును, మధ్యమావాక్కు ఇంద్రియమయ మనియును, వైఖరీవాక్కు వాఙ్మయ (వేద) మనియును తలంపఁబడుచున్నది. మఱియు, పరావాక్కునకు స్థానము నాభిప్రదేశము. పశ్యంతీవాక్కునకు స్థానము హృదయము. మధ్యమావాక్కునకు స్థానము కంఠము. వైఖరీవాక్కునకు స్థానము వాక్కు. అనఁగా, నాభిస్థానంబునందు సంకల్పము కలుగుచున్నది. హృదయస్థానమునందు ఆసంకల్పము వృద్ధియగుచున్నది. కంఠస్థానమునందు ఆసంకల్పము దృఢమగుచున్నది. వాక్కుస్థానంబునందు ఆసంకల్పము నిశ్చయమగుచున్నది. ఈసంకల్పముయొక్క మూలము (పరావాక్కు) నశించినయెడల తురీయపదము (బ్రహ్మానందము) కల్గును. సంకల్పరాహిత్యమే మోక్ష మను

టుకుం ప్రమాణము. "శ్లో. సశాంత సర్వసంకల్పా యా శిలావ దవ స్థితిః, జాగ్రన్నిద్రావినిర్ముక్తా సా స్వరూపస్థితిః పరా". అనఁగా సకల సంకల్పములును శాంతి బొందినదై, జాగ్రన్నిద్రా ద్యవస్థలులేనిదై, శిల (ఱాయి) వలె నుండునట్టిస్థితియే శ్రేష్ఠమైన స్వరూపస్థితి. (స్వరూపావస్థాన రూపమోక్షము). అని చెప్పఁబడియున్నది.

అవ. ప్రణవోపాసనా ప్రకారము నుపదేశించుచున్నాఁడు.

శ్లో. ప్రణవోధనుశ్శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే,
మనసాతోపపన్నేన దృశ్యతే సూక్ష్మదర్శిభిః. ౯౫.

తా. ఓంకారము విల్లుగాను, ఆత్మ బాణముగాను, బ్రహ్మము గుఱిగాను చెప్పఁబడుచున్నది. అందువలన యుక్తమనస్సుచేతను, సూక్ష్మదృష్టి గలవారిచేతను (బ్రహ్మము) చూడఁబడుచున్నది.

[ఇచ్చట రహస్యముగలదు. దానిని గురుముఖముగా నెఱుంగఁదగును, కావున విస్తరింపలేదు].

శుద్ధరాజయోగ ధ్యానము.

శ్లో. సోహం చిన్మాత్ర మేవేతి చిన్తితం ధ్యాన ముచ్యతే. ౯౬.

తా. చిన్మాత్రంబైన బ్రహ్మమే 'నేను' అని చింతించుటయే ధ్యానమని చెప్పఁబడుచున్నది.

అవ. ఆచార్యుండు ధ్యానలక్షణంబు నుపదేశించి, సమాధిలక్షణంబును బోధింపందొడంగి తత్ప్రభావంబును అనువదించుచున్నాఁడు.

సమాధి.

శ్లో. సమాధినిర్ధౌతమలస్య చేతసో
నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్,
నశక్యతే వర్ణయితుం గిరా తదా
స్వయం తదంతఃకరణేన గృహ్యతే. ౯౭.



తా. సమాధిచేత చక్కఁగా శుద్ధముచేయఁబడినదియును, ఆత్మయందుంపఁబడినదియును, అగు మనస్సునకు ఏసుఖము కల్గుచున్నదో, దానిని వాక్కుచేఁ జెప్పుటకు సాధ్యముకాదు. అనుభవముచేతనే గ్రహింపవలయును.

వి. అనఁగా, మనస్సును ఆత్మయందు లయింపఁజేసినయెడల బ్రహ్మానందము కల్గుననియును, ఆ యనుభవము చెప్పుటకు వలనుపడదనియును భావము.

శ్లో. ఉదితౌదార్యసౌందర్య వైరాగ్యరసగర్భిణీ,
ఆనందస్యందినీ యైషా సమాధి రభిధీయతే. ౯౮.

తా. దేనివలన ఔదార్యము, సౌందర్యము, వైరాగ్యము అను వీనియొక్క రసము గర్భమందుకలదై బ్రహ్మానందమును ప్రవహింపఁజేయుచుండునో అదే సమాధి యని చెప్పఁబడుచున్నది.

వి. ఔదార్యమనఁగా, స్వానుభవమైన జ్ఞానవిద్యను దానము చేయుట. సౌందర్యమనఁగా, జ్ఞానమువలన కల్గిన తేజస్సు. వైరాగ్యమనఁగా, ఇహపరలోకములయందు వాంఛలేకుండుట. అని భావము.

శ్లో. దృశ్యాసంభవబోధేన రాగద్వేషాది తానవే,
రతిర్బలోదితా యాసౌ సమాధి రభిధీయతే. ౯౯.

తా. ఈ కనంబడునట్టి ప్రపంచముయొక్క లేమియును, రాగద్వేషాది నాశమును, జ్ఞానముచేత కలుగుచుండఁగా, ఏయొక్క ఆనందము జ్ఞానాదులయొక్క బలమువలన కలుగుచున్నదో, అదియే సమాధి యని చెప్పఁబడుచున్నది.

శ్లో. యత్సమత్వం తయో రత్ర జీవాత్మపరమాత్మనోః,
సమస్తనష్టసంకల్పః సమాధి రభిధీయతే. ౧౦౦.

తా. ఎప్పుడు జీవాత్మ పరమాత్మలకు ఐక్యము (సమత్వము) కలుగుచున్నదో, అప్పుడు సకలసంకల్పములును నశించి (పోవుచున్నది. అదియె) సమాధి యని చెప్పఁబడుచున్నది.

శ్లో. సలిలేస్సైంధవంయద్వత్ సామ్యం భవతి యోగతః,
తథాత్మమనసోరైక్యం సమాధి రభిధీయతే. ౧౦౧.

తా. ఏప్రకారముగా నీటియందు ఉప్పు కరిగి (జలమయమై) సామ్యము నొందిన దగుచున్నదో, అట్లు మనస్సును ఆత్మయును ఏకమగుట సమాధి యని చెప్పఁబడుచున్నది.

శ్లో. అహమేవ పరంబ్రహ్మ బ్రహ్మాహ మితి సంస్థితః,
సమాధి స్సతు విజ్ఞేయ స్సర్వవృత్తివివర్జితః. ౧౦౨.

తా. 'నేను' శ్రేష్ఠమైన బ్రహ్మమనియును, బ్రహ్మమే 'నేను' అనియును, భావించియుండునట్టి స్థితి యెదియో అదియే సకలవృత్తి రహితమైన సమాధి యని తెలిసికొనుము.

శ్లో. త్యక్త్వా విషయభోగంచ మనోనిశ్చలతాం గతమ్,
ఆత్మశక్తిస్వరూపేణ సమాధిః పరికీర్తితః. ౧౦౩.

తా. విషయభోగములను విడిచి నిశ్చలమును (స్థిరత్వమును) పొందిన మనస్సునకు ఆత్మశక్తిస్వరూపావస్థ కల్గుటచే సమాధి యని చెప్పఁబడుచున్నది.

శ్లో. అహంబ్రహ్మేత్యవస్థానం సమాధి రభిధీయతే.

తా. 'నేనే బ్రహ్మము' అనెడి స్థితియే సమాధి యని చెప్పఁబడుచున్నది.

అవ. ఆచార్యుఁడు ఇట్లు బోధించి మఱియును, సమాధిభేదంబులను అనువదించుచున్నాఁడు.

సమాధి భేదములు.

శ్లో. సవికల్పో నిర్వికల్పో సమాధి ర్ద్వివిధోమతః. ౧౦౪.

తా. సవికల్పమనియు, నిర్వికల్పమనియు సమాధి రెండువిధము లుగా చెప్పఁబడియున్నది.

## సవికల్పసమాధి భేదము.

శ్లో. దృశ్య శబ్దానుభేదేన సవికల్పః పున ర్ద్విధా. ౧౦౫.

తా. ఆ సవికల్పసమాధి దృశ్యానువిద్ధమనియును, శబ్దానువిద్ధమని యును, మరియు రెండువిధములుగా నున్నవి.

## దృశ్యానువిద్ధ సమాధి.

శ్లో. కామాద్యాశ్చిత్తగాదృశ్యా స్తత్సాక్షిత్వేన చేతనమ్,
ధ్యాయేద్దృశ్యానువిద్ధోయం సమాధి స్సవికల్పకః.౧౦౬.

తా. కోరికలు మొదలగువానిచేతను (ఫలాపేక్షా సహితమైన కర్మల చేతను), మనస్సునందలి యభిలాషచేతను (అణిమాదిసిద్ధులు వలయు ననెడి యాశచేతను), ఆ సర్వసాక్షియైన సగుణబ్రహ్మమును (హృదయము నందు) ధ్యానించుటయే, దృశ్యానువిద్ధ మను సవికల్పసమాధి యగును.

## శబ్దానువిద్ధ సమాధి.

శ్లో. అసంగస్సచ్చిదానంద స్స్వప్రభో ద్వైతవర్జితః,
అస్మీతి శబ్దవిద్ధోయం సమాధి స్సవికల్పకః. ౧౦౭.

తా. అసంగమైనదియును, సచ్చిదానందస్వరూప మైనదియును, స్వయంప్రకాశ మైనదియును, ఏకమైనదియును, అగు పరబ్రహ్మము నేనై యున్నాఁడను, అనునది శబ్దానువిద్ధసవికల్పకసమాధి యనఁబడును.

వి. 'అహంబ్రహ్మాస్మి' యను శబ్దముతోఁగూడినది శబ్దానువిద్ధమనఁ బడును. మఱియు జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము; లేక ద్రష్ట, దర్శనము, దృశ్యము; లేక ధ్యానము, ధ్యాత, ధ్యేయము ; అను త్రిపుటీ సహితమైన అద్వితీయపరబ్రహ్మము నందుండు అంతఃకరణవృత్తి యొక్క స్థితియే సవి కల్పక సమాధి యనఁబడును.

## బాహ్య త్రిపుటి.

ద్రష్ట—అంతఃకరణోపాధియైన జీవచైతన్యము.

దృక్కు—త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు.

దృశ్యము—శబ్ద స్పర్శ రూప రస గంధములు.

## అంతర త్రిపుటి.

ద్రష్ట—నిర్మలాంతఃకరణమైన మనస్సునందుండు శుద్ధసత్త్వోపాధికుఁడైన జీవచైతన్యము.

దృక్కు—సగుణబ్రహ్మ సాక్షాత్కారమునకు సాధకమైన శుద్ధమనస్సునందు జనించిన బుద్ధివృత్తి యనెడి జ్ఞానము.

దృశ్యము—ఉపాస్యుఁడైన సగుణబ్రహ్మము.

## అంతరాంతర త్రిపుటి.

ద్రష్ట—కేవలము నిరుపాధికుఁడై వ్యష్టిభావమును బొందిన శుద్ధజీవాత్మ.

దృక్కు—నిర్వృత్తికమైన స్వరూపోపాధియగు ఆత్మజ్ఞానమునందు వ్యష్టిసమష్టిభావమును కలుగఁజేసి బ్రహ్మస్వరూపమునకు భిన్నముగాని వ్యష్టియైన జీవాత్మను, సమష్టియైన పరమాత్మను ప్రత్యక్షము చేయునట్టి జ్ఞానము.

దృశ్యము—బాహ్యోపాధిలేక కేవలము స్వరూపోపాధిచేత నిర్గుణబ్రహ్మమునందే వ్యష్టిసమష్టిభావ ముదయమై, తదుపరి సమష్టియైన శుద్ధబ్రహ్మమునందే దార్ఢ్యము కలుగునట్టి స్థితి.

## త్రిపుటీ రహస్యము.

బాహ్యత్రిపుటియందు ద్రష్ట్ర దర్శన దృగ్వ్యాపారమును, అంతస్త్రిపుటియందు సవికల్పక సమాధియును, అంతరాంతర త్రిపుటియందు నిర్వికల్పక సమాధియును, కలుగుచున్నది.



మఱియొకవిధము—బాహ్య త్రిపుటియందు ప్రపంచ విచారమును, అంత స్త్రిపుటియందు సగుణబ్రహ్మవిచారమును, అంతరాంతర త్రిపుటి యందు నిర్గుణబ్రహ్మవిచారమును కలుగుచున్నది.

ద్రష్ట—త్వంపద లక్ష్యభూతుఁడైన ప్రత్యగాత్మ.

దృశ్యము —తత్పద లక్ష్యభూతుఁడైన పరమాత్మ.

దృక్కు—ప్రత్యగాత్మ పరమాత్మలను ఐక్యముచేయునట్టి జీవాత్మ.

## నిర్వికల్ప సమాధి.

శ్లో. స్వానుభూతిరసావేశా ద్దృశ్యశబ్దానపేక్షితః,
నిర్వికల్పసమాధిస్స్యా న్నివాతస్థితదీపవత్. ౧౦౮.

తా. స్వానుభవమైన యానందముతోఁ గూడినదియును; దృశ్యము శబ్దము అను నీరెండు (సవికల్ప) సమాధులను అపేక్షింపనిదియును; గాలి లేని స్థలమందుంచిన దీపమువలె నిశ్చలమైనదియును; అగునట్టి స్థితియే నిర్వి కల్ప సమాధి యగును.

వి. దీనికి సహజసమాధి యనియును, జ్ఞానసాధ్య రాజయోగ మనియును చెప్పఁబడును. సవికల్పక సమాధిని సంప్రజ్ఞాత మనియును, నిర్వికల్పక సమాధిని అసంప్రజ్ఞాత మనియును జెప్పుదురు.

## అతద్వ్యావృత్తిరూప సమాధి.

శ్లో. ప్రభాశూన్యంమనశ్శూన్యం బుద్ధిశూన్యం చిదాత్మకమ్,
అతద్వ్యావృత్తిరూపోఽసౌ సమాధి ర్మునిభావితః. ౧౦౯.

తా. జాగ్రద్వాసనలును, మానసికవాసనలును, కారణావిద్యా సుషుప్తివాసనలును లేనట్టి దశ యెదియో, అది జ్ఞానులచే భావింపఁబడు చుండు అతద్వ్యావృత్తిరూపసమాధి (సకలపదార్థములను నిషేధించుటయే స్వరూపముగాఁగల నిరుపాధికస్వరూపావస్థదశ, లేక శుద్ధ బ్రహ్మానంద స్వరూపసమాధి) యగుచున్నది.

## విధిరూప సమాధి.

శ్లో. ఊర్ధ్వపూర్ణ మధఃపూర్ణః మధ్యపూర్ణం శివాత్మకమ్,
సాక్షాద్విధిముఖోహ్యేష స్సమాధిః పారమార్థికః.

తా. మీఁదను, క్రిందను, నడుమను, నిండియున్నట్టి సర్వపరిపూర్ణ బ్రహ్మానందదశయే, శాస్త్రసిద్ధమైన విధిరూప సమాధి యగును.

వి. బ్రహ్మజ్ఞాని, సర్వత్రా ఆత్మస్వరూపముగనే చూచుచుండును.

## సంప్రజ్ఞాత సమాధి.

శ్లో. బ్రహ్మాకారమనోవృత్తి ప్రవాహోఽహంకృతింవినా,
సంప్రజ్ఞాతసమాధిస్స్యా ద్ధ్యానాభ్యాస ప్రకర్షతః. ౧౧౧.

తా. అహంకారములేక నిరంతరమును శ్రేష్ఠమైన ధ్యానాభ్యాసముచేత, బ్రహ్మాకారము నొందిన మనోవృత్తిప్రవాహ మెదియో, అదియే సంప్రజ్ఞాతసమాధి యగుచున్నది.

వి. మనస్సు తెలియఁబడుచుండుట సంప్రజ్ఞాతము. దీనికి సబీజ సమాధియనియు పేరుకలదు. ఈదశయందు మనస్సుయొక్క వృత్త్యాకారము తెలియుచుండును. ఇట్టి స్థితియందుండువారే జీవన్ముక్తులు. మఱియు, భక్త్యతిశయముచేత ఫలాపేక్షారహితమైన సత్కర్మలానర్చి ఈశ్వరార్పణము చేయువారికిని, ఈశ్వరోపాసనము చేయువారికిని, ఈ సంప్రజ్ఞాతసమాధి శీఘ్రముగా సిద్ధించును ఈవిషయమును 'భగవద్గీతా షష్ఠాధ్యాయము' నందుఁ గనందగును.

## అసంప్రజ్ఞాత సమాధి.

శ్లో. ప్రశాంతవృత్తికంచిత్తం పరమానంద దీపకమ్,
అసంప్రజ్ఞాతనామాయం సమాధిర్యోగినాంప్రియః.

తా. ఎప్పుడు మనస్సు వృత్తిరహితమై బ్రహ్మానందమును ప్రకాశింపఁజేయునది యగుచున్నదో, అప్పుడు ఆసమాధి జ్ఞానయోగులకు ప్రియమైన అసంప్రజ్ఞాతసమాధి యను పేరుగలది యగుచున్నది.



వి. మనస్సు నిశ్శేషముగా లయించుట అసంప్రజ్ఞాతము. దీనికి నిర్బీజ సమాధి యనియు పేరుకలదు. ఈ దశయందు మనస్సుయొక్క వృత్తి తెలియదు. ఇట్టి స్థితియందుండువారే కైవల్యస్థానమును బొందునట్టి విదేహముక్తులు. ఈ సమాధియే రాజయోగులకు సమ్మతమైనది. ఈ విషయమును 'పాతంజలయోగశాస్త్రము' నందును, 'విచారసాగరము' నందును, విస్తరముగాఁ గనందగును.

అవ. ఆచార్యుం డిట్లు బోధించి, సవికల్పక నిర్వికల్పక సమాధుల యొక్క లక్షణములను వేఱువిధముగా నుపదేశించుచున్నాఁడు.

పరోక్షాఽపరోక్షజ్ఞాన లక్షణము.

శ్లో. అస్తిబ్రహ్మేతిచే ద్వేద పరోక్షజ్ఞానమేవ తత్,
అహంబ్రహ్మేతిచేద్వేద సాక్షాత్కారస్సఉచ్యతే. ౧౧౩.

తా. బ్రహ్మముకలదు, అని తెలిసికొనినయెడల అది పరోక్షజ్ఞానము, (పరోక్షజ్ఞానమనఁగా కనులకు కనఁబడక బ్రహ్మమున్నదనెడి జ్ఞానము) అగుచున్నది. నేనేబ్రహ్మము అని తెలిసికొనినయెడల అది సాక్షాత్కార (అపరోక్ష) జ్ఞానము, అని చెప్పఁబడుచున్నది.

వి. పరోక్షమనఁగా సవికల్పకము, లేక సంప్రజ్ఞాతము యనియును; అపరోక్షమనఁగా నిర్వికల్పకము, లేక అసంప్రజ్ఞాతమనియును; భావము.

శుద్ధరాజయోగ సమాధి.

శ్లో. వాచాతీతంమనోతీతం భావాతీతం నిరంజనమ్,
సర్వశూన్యం నిరాకారం సమాధిరభిధీయతే. ౧౧౪.

తా. వాక్కునకును, మనస్సునకును, చింతించుటకును, అలవికానిదియును; జడరహితమైనదియును; సర్వశూన్యమైనదియును; ఆకారములేనిదియును; (ఎదియో, అదే) సమాధి యని చెప్పఁబడుచున్నది.

వి. ధ్యానము, ధ్యాత, ధ్యేయము, అను నివి మూఁడును లేనిదశయే సర్వశూన్య మనఁబడును. ఇట్లని తేజోబిందూపనిషత్తునందును చెప్పఁబడి

యున్నది. మఱియు ధ్యానస్వరూపముయొక్క ఫలమే యోగాంగ మైన సమాధి యని విచారసాగరమునందును చెప్పంబడి యున్నది.

[ఇచ్చట రహస్యముకలదు. ఏమనఁగా:— సుషుప్త్యవస్థకును సమాధ్యవస్థకును భేదమేమి యని కొందఱికి సంశయము కలుగవచ్చును. అయినను, సమాధ్యవస్థయందు అంతఃకరణముండుటవలన శరీరము స్మృతి లేక పడిపోవుటలేదు. సుషుప్త్యవస్థయందు అంతఃకరణము లేనందున శరీరము విస్మృతి నొంది పడిపోవుచున్నది].

అవ. ఆచార్యుఁ డిట్లుపదేశించి, రాజయోగులు కొందఱు యోగ చతురంగమునుమాత్రమే యవలంబించెదరని తెలియఁజేయుచున్నాఁడు.

## యోగ చతురంగము.

శ్లో. మహావాక్యస్తదర్థాను సంధానం శ్రవణం భవేత్,
యుక్త్యాసంభావితత్వాఽను సంధానం మననం భవేత్.
తాభ్యాం నిర్విచికిత్సేఽర్థే చేతస స్థాపితస్య తత్,
ఏకతానత్వ మేతద్ధి నిదిధ్యాసన ముచ్యతే. ౧౧౬.
ధ్యాతృ ధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరమ్,
నివాతదీపవ చ్చిత్తం సమాధి రభిధీయతే. ౧౧౭.

తా. తత్త్వమస్యాది మహావాక్యములచేత, ఆ మహావాక్యములకు అర్థములైనట్టి జీవబ్రహ్మైక్య లక్షణమైన అర్థమును (గురువుచెప్పినదానిని) అనుసంధించుట శ్రవణ మగును. (గురువువలన)యుక్తిచేత విన్నయర్థము యుక్తియుక్తముగ నున్నదని కలిగిన జ్ఞానము మననము అగును. ఆ శ్రవణమననములచేత నిస్సంశయముగాఁజెప్పిన విషయమగు షరబ్రహ్మము నందుంచిన ధారణాబుద్ధి నిదిధ్యాసన మని చెప్పఁబడుచున్నది. ధ్యాతృ ధ్యానములను క్రమముగా విడిచి, వాయుచలనము లేనిచోట నుంచిన దీప

మువలె, చిత్తము ధ్యేయ మైనట్టి ఏకమైన పరమాత్మస్వరూపముగలదిగా నగునట్టి స్థితి సమాధి యని చెప్పఁబడుచున్నది.

వి. నిదిధ్యాసన కాలమునందు ధ్యాత, ధ్యానము, ధ్యేయము, అను నీమూఁడును ప్రకాశించుచుండును. క్రమక్రమముగా ధ్యాతను, ధ్యానమును విడిచిపెట్టవలయునని భావము. [రాజయోగి సంశయములు కలిగినపుడు శ్రవణ, మనన, నిధిధ్యాసనముల నాచరింప వలయు ననుట రహస్యము.]

అవ. పూర్వోక్త తత్త్వమస్యాదివాక్యములయొక్క ప్రయోజనము ననువదించుచున్నాఁడు.

శ్లో. తత్త్వమస్యాదివాక్యంచ తాదాత్మ్యప్రతిపాదనే,
లక్ష్యౌ తత్త్వంపదార్థౌ ద్వా వుపాదాయ ప్రవర్తతే.

తా. తత్త్వమస్యాది మహావాక్యములు త త్త్వం పదములయొక్క లక్ష్యార్థములను పరిగ్రహించి అఖండస్వరూపమును ప్రతిపాదించుటయందు ప్రవృత్తమై యున్నది.

వి. అఖండస్వరూపమనఁగా—దేశ, కాల, వస్తు, పరిచ్ఛేదము లేనిదని భావము. మహావాక్య వివరణమును 158-వ పుటయందుఁ గనంబగును.

అవ. ఆచార్యుం డిట్లుబోధించి రాజయోగులయొక్క చిత్తపరిణామదశావిశేషంబులు వక్ష్యమాణోక్తరీతిగా నుండుననుచున్నాఁడు.

రాజయోగి మనోస్థితి.

శ్లో. అసంగోఽహమనంగోఽహ మలింగోఽహమహంహరిః,
ప్రశాంతోఽహమనంతోఽహం పరిపూర్ణశ్చిరంతనః. ౧౧౯
అకర్తాఽహ మభోక్తాఽహ మవికారోఽహ మవ్యయః,
శుద్ధోబోధస్వరూపోఽహం కేవలోఽహంసదాశివః. ౧౨౦.



తా. నేను దేనినంటనివాఁడను, శరీరము లేనివాఁడను, ప్రమాణములచే నెఱుఁగఁబడనివాఁడను, అజ్ఞానాది దుఃఖములను నశింపఁజేయువాఁడను, మహాశాంతుఁడనైనవాఁడను, దేశకాలాది పరిచ్ఛేదము లేనివాఁడను, జ్ఞానానందములచే సంపూర్ణమైన వాఁడను, శాశ్వతుఁడనై యుండువాఁడను, కర్మములు చేయువాఁడను కాను, కర్మఫలముల ననుభవించువాఁడను కాను, షడ్భావ వికారములు లేనివాఁడను, నాశము లేనివాఁడను, నిర్మలజ్ఞానస్వరూపము కలవాఁడను, అద్వితీయుఁడను, సదా సంతోష (మంగళ, ఆనంద) స్వరూపుఁడను. అనఁగా రాజయోగి యొక్క మనోభావ మీవిధముగా నుండును.

వి. ఇందలి యర్థవిశేషంబుల నిదివఱకుఁ జెప్పినవానివలన నెఱుంగఁదగును. చెప్పఁబడనివానియొక్క విశేషార్థంబులను మాత్ర మిచటచెప్పఁబడును. శరీరము లేనివాఁ డనఁగా:— "శ్లో. ప్రత్యక్ జ్ఞానశిఖిధ్వస్తే మిథ్యాజ్ఞానే సహేతుకే, నేతినేతీతి రూపత్వా దశరీరో భవత్యయమ్." అనఁగా, మిథ్యాజ్ఞానము (జగత్సత్యమనుజ్ఞానము) తత్కారణముతోడ (అవిద్యతోఁగూడ) ఆత్మజ్ఞానమనెడి అగ్నిచే నాశమొందినయెడల, "నేతి నేతి" (ఇది కాదు, ఇది కాదు) అనెడి నిషేధరూపమువలన ఈజ్ఞానియైనవాఁడు శరీరము లేనివాఁ డగుచున్నాఁడు. శరీరము లేనివాఁడనఁగా, జననమరణములు లేని పరమాత్మ యని భావము. శాంతుఁడనఁగా:—"శ్లో. తుషారకరబింబాచ్ఛం మనో యస్య నిరాకులం మరణోత్సవ యుద్ధేషు స శాంత ఇతి కథ్యతే." అనఁగా, ఏజ్ఞానియొక్క మనస్సు మరణమునందును, ఉత్సవమునందును, యుద్ధమునందును, చల్లనికిరణములుగల చంద్రబింబమువలె స్వచ్ఛమైనదై వ్యసనము లేనిదై యుండునో, వాఁడే శాంతచిత్తుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. సంతోషస్వరూపుఁ డనఁగా:— "శ్లో. అప్రాప్తంహి పరిత్యజ్య సంప్రాప్తే సమతాంగతః, అదృష్టఖేదాఽఖేదోయ స్సతుష్ట ఇతి కథ్యతే." అనఁగా, ఏకారణమువలననైనను ఎవఁడు లభించిన వస్తువునందును, లభింపని వస్తువునందును, సమబుద్ధికలవాఁడై, సుఖదుఃఖములనువిడిచినవాఁడై యుండునో, వాఁడు సంతోషి యని చెప్పఁబడుచున్నాఁడు.

లాభాఽలాభాది ద్వంద్వ విషయములందు సమబుద్ధి కలిగియుండవలయు ననుటనుగూర్చి "భగవద్గీత" యందు విస్తరముగాఁ గనందగును.

అవ. ఆచార్యుం డిట్లుపదేశింపఁగా శిష్యుండు పరమానంద భరితుండై మఱియును, ఉపవాసాది విషయంబులయొక్క పరమార్థంబు నెఱింగింపుఁడనఁగా నిట్లనుచున్నాఁడు.

ఉపవాస రహస్యము.

శ్లో. ఉపసమీపే యోవాసో జీవాత్మ పరమాత్మనోః,
ఉపవాస స్సవిజ్ఞేయో నతు కాయస్య శోషణమ్.౧౨౧.

తా. ఉపవాసమనఁగా, జీవాత్మ పరమాత్మలయొక్క సమీపవాసమేగాని దేహమును శోషింపఁజేయుట కాదని తెలియఁదగినది.

సన్న్యాస రహస్యము.

శ్లో. సదా జీవాత్మనోరైక్యం సన్న్యాసః పరికీర్తితః.

తా. సర్వకాలములయందును జీవాత్మ పరమాత్మలయొక్క ఐక్యమెదియో, అదే సన్న్యాసమని చెప్పఁబడుచున్నది.

వి. తక్కిన లక్షణములు సన్న్యాసము కాదని భావము. సర్వకాల సర్వావస్థలయందును జీవబ్రహ్మైక్యానుసంధానమును చేయుచుండునట్టి వాఁడే సన్న్యాసి యనఁబడును. కావుననే జ్ఞానులిట్లుచెప్పియున్నారు— "ద్రవ్యార్థ మన్నవస్త్రార్థం యః ప్రతిష్ఠార్థమేవచ, సన్న్యసేదుభయభ్రష్ట స్సముక్తిం నాప్నుమర్హతి." అనఁగా, ధనముకొఱకును అన్నవస్త్రముల కొఱకును కీర్తికొఱకును ఎవఁడు సన్న్యాసముచేసికొనునో వాఁడు ఇహపరములు రెంటియందును భ్రష్టుఁడు. వాఁడు మోక్షమును బొందుటలేదు.

ఏకదండ రహస్యము.

శ్లో. జ్ఞానదండో ధృతో యేన ఏకదండీ స ఉచ్యతే.౧౨౩.

తా. ఎవనిచేత జ్ఞానదండము ధరింపఁబడియున్నదో, వాఁడు దండి యని చెప్పఁబడుచున్నాఁడు.

వి. ఏకదండి యనఁగా, ఏకమైనట్టి పరబ్రహ్మమునందు ధారణా కలవాఁడని భావము. బాహ్యముగ ఏకదండమును ధరించి తిరుగువాఁ ఏకదండి కాఁడు. ఈ విషయమునే "జ్ఞానదండో ధృతో యేన సర జ్ఞానవర్జితః" అని పరమహంసోపనిషత్తునందును, చెప్పఁబడి యున్నది

## త్రిదండ రహస్యము.

శ్లో. వాగ్దండోఽథమనోదండః కాయదండ స్తథైవచ,
యస్యైతే నిహితాబుద్ధా త్రిదండీతి న ఉచ్యతే.౧౨౩

తా. ఎవఁడు మనోవాక్కాయములను (త్రికరణములను) వె కార్యములందు ప్రవేశింపనీయక దండించుచున్నాఁడో, వాఁడే త్రిద యని చెప్పఁబడునుగాని, త్రిదండమును ధరించినంతమాత్రముచేత త్రిద యని చెప్పఁబడఁజాలఁడు.

శ్లో. త్రిదండీ వ్యపదేశేన జీవంతి బహవో నరాః,
యో హి బ్రహ్మ న జానాతి న త్రిదండార్హ ఏవ స

తా. అనేకులు యతులని చెప్పుకొనుచు జీవనము చేయుచున్నా ఎవఁడు బ్రహ్మము నెఱుఁగఁడో వాఁడు త్రిదండియని చెప్పుకొనుటకు అర్హుఁ కాఁడు.

వి. బ్రహ్మమును, లేక బ్రహ్మలక్షణము నెఱుంగనివారు కపటసన్యా సులు. జీవనము నిమిత్త మీ వేషమును ధరించినారని తెలియఁదగినది.

## పరమపద రహస్యము.

శ్లో. యస్మిన (స్త్రీ)జగత్సృష్టి స్థితి వ్యసనకర్మ కృత్,
తస్మిన్నోవిలయం యాతి తద్విష్ణోః పరమం పదమ్.౧౨



తా. ఏయొక్క మనస్సు మూఁడులోకములయొక్క సృష్టి స్థితి లయములను జేయుచున్నదో, ఆయొక్క మనస్సు లయించిన (నాశమైన) యెడల అదే విష్ణువుయొక్క పరమపదము.

వి. మనోనాశమే పరమపదము (మోక్షము) అని భావము.

శ్లో. నిత్యశుద్ధం బుద్ధముక్తం సత్యమానందమద్వయమ్,
తురీయమక్షరం బ్రహ్మ అహమస్మి పరంపదమ్. ౧౨౬.

తా. నిత్యముగను, శుద్ధముగను, జ్ఞానస్వరూపముగను, సత్యముగను, ఆనందముగను, అద్వితీయమైనదిగను, తురీయమైనదిగను, నుండు బ్రహ్మము నేనైయున్నాఁడను; అనునదే పరమపదము. (మోక్షస్థానము).

పరమార్థ రహస్యము.

శ్లో. న నిరోధో నచోత్పత్తి ర్నబద్ధో నచ సాధకః,
న ముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా. ౧౨౭.

తా. ఆత్మకు చావులేదు, పుట్టుకలేదు, బంధము కలదియుకాదు, (యోగము మొదలగు) సాధకము చేయువాఁడునుకాఁడు. మోక్షేచ్ఛ కలవాఁడునుకాఁడు. ముక్తుఁడునుకాఁడు. ఈ చెప్పఁబడినదే పరమార్థమైనది. (సత్యమైనది).

వి. ఆత్మకు జననమరణములును, బంధమోక్షములును, యోగాది సాధనములును, మోక్షేచ్ఛయును, మోక్షమును, లేదని భావము.

అవ. ఆచార్యుఁడు ఇట్లు బోధించి, మరియును పూర్వోక్త స్థిత ప్రజ్ఞాశాలి యగు బ్రహ్మవేత్తయొక్క చరమావధిని నిరూపించుచున్నాఁడు.

జ్ఞాని చరమావధి.

శ్లో. యత్ర యత్ర మృతో జ్ఞానీ యేన వాకేన మృత్యునా,
యథా సర్వగతం వ్యోమ తత్ర తత్ర లయం గతః.
ఘటాకాశ మివాత్మానం విలయం వేత్తి తత్త్వతః. ౧౨౮.

తా. జ్ఞానియైనవాఁడు ఏయేస్థలములయందు ఏయేవిధముగా మృతి నొందినను సర్వత్రవ్యాపించియుండు ఆకాశమువలె ఆస్థలమునందే లయ మొందుచున్నాఁడు. వాస్తవముగా ఘటాకాశమువలె (మహాకాశము నందు కలిసిపోవునట్లు) ఆత్మ లయ మొందునట్లు తెలియఁదగినది.

వి. బ్రహ్మజ్ఞాని యెచ్చట నేరీతిగా మృతి నొందినను బ్రహ్మముతో నైక్య మగుచున్నాఁడని భావము.

శ్లో. శుద్ధబ్రహ్మేతి యశ్చ సనాయాత్యేవ కుత్రచిత్,
తస్య ప్రాణా విలీయంతే జలే సైంధవపిండవత్ .౧౨౯.

తా. శుద్ధముగా బ్రహ్మోపాసనము చేయువాఁడు ఎచ్చటను పోవుటలేదు. ఆ బ్రహ్మవేత్తయొక్క ప్రాణములు జలమునందు ఉప్పుగడ్డ కలిసిపోవునట్లు, పరమాత్మ యందే, లయ మొందుచున్నవి.

అవ. ఆచార్యుఁ డిట్లు బోధించి, శిష్యునింకను — ఇంకను నీకుం గల సంశయంబుల నడుగుమనఁగా, శిష్యుండు కృతకృత్యుండై సంశయ రహితుండై — స్వానుభవంబును విన్నవించుచున్నాఁడు.

స్వానుభూతి.

శ్లో. ఆత్మాన మంజసా వేద్మి క్వాప్యజ్ఞానం పలాయితమ్,
కర్తృత్వమపి మే నష్టం సంశయం వాపి న క్వచిత్ .౧౩౦.

తా. ఆత్మను వాస్తవముగాఁ దెలిసికొంటిని. అజ్ఞాన మెచటకో పఱుగిడిపోయెను. కర్తృత్వ మనెడి యహంకారము నశించిపోయినది. నాకు సంశయ మనునది కొంచెమైనను లేదు.

శ్లో. న మోక్షో మోక్ష ఈశస్య న బంధో బంధ ఆత్మనః,
బంధ మోక్ష దృశౌ లోకే నజానే ప్రోత్థితే కుతః.౧౩౧.

తా. ఈశ్వరునకు బంధము లేదు. మోక్షము లేదు. ఆత్మయైన జీవునకును బంధము లేదు. మోక్షము లేదు. లోకమునందు బంధమనెడు జ్ఞానమును, మోక్షమనెడు దుజ్ఞానమును దేనియందుండి కలిగినాయెఱుంగను.

శ్లో. మయి జీవత్వ మీశత్వం కల్పితం వస్తుతో న హి.

తా. నాయందు జీవత్వమును, ఈశ్వరత్వమును కల్పితము. వాస్త వమునందు లేదు.

శ్లో. యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ,
ఆనంద మేత జ్జీవస్య యజ్జ్ఞాత్వా ముచ్యతే బుధః. ౧౩౨.

తా. వాక్కు దేనికి లక్షణము చెప్పుటకు సాధ్యము కాక మనస్సుతో మరలెనో, అదే జీవునియొక్క ఆనంద (మంగళ, సుఖ) స్వరూపము. ఇట్లు తెలిసికొనిన బ్రహ్మవేత్త బంధమునుండి విడివడుచున్నాఁడు. (అనఁగా మోక్షము నొందుచున్నాఁడు).

అవ. ఆచార్యుఁడు శిష్యుని మనోస్థితి నెఱింగి, కృతకృత్యుండ వగుమని మంగళాశాసనము చేయుచున్నాఁడు.

అమనస్కము.

శ్లో. జడతాం వర్జయిత్వైకాం శిలాసమం హృదయం హితమ్,
అమనస్క స్వరూపం యత్ తన్మయోభవ సర్వదా. ౧౩౩.

తా. బుద్ధి మాంద్యమును విడిచి, శిల (ఱాయి) వలె (నిశ్చేష్టితమై) బ్రహ్మరూపత్వమును బొందిన మనస్సు ఏదియో, అదే అమనస్క-స్వరూపము. (మనస్సులేని స్వరూపము). (నీవు) సర్వకాలమును తన్మయుఁడ వగుము. (అనఁగా, అట్టి అమనస్క స్వరూపుఁడ వగు మనిభావము).

వి. జ్ఞానియగు శిష్యుని, బుద్ధిమాంద్యమును విడువుమనుటకుం గారణమేమనఁగా, "బలవా నింద్రియగ్రామో విద్వాంస మపకర్షతి" అని భగవంతుఁ డానతిచ్చి యుండుటంబట్టియు, జడభరతాదుల చారిత్రంబులె నిదర్శనంబులుగా గ్రంథములయందు గానంబడుచుండుటం బట్టియు మఱల మనోదార్ఢ్యముకొఱ కిట్లు బోధించినాఁడని భావము. 65 పుటయందలి 'ఇంద్రియబలము' అను విషయమును జూచిన స్పష్టమగును.



నమస్కృతిరూప మంగళము.

శ్లో. నమః కృష్ణాయ దేవాయ బ్రహ్మణేఽనంతశక్తయే,
యోగేశ్వరాయ యోగాయ త్వామహం శరణం గతః.

నిత్యోత్సవో భవే త్తేషాం నిత్యశ్రీ ర్నిత్యమంగళమ్,
యేషాం హృదిస్థో భగవాన్ మంగళాయతనం హరిః.

ఓం తత్సత్.

రాజయోగసారమునందు
చతుర్థప్రకరణము యోగప్రకరణము
సంపూర్ణము.



ఇది సీమందూరు, వైద్యం - శ్రీనివాసయ్య గారి కుమారుఁడు
దొరసామయ్యచే సంపాదింపఁబడినది.

